# S. GANESAN PUBLICATIONS

## 50% Reduction allowed on the Prices.

| Title | Rs. | As. |
|---|---|---|
| Young India | 4 | 0 |
| Supplement | 1 | 8 |
| Indian Home Rule (By M. K. Gandhi) | 0 | 8 |
| To the Students | 1 | 0 |
| Terence Macswiney (By C. F. Andrews) | 0 | 8 |
| The Making of a Re-public (By Kevin R. O'Shiel) | 1 | 8 |
| The Sayings of Kabir | 0 | 8 |
| The Sayings of Thulasidas (By Lala Kanno Mal M.A.) | 0 | 8 |
| The Failure of European Civilization (By S. E. Stokes) | 1 | 0 |
| Principles of Freedom (By Terence Macswiney) | 2 | 0 |
| The Story of My Life (By Bhai Paramanand) | 1 | 8 |
| The Future of Indian Fiscal Policy (By D. V. Divekar) | 0 | 12 |
| The Aims of Labour: An Ideal Commonwealth (By the Rt. Hon Arthur Henderson) | 1 | 0 |
| India in England (By Miss Helena Normanton) | 2 | 0 |
| Indian Currency and Exchange (By K. C. Mahindra B.A.) | 3 | 8 |
| History of England (in Tamil) (By N. Vasudeva Iyer, M.A. L.T.) | 1 | 0 |
| The National Being: Thoughts on an Irish Policy (By A. E. George Russel) | 1 | 0 |
| The Dawn of a New Age And other Essays | 1 | 0 |
| The Duties of Man With Biographical Introduction (By W. W. Pearson) | 1 | 0 |
| Need in Nationalism (By Aurobindo Ghose) | 0 | 8 |
| Landmarks in Lokamanya's Life (By N. C. Kelkar) | 1 | 8 |
| The Gospel of Swadeshi (By Prof. Kalelkar) | 0 | 4 |
| The Philosophy of Art (By D Raghurama Acharya) | 0 | 12 |
| Ideals of Non-Co-operation And other Essays | 1 | 0 |
| The Man and His Work "Josiah C. Wedgewood" (By Lajpat Rai) | 2 | 0 |
| The Truth of Life (By Rabindra Kumar Ghose) | 0 | 8 |
| Ahimsa and World Peace | 1 | 8 |
| The Spiritual basis of Democracy (By Wilfred Wellock) | 3 | 0 |
| Letters from Abroad (By Rabindranath Tagore) | 2 | 0 |
| Faith and the Future | 0 | 12 |
| From the Council of God (By Joseph Mazzini) | 0 | 12 |
| The Revolt of the East | 1 | 0 |
| Food, Mind & Health | 0 | 8 |
| Menace from the West | 0 | 4 |
| The Foreign Policy in India | 0 | 4 |
| Agitate (By Bernard Houghton) | 0 | 4 |
| Rambles in Vedanta (By B. R Rajam Ayyar) | 2 | 0 |
| Hindu Culture (By K. S. Ramaswamy Sastry, B.A., B.L.) | 2 | 0 |
| The Indian Teachers in China (By Phanindranath Bose) | 2 | 8 |
| Nehal the Musician & other Tales (By Snehalata Sen) | 2 | 0 |
| Some Financial Problems of India | 2 | 0 |
| The West (By K. Kunhigannan M.A.Ph.D.) | 2 | 0 |
| Labour in Madras (By B. P. Wadia) | 2 | 8 |
| Satyagraha in Champaran (By Babu Rajendra Prasad) | 2 | 8 |
| Swaraj Constitution (By S. Sreenivasa Iyengar, B.A., B.L.) | 1 | 0 |
| The Aphorisms of Narada (By Lala Kanno Mal, M.A.) | 0 | 8 |
| Women in Hindu Law (By K. T. Bhashyam Iyengar, B.A., B.L.) | 0 | 8 |

*N. B.*—A commission of two annas & four annas Per Rupee is allowed on purchase of not less Than Rs. 10/- & Rs. 20/- respectively (after allowing 50% reduction) at a time. the purchase shall be one book only of every kind in the list of the Catalogue.

For Book Sellers, Libraries etc., special discount will be given on application.

Packing Charges will be free, and Postage or Railway Freight is to be borne by the purchasers.

25% of the amount of the order is to be sent in advance stating clearly the full address. If the books are to be sent by Railway, the name of the nearest Railway Station in bold Types is to be mentioned.

**Ask for our Detailed Catalogue**

**ANDHRA PATRIKA OFFICE,** No. 7, Thambu Chetty Street, MADRAS.

20.6.47

SRI SRI SRI GOPINATH HARICHENDAN JAGA DEV RAJA BAHADUR, P. O. TEKKALI, (District GANJAM.)

# విషయానుక్రమణిక


మాతృహృదయము—వేలూరి శివరామశాస్త్రిగారు ... ... ... ౧౩౫–౧౩౬
కవికోకిల గ్రంథావళి—దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు ... ... ... ౧౩౭–౧౪౬
వెక్కిరింపఁబోయి బోల్తాపడుటయే—శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు ... ౧౪౭–౧౫౧
పద్యానుబంధము—ఆకెళ్ల శేషాద్రిగారు ... ... ... ౧౫౩–౧౫౬
సారస్వత వర్ధమానులు - ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి—దే. విశ్వేశ్వరరావుగారు ... ౧౫౭–౧౬౩
తొలకరి—మల్లవరపు విశ్వేశ్వరరావుగారు ... ... ... ౧౬౪
ప్రాచీనాంధ్రకవులు—నిడుదవోలు వెంకటరావుగారు ... ... ... ౧౬౫–౧౬౮
సందిగ్ధము—తాడి నాగమ్మగారు ... ... ... ౧౬౯–౧౭౮
సుప్రియుడు—"ప్రవాసి" ... ... ... ౧౭౯–౧౮౭
ఋగ్వేదీయసూర్యవర్ణనము—మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ... ... ౧౮౯–౧౯౨
వ్యంగ్య-సినీమాలు—యన్. జగన్నాథస్వామిగారు ... ... ... ౧౯౩–౧౯౬
రేడియము—పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు ... ... ... ౧౯౭–౨౦౬
గురునానకు—శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజులుంగారు ... ... ... ౨౦౭–౨౧౦
సాముద్రికశాస్త్రము—కోటమర్తి చినరఘుపతిరావుగారు ... ... ౨౧౧–౨౧౭
బ్రతుకుతెరువు—వడ్లమన్నాటి కుటుంబరావుగారు ... ... ... ౨౧౮–౨౨౩
ఆంధ్రనాటక కళాపరిషత్తు, చెన్నపురి ... ... ... ౨౨౫–౨౨౯
నా మహారాష్ట్రయాత్ర—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ... ... ౨౩౦–౨౩౭
నక్షత్రమండలము—గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు ... ... ౨౩౮–౨౪౩
కీ. శే. అనిసెట్టి వెంకటసుబ్బారావుగారు ... ... ... ౨౪౪
భగ్నహృదయులు—పిశుపాటి వెంకటరమణయ్యగారు ... ... ... ౨౪౫–౨౫౬
కలగూరగంప—'కారికోల్' శిథిలములు; శ్రీ పాపినేని రాఘ[illegible] ... ౨౫౭–౨౫౮
ఆ ద్రాభ్య యము—శ్రీ బలిజపల్లి కృష్ణశాస్త్రిగారు ... ... ... ౨౫౯
విమర్శనలు: ... ... ... ... ... ౨౬౧–౨౬౬
సాభిప్రాయవిశేషములు— ... ... ... ... ౨౬౭–౨౭౦


త్రివర్ణచిత్రములు: నల్లకలువ, సంగరమూర్తి నాయనారు చరిత్రలోని ఒకరంగము.

సాధారణచిత్రములు: పంచమజార్జి చక్రవర్తి, అష్టమ-ఎడ్వర్డు చక్రవర్తి, కారకోల్ (మయశిల్ప) చిత్రములు, శైశవచిత్రములు, గడలు, ఇతరచిత్రములును.

## సవరణ

ఈ సంచికయందు గల 'రేడియం' చిత్రములలో ఉమ్మిగ్రంథుల విస్రవణముల చిత్రములు థైరాయిడ్ గ్రంథి విస్రవణచిత్రములుగను, థైరాయిడ్ గ్రంథుల విస్రవణచిత్రము, ఉమ్మిగ్రంథుల విస్రవణచిత్రముగను పొరపాటు పడినవి. పాఠకులు దానిని సవరించుకొన ప్రార్థితులు.

—సం. భా.

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈక్రింద కనబరచిన నెంబర్ల వారికి ఈనెల (1936 సం. ఫిబ్రవరి)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో ఫిబ్రవరి 8-వ తేదిని రూ॥ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయం దభిమానముంచి సొమ్ము చెల్లించి వి. పి. నిగైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 10, 23. B 5, 17. D 5, 6. E 4. G 5, 6, 8. H 32, 37. K 18, 28. M 15. N 14, 17, 26, 38. P 21, 39, 68. R 22, 23, 26, 61, 62. S 56, 108, 111, 112, 113, 114, 116, 117, 120, 122, 131, 160. V 26, 27. Z 3.

---


## విప్రకులదర్పణము

దాదాపు 35 సంవత్సరములనుండి సంగ్రహించి వ్రాయుచుండిన విప్రకుల దర్పణమను గ్రంథము యిప్పుడచ్చున కిచ్చుచున్నాను ఇందు అన్నిబాపతుల నియ్యోగులు వైదికులు ద్రావిళ్లు, శ్రీవైష్ణవులు, యాజ్ఞ్యవల్క్యులు వైఖానసులువేపార్లు మర్ధ్వులు శైవులు, వెలనాటి పూజార్లు, శివార్చకులు మున్నగువారి కుటుంబముల చరిత్ర అకారాది యింటిపేర్లు, గోత్రములు వారు నివసించు గ్రామములు వారుచేయుచున్న బంధుత్వములు ఆయాకుటుంబముల వారిప్రఖ్యాతులు చేశిన దానధర్మములు ఇంకనుచారిత్రక విషయమైన యితరసంగతులు చేర్చి ప్రచురించుచున్నాను. కొందరిగోత్రములు కొందరిశాఖలు కొందరివాసగ్రామములు తెలియకున్నవి ఈప్రకటనచూచి వెంటనే యేయింటిపేరు గోత్రము మీరు నివసించు గ్రామము మీబంధువుల యిళ్లపేరు యింకనూ చరిత్రలో చేర్చవలసిన మీకుటుంబములోని వారి పాండిత్యములు చేసినగ్రంథములు మున్నగు విషయములు ఈదిగువ చిరునామాకు వెంటనే పంపగోరెదను.

సత్తిరాజు సీతారామయ్యపంతులు,

కంతేరు, పెనుగొండ, పోష్టు, పశ్చిమగోదావరిజిల్లా.



## సుప్రసిద్ధగ్రంథములు

ఉన్నవ లక్ష్మీనారాయణగారు రచించినవి

| | | |
|---|---|---|
| 1. | మాలపల్లి - సంపూర్ణము (రివైజ్డ్ ఎడిషన్) | 3 0 0 |
| 2. | నాయకురాలు-పల్నాటినాటకము | 1 0 0 |
| 3. | భావతరంగములు - పాటలు | 0 2 0 |
| 4. | హరిజననాటకము - | 0 1 0 |
| 5. | సంగీతనాపసాని-చదివితీరవలయును | 0 1 0 |

వలయువారు :—

ఆంధ్రపత్రికా ఆఫీసు,

7, తంబుశెట్టివీధి, మదరాసు



P. O. TEKKALI,
(District GANJAM.)
SRI SRI SRI GOPINATH HARICHENDAN JAGADEB RAJA BAHADUR.

సంపు. ౧౩ యువసంవత్సరము, మాఘమాసము (ఫిబ్రవరి ౧౯౩౬) సంఖ్య ౨

M.S.V. GANGARA.U,
M.A, M. Com, C.A.I.I.B, LL. B.
ADVOCATE
Road. No-5, " SADANAND VIHAR "
GOSANINUAGAOM
BERHAMPUR-760 03, ☎: 214309

# మాతృహృదయము

వేలూరి శివరామశాస్త్రి

"కలికిరో! యింకఁ జీకటులు కార్కొనలే దెవరేని భోజనం
బుల నొనరింపలేదు విటపుంగవుఁ డొక్కఁడు నేని వీథిలో
వెలలఁడు గట్టిగాఁ దలుపువేసితి వచ్చెడె యేమివచ్చెనే
తలుపులు దీయవే వడిగఁ దల్పులు దీయవె జీవితేశ్వరీ!
"చెలికయి నందనందనుఁడు చివ్వన నందన మేఁగి తావులం
బలసిన పారిజాతకుసుమంబులఁ దెచ్చినయట్లు నే నిదే
కల నగ లన్నియుం గలిపి కానుక దెచ్చితి వచ్చి వెంటనే
తలుపులు దీయవే వడిగఁ దల్పులు దీయవె జీవితేశ్వరీ!
"నిలిచి యుగాలు దాఁటినవి నిల్చినద్వార మెడారియైన దీ
కల నగ లన్నియుం గలసి కావడిబ ర్వాయిపోయె నీదు చా
టలయొకజన్మచాటు పలుకాడమి శూన్యసముద్ర మక్కటా
తలుపులు దీయవే వడిగఁ దల్పులు దీయవె జీవితేశ్వరీ!"

13. 2- 1  ౧౩౬

అని యిటు శంకరుం డనెడునాతఁ డొకం డల వారకామినీ
జనమణియైన హేమలతసౌధముముందర నంగలార్పఁగా
వినివిని దానితల్లి వెనువీథిని వెల్వడి వచ్చి 'మీరమా
పెనుబరు విద్ది మీ రసలె పిట్టమనుష్యుల రిట్టు లిండయా'
అను చిటు వేశ్యమాత తనయంజలి యొగ్గిన శంకరుండు తె
చ్చినసగ లన్ని యిచ్చి 'విను చెప్పెద నొక్కటి నీకొమార్తెకై
మునుకొని మూఁడులోకములు మోసెదఁగాని క్షణార్ధ మేనియుఁ
మొనసి తిలార్ధమేనియును మోయఁగఁజాలను దద్వియోగమున్.'
అనవుడు వేశ్యమాత బదు లాడకముందె తదీయపుత్రి యి
ట్లనియెను 'వానితెచ్చిన మహాభరణంబులు వాని కిమ్ము పొ
మ్మనుము నిమేషకాలమును నయ్యెడ నిల్వఁగవద్దువద్దు పొ
మ్మను మిఁక నాకు నాతనికి నంతయుఁ దీరిన దమ్మ తల్లిరో!'
పటువుగ నిట్లు మోహాలత పల్కినయంతట దానితల్లి య
వ్విటుఁ గని 'మీకు నెంతయును బ్రేముడి వర్ధిలుఁగాతమంచు' న
క్కటికము సూపి వచ్చినప్రకారముగాఁ జనె నంతమాత్రలోఁ
గటకటలాడె మోహాలత గ్రాలెడు సౌధపురఃకవాటముల్.
"వచ్చితి వేమొగంబునను వాకిటిలోనికి? నీవు తొల్లి నా
కిచ్చిన బాస యేడ? నిపు డీ వొనరించినచేత యేడ? నీ
హెచ్చరి కేడ? హేమలత యీహృదయంబును గోరుకొన్నచో
నచ్చుగ నీదుతల్లి హృదయంబును దేవయ లేక పోవయా!
"చెలికయి నందనందనుఁడు చివ్వన నందన మేఁగి తావులం
బలసిన పారిజాతకుసుమంబులుమాత్రమె తేఁగలేదు చే
వలఁతిగ దుఃపగూడఁ గొనివచ్చె నెఱుంగవె? నాదు డెందమే
వలసినఁ దల్లిడెందమును బాయక తేవయ లేక పోవయా!
"మారునితోడు మీనగలు మాకును వద్దిది ప్రేమదాసి నాఁ
బేరిది; హేమదాసియను పేరిదిగాదు; మఱాకు మింతకుం
బేరు ప్రతిష్ఠ లుండవలె భేషనఁగావలె నాదు గుండెలం
గోరుదువేని నీజననిగుండెలఁ దేవయ లేక పోవయా!"

ఈరహిఁ బల్కి హేమలత హేమగలంతిక నొండు తెచ్చి ప
న్నీరముఁ గ్రుమ్మరించి 'యిది నీయమగుండెలు తెచ్చితేని ప
న్నీరనుకొమ్ము కానియెడ నిండుగఁ బొర్లిన ప్రేమదాసి క
న్నీరనుకొ'మ్మటంచు నతినిష్ఠురతన్ వడి మూసెఁ దల్పులన్.

వారలతాంగి శంకరునిపైకిని సూటిగ ధార బట్టు ప
న్నీ రది వానినిం దడిపి నేలపయిన్ మడుఁగాయె దానిపై
సారెకు దీపకాంతి పడి శంకరునీడలు కానఁబట్టెఁ ద
ద్ద్వారముముందు భక్తిమెయి దండనమస్కృతి చేయునట్టులన్.

తడిసి ముస్పందుమై శంకరుఁడు గృహాన-కరిగియున్ జననీహృదయాంబుజంబు
కోసికొనివచ్చునంతలోఁ గుముదినీవి-టీశ్వరుండగు చంద్రుఁ డత్తఱి చూచె.

'రాసిరియూ ధృతిం బరశురాముని మించుచుఁ బ్రేమదాసికా
దాసుఁడు వీఁడె వచ్చెడిని దల్లిహృదంబుజముం బుటుక్కునం
గోసి, కవాటముల్ తెఱచి కొమ్మ'ని శంకరుఁ డన్నయంత సే
బా సని యల్ల మోహాలత వాకిలి తీసె విలాసవైఖరిన్.

వాయుజవంబుతో నతఁడు వాకిలి దాటఁగనున్నయంత ని
ష్ఠాయుతయౌచు హేమలత డగ్గఱునంత వెసం గుమారు కేల్
దోయిఁ జెలంగు గుండియలు త్రుళ్లుచు నిట్లనె—'నీళ్లునీ ళ్లొగిం
బోయితివేని జాఱిపడిపోదువు మెల్లఁగఁ బొమ్ము నాయనా!'

---

# ఆంధ్ర దేశ విచ్ఛిత్తి




తి. రా.

ఆసేతు హిమాచల పర్యంతము
అత్యల్పధరకు అమందానంద
మొసగు "ట్విన్" రికార్డులనే
కొని
జీవనాదమును ప్రతిధ్వనింపగలుగు
'ట్విన్' మెషినులపై వినుడు!



రాజా ట్రాన్స్‌పోర్టబిల్ ధర రూ. 120/

# అమోఘమగు తెలుగు
# డ్రామా రికార్డులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| [illegible] | సెట్టు నెం. | 569 | ధర | రూ. | 6/ |
| [illegible] | ,, | 570 | ,, | ,, | 9/ |
| మోహినీ రుక్మాంగద | ,, | 573 | ,, | ,, | 6/ |
| [illegible] | ,, | 574 | ,, | ,, | 6/ |
| [illegible]దాసు | ,, | 577 | ,, | ,, | 6/ |

పలయు రికార్డులను నేడే మా వ్యాపారులయొద్ద కొని
విని ఆనందింపుడు!

ది
ట్విన్ రికార్డు కంపెని లిమిటెడ్,
45. సౌతుపేరేడు, బెంగళూరు.



# శ్రీ అరవింద జీవితము

**వీరిజీవిత మింతవఱకు నేభాషయందు నింతవివరముగా ప్రకటింపబడలేదు.**

ఇందు వీరిజీవితవిశేషములు, వీరియోగము, ఆశ్రమవిషయములే గాక
వీరి జాతకము, ధర్మపత్నికి ౧౯౦౫లో వీరువ్రాసిన అద్భుతలేఖలు
'స్వాతంత్ర్య నిర్వచనము', 'జాతీయత', 'ప్రాచ్యులు - పాశ్చాత్యులు'
అను శీర్షికలక్రింద వీ రా కాలమున రచించిన వ్యాసముల
కనువాదములు, వీరి ఉత్తరపరోపన్యాసము,
౧౯౦౯లో వీరుప్రకటించిన నాదేశీయుల కొకబహిరంగలేఖా సంగ్రహము
మున్నగువిషయము లెన్నియోగలవు.

శ్రీ అరవిందుల, ఆశ్రమకట్టడముల ఫోటోలు గలవు.

ఫెదరువైటుపేపరు — పెద్దక్షరములు — చక్కనికూర్పు — వెల ౧-౦-౦.

# శ్రీ అరవింద దర్శనము

**శ్రీ అరవిందుల అపూర్వ తత్త్వసారమంతయు నిం దున్నది.**

లైఫ్‌డివైన్ - (Life Devine) అను తమగ్రంథమున శ్రీఅరవిందులే
సంగ్రహముగా రచించినభాగము ననుసరించి
బ్రహ్మశ్రీ వేలూరు చంద్రశేఖరంగారు వ్రాసినారు
శ్రీఅరవిందులు స్థాపింపనెంచు దివ్యజీవనము, భాగవతజీవనము, స్వర్గరాజ్యమువదో
ఆదివ్యపరిణామ మెట్లురాగలదో ఈగ్రంథమునుపఠించినవారికి తెలియగలదు.
తత్త్వజిజ్ఞాసగలవారందఱు చదువవలసినగ్రంథము.

ఫెదరువైటుపేపరు — పెద్దక్షరములు — చక్కనికూర్పు - వెల ౦-౧౨-౦.

వలయువారు:—

ఆంధ్ర గ్రంథమాల,
తంబుసెట్టివీథి,
మద్రాసు.

# కవికోకిల గ్రంథావళి

## * కావ్యసంపుటము

దుర్భా సుబ్రహ్మణ్య శర్మ

తన కల్పనలు సత్యముగాఁ బొడకట్టఁజేసి తన సృజించిన కథాపురుషుల దశావిశేషములతోఁ బాఠకులకు గాఢమైన సహానుభూతి కలిగించి తన యనుభవించిన రసమునకు వారి హృదయముల నెలయించి యశ్యమును మఱపించుటయే కవిత్వమునకు లక్షణమేని,కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారుకవియే కాకకవివతంసులనియుఁ జెప్పనొప్పియున్నారు. కవితకు అపూర్వసృష్టియేవిశిష్టలక్షణమైనను, సిద్ధపూర్వములకు మెఱుంగుపెట్టువారిని, వానిని భాషాంతరములకుఁ దార్చువారినిఁగూడ కవులనుట చిరకాలాగతముగానున్న యాచారము. భారతము తెనిఁగింపేమైనను, తిక్కన కావించినది 'సృష్టి'యనియు, ఆయన 'కవిబ్రహ్మ'యనియుఁ బెద్ద లుగ్గడించియున్నారు. సృష్టి యనుట కథాసృష్టి మాత్రపరమేయైన, తిక్కన చేసిన సృష్టియేమియుఁ గానరాదు. భారతకథా సర్గమంతయు వ్యాసభగవానునిదే. కావున ప్రాక్కథల యనువదనములలో పాత్రరస నిర్వాహాదికములందుఁదోఁచు నూతనత్వమును గూడ పూర్వులు 'సృష్టి' పద వాచ్యముగా భావించిరనుట తెల్లము. ఈ దృష్టులలో దేనఁజూచినను రామిరెడ్డిగారికిఁ గవియశస్సు లభించితీరవలసియున్నది. ఈకావ్యగుచ్ఛములోని యేఁడు రచనములలో నైదు నూతనసృష్టులు.

కడమ రెంటిలో తొలిది (నలజారమ్మ) పరంపరా ప్రాప్తమైన యొక కాఁపుటిల్లాలి పాతివ్రత్య చరిత్రము రెండవది (పానశాల) పారసీకమునకు బరివర్తనము. ఇందొకొక్కటియు నే నీవఱకుఁ బలుమాఱుపఠించినవేయయ్యును మరలఁ జదువునెడ నివి క్రొత్తయవిగాఁదోఁచి డెందమున కమందమైన యానందముంగూర్చినవి. 'క్షణేక్షణే యన్నవతాముపైతి తదేవ రూపం రమణీయతాయా' యనుట యిట్టి రచనలఁ గూర్చియేకదా యని మరల రూఢి చేసికొంటిని.

తన హృదయమున కంటని యేవిషయమునేనికవి చక్కఁగా దిద్దితీర్పనేరఁడు. క్షితిభుజుల ముఖోల్లాసముకొఱకో, లోకసమ్మానముకొఱకో యితివృత్తములఁ జేకొనవలసి వచ్చినవాఁడు తనచేఁతచే సహృదయుల చేతముల వశీకరించుకొనఁ గలఁడనుట కల్ల. తన హృదయమునఁ బుట్టి పొంగిపొరలి వెలికుఱుక

* "కవికోకిల గ్రంథావళి" అనిపేరుతో రామిరెడ్డిగారి గ్రంథములు కావ్యములు, ఖండ కావ్యములు, నాటకములు, సారస్వతి వ్యాసములు అను నాలుగుసంపుటములుగా ప్రకటింపఁబడినవి.

వేగిరపడుచున్న యాశయ ప్రవాహము కవిత్వమగుఁగాని యన్యము కానేరదు. గతానుగతిక మంతకంటెం గానేరదు. రామిరెడ్డిగారి కవిత్వము ఈ రెండుదోషములకు దవిష్ఠముగా నుండఁబట్టియే యింత హృదయంగమముగానున్నదని నాతలంపు. 'నలజారమ్మ' వ్రాయునప్పటికి రెడ్డిగారికి ఇరువదియేండ్లు. నలజారమ్మ తన తల్లి (పెరుమారెడ్డివారి) యింటి యాడుఁబడుచు. వివాహాది శుభ సందర్భములయందు ఆమె గుడికిఁ బోయి మ్రొక్కుకొనుట తమవారి యాచారము. మఱి, యామె యగ్నిగుండాన నుఱికిన కథ యీమూణావున కెవరు నుడివిరో, యది చిన్ననాఁట నాతని చిత్తమున కెంత యత్తినదో, అదియే యాతని తొలిరచన కితివృత్తమైనది. ఇందు రెడ్డిగారిశైలి పరిపాకమునకు రాకపోయినను, మనఃప్రవృత్తుల పరిశీలనము చేయుశక్తి పరిమితముగానే యున్నను, కవి గతానుగతికుఁడు గాఁడనుటకు ఈ చిఱుతకృతిలోనే కావలసినంత సాక్ష్యమున్నది. సంతానమునకు నోచుకొనని నలజారమ్మ సాయంసమయమున గూఁటిలోని బిడ్డలకు మేఁత తెచ్చిన కలవింకమును, దల్లితోఁ జెరలాడు నాపులుఁగునిసుఁగులనుజూచి యట్టి ప్రేమమయజీవితము తనకు లభింపక పోయెనేయని దురపిల్లుఁగాని, తనచింతను 'అపుత్రస్యగతిర్నాస్తీ'త్యాది శాస్త్రసూత్రములతో ముడిపెట్టదు. కవిదృష్టికి చంద్రునిలోని కళంకము 'అభ్రకేదారమున' 'ఉడుగణమనెడి పసిని' మేపుచున్న 'చంద్రుఁ'డనెడి 'గోపబాలకుని' 'గొంగడి'గాఁ దోఁచుఁగాని అదృష్ట 'మంత్రబలమునఁ' 'బిత్రస్థాన'మగు 'చంద్రమండలము'న కెక్కిన 'జనసమావర్జితస్వధా సలిలతిలల' మొత్తము గాఁ దోఁపదు. కవి తాను ఒండొకచో తన్ను శంకించుకొన్నట్లుకర్షకపక్షపాతియో, కాఁడో నేను చెప్పలేనుగాని, దానిని మించిన ప్రకృతిపక్షపాతము ఈతనికృతులలో నన్నింట నఖండముగాఁ గానవచ్చుచున్నది. ఈ ప్రకృతిపరాయణత్వమే కాక, వెనుకఁ బ్రాకట్యమునకు వచ్చిన రెడ్డిగారి కవితాగుణములన్నియు, నీచిఱుతకృతిలో బీజరూపముం దాల్చియున్నవనుట సత్యమునకు దూరము కాదు. గుణమాత్రము లేకాక, వెనుకటి కావ్యసరణులు కొన్నింటికి గమకములును నిందే కానవచ్చుచున్నవి. అస్తమయము వర్ణించుచుఁ గవివ్రాసిన యీపద్యముం గనుఁడు:

పండి యఱ్ఱులువంచు పైరుజొంపములకు
  జాళువాపూఁతలు గీలుకొల్పి,
కన్నెపయ్యెర కల్లఁ గదలుచు దోఁగాడు
  జలదబాలల కెఱ్ఱకలప మలఁది,
కుజకోటరంబులఁ గూర్కెడు పెను గ్రుడ్ల
  గూబల మాద్యంబుఁ గొల్లకొట్టి
ఎండరాపిళ్ళకు నెరియు కొన్నినలకుఁ
  బూర్వరాగంబును బొడలఁజేసి,
ఆలమందలఁ గదలించి హాలికులకు
బనులు చాలింపఁ గనుసన్నఁ బదగఁ దెలిపి
భర్తలనుగూడ నుత్కంఠ భామినులకుఁ
గొలిపి రజనీముఖంబునఁ గొఱలె నినుఁడు.

"జలద"మును "బాలిక" యనుట వింత యూహ. ఈబాలికయే కదా కొన్నేఁడుల కావల నీడేటి వేఁడివేల్పుతోఁ గూడిమాడిన కోమలాంగి. ఇందలి హాలికుల పనుల స్ఫురణలే కదా "కృషీవలుని" యద్భుతవృత్తమైనది. నలజారమ్మతండ్రి ధర్మసందేహము దీర్చుచు,

మును రక్షోహృతయైన సీతను సతీ
 మోహంబునన్ రామచం
ద్రనరేంద్రుండు గ్రహించెనంచుఁ బలునిం
 దల్ వల్కుఁ బౌరుల్ ధరా
జను గాంతారనివాసినిన్ సలుపడే
 శంకింప కారాముఁడున్
మనవారల్ పెఱవారలంచును జనుల్
 న్యాయంబు పోఁజూతురే?

ఇందలి వస్తువేకదా వెనుక 'సీతా వనవాస' నాటకమైనది.

ఇవియెల్లఘుణాక్షరన్యాయమునకులక్ష్యములుగాక భూతార్థములే యయ్యెనా, రెడ్డిగారు,

మును కౌరవ్యులు ద్రౌపదిన్ గినుకమై
 భూపాల సంఘంబు మూఁ
గిన పేరోలగమందుఁ జీరలొలువన్
 గీడ్పాటు నీక్షించుచున్
ఘనులౌ పాండవు లుండరే నెడసులై
 న్యాయైక బద్ధాత్ములై
జనకా, కూడవు పక్షపాత విధముల్
 సత్యంబు పాలించుచోన్.

అను పద్యములోని సందర్భమునుగూడ నాటకముగావ్రాసి, లోకమునకుఁ దానుబడిన బాకీ తీర్పుకొనవలసినవారు గానున్నారు.

'నలజారమ్మ' స్వకుటుంబ వృత్తాంతమై కవిడెందమును బందిగొని యున్న, కృషీవలుఁడు స్వకుల వృత్తాంతమై యాతని మనంబు తనవంకకుం ద్రిప్పుకొనియుండవలెను. అతిసాధారణమైన సైరికుని దైనికవృత్తము కవిత్వతుల నారోహింపఁజేయుట రామిరెడ్డివంటి సహృదయునకే కాని సాధ్యముకాని పని. కృషీవలుని జీవితముం దడవువర్ణనలు వాఙ్మయమున నెడనెడ గానవచ్చుంగాని యవి యున్నను లేకున్నను ఆకావ్యములకుఁ గావ్యత్వహాని లేదు. వానివలన ఆకావ్యములకుఁ బుష్టియొండెఁ,దదభావమున నష్టియొండెఁగాన రాదు. అటుగాక 'కృషీవలు'నిలోని వస్తువే కర్షకుని దైనందినజీవితము. ఎక్కడికక్కడఁ దెగిపోవు భావముల కన్నింటి కేకవాక్యత కల్పించి దానిం గథపోలె నడపుట యెంత కష్టమో యది శిల్పవిదులకే విదితము. ఒండొంటితోడి కూడికపనిలేని పద్యములు వేయింటి వ్రాయుటకన్న పదిపద్యములు కథఁగాఁబొసఁగించివ్రాయుటయందలి కష్టము కళావిదు లెఱుంగనిది కాదు. మఱి కథ యేమేనియు లేని ఇట్టి యతుకులంగొని 'సంయోగము' చెడకుండునట్లు కథగానే తోఁచునట్లు ఒకకబ్బము నిర్వహించుటకుఁ గవి కెంత ప్రజ్ఞ వలయునో పాఠకు లూహించుకోవలయును. అంగలాది భాషలలో నిట్టివి కలవఁట. ఆంధ్రికిమాత్ర మిది యభినవసృష్టియని నేను భావించుచున్నాఁడను. ఈమార్గమున నితరవృత్తుల వారి మనుగడలఁ గూడ నభివర్ణించుట ప్రతి

భయు, రసానుభూతియుఁగల కవికుమారుల కడంకకుఁ బాత్రము కాఁదగిన విషయమని హెచ్చరించుచున్నాఁడను.

"యువకస్వప్నమున" స్వకుటుంబ స్వకులాభిమానములదాఁటి కవిహృదయము స్వదేశము దెసకుఁ బ్రసరిల్లినది. మఱియు "జలదాంగన"లో నీయభిమానము మంటిని మింటిని నేకసూత్రమునఁ గట్టివైచినది. "జలదాంగన"లో జలదముయొక్క జన్మవృద్ధిపరిణత్యపక్షయాదుల నొకవంక భౌతికశాస్త్ర సూత్రములతోను, ఒక వంక భర్తృమతీ జీవితముతోను సమన్వయము చేయవలసియుండుట చేతను, "యువకస్వప్నము"లో వృత్తాంతమును విషయ నిగరణ ముఖమున చెప్పవలసి వచ్చుటచేతను కవిస్వేచ్ఛ యరికట్టఁబడినను, తటములఁ దెగఁగోసికొనిపాఱు స్రోతస్వినివలె, రెడ్డిగారి కవిత యనర్గళ గమన వేగమునఁ బ్రవహించుచునే యున్నది. "యువకస్వప్న" మందలి నైరంకుశ్య తత్త్వ విమర్శముంబోలె జలదాంగనలోని యభ్యూహాకత్వము (Imagination) అత్యంత పరితోషకారిగానున్నది. ఇఁక నందలి ప్రకృతి వర్ణనములా? అవి రసికజనైక భోగ్యములు! జలదాంగన సూర్యునితోఁడఁ గాఁపురము చేయుచున్న సమయమున తన చర్యలం గవికుమారునకుఁ జెప్పుకొను ఘట్టమునుండి యివే నాల్గు పద్యముల నుదాహరించుచున్నాను:

సాంధ్యవేళలఁ బడమటి చఱులయందుఁ
బొటమరించెడు నపరంజి పొడుపుశేటి
యందు నీరాడి వెన్నెలు లార్చుకొనుచు
వచ్చుచుందును గవుల భావమ్ము లలర.

పండువెన్నెల లలరు శర్వరులయందు,
వలిపపుముసుంగు నోరగా వలనుపఱచి
వెన్నెల పులుంగు పిల్లల చిన్నినోళ్ళ
నమృతరసముఁ బూరింతు నెయ్యంబుగదుర.

ప్రొద్దుపొడుపున విరియు క్రొంబువులయందుఁ
గాఁపురంబుండు నిందిర కంఠసీమ
మంచుతుంపర ముత్యాల మాలఁగట్టి
వేయుచుందును నానందవర్ధనముగ.

ఆభ్రగంగా ప్రవాహంబు నవలదాఁటఁ
గ్రమమణుల సురేశుండు గట్టినట్టి
యింద్రధనువను వంతెన నెక్కిపోయు
జలకమాడిన తెలిఁగంటి చెలులతోడ.

'పానశాల' పారసీకమునకుఁ దెనిఁగింపు. రామిరెడ్డి ఖయ్యామునకుఁగల యాంగ్లీకరణములఁబట్టిగాక స్వయము పారసీకభాషఁజదివి మూలార్థ మవగతము చేసికొన్నవాఁడు. కొన్నియెడల ఆంగ్లానువాదకులుకవిహృదయ మెఱుంగనేరక పడిన పొరపాట్లుం గూడ వీరు తమ తెనిఁగింపులోఁ జక్కపఱిచికొన్నట్లు వినికి. ఇది యెంతదనుక సత్యమో మూలభాష నెఱుఁగని నాకుఁ దెలియుట అసాధ్యము. కాని రెడ్డిగారి భాషాంతరీకరణము ఎచ్చటను దర్శిమాగాఁదోఁపక స్వతంత్రరచనవలెఁ గానవచ్చుచున్నది. పద్యముల లోని పారసీక పదములు, ఆయాభాగములం గానవచ్చునార్యకవి సమయోల్లంఘనములు- ఇవి లేక యున్న ఇది విదేశీయ కృతియని

గుఱితింపనే యనువు కాదేమో ! మన భాషతో సకల విధముల సాజాత్యముగల సంస్కృతముబడి వ్రాయువారలే తెలుంగుపోకడలు చెడకుండ కృతుల నిర్వహింప నేరకుండఁగా రెడ్డిగారు దీని నింత ప్రసాదసుభగముగా రచింపఁగలుగుట వారి భావజ్ఞతకును, బద్యరచనపై వారికిఁగల యధికారమునకును నిదర్శనము. రామిరెడ్డిగారి కృతులలో నాంగ్ల వాఙ్మయచ్ఛాయ లున్నవనుట తద్భాషాకోవిదుల కెల్లం దెల్లము. ఈనాఁటిభావకవుల కవితా మండనములు పెక్కులు అయ్యాంగ్ల సారస్వత విపణులం గొన్నవియే కదా! కాని యాభావకవులు ఆంగ్లములోని నవీనాశయముల మన నుడికారమునఁ బొసఁగించుటకుఁ బడిన శ్రమము వారు వడసిన ఫలసిద్ధికి అనురూపముగాక యున్నది. పదములకు లేని యర్థములు గల్పించుకొనుట, అర్థములేని పదములు గుప్పించుట, తమకేయందని యూహను వివరింపఁబోవుట, ఊహయే లేనిచోట నున్నట్టు దోఁపఁజేయ యత్నించుట ఇత్యాద కైతవములచే కవిత్వ మర్హణమునకు మాఱు గర్హణమునకుఁ బాత్రమైనది. శ్రీ రామిరెడ్డిగారు ఆంగ్లమునుండి కొన్న కొన్ని యభిప్రాయములు మననాతిరేకమున వాని స్వీయములు గావించుకొని ప్రాయికముగాఁ దెనుఁగు పలుకుబడి పోలివోవని తెఱంగున వానిం దమకబ్బములఁ గూర్చుటచేత ఆభాషణములు విజాతీయములుగాఁ దోఁపక ఆంధ్రవాణి ఏనాఁడును ధరించు నమూల్య భూషణములుగానే చూపఱకుఁ గాన్పించుచున్నవి. ఈసిద్ధి కృతహస్తులగు కతిపయకవులకే సాధ్యము.

ఇఁక శేషించినవి "వనకుమారి"యు' "కడపటివీడుకోలు" ను. ఇందుఁ దొలిది పుట్టినవెంటనే తన యపూర్వ సౌందర్యముచే మహారాజుదృష్టి నాకర్షింపఁగలిగినది. ఆవలఁ దన మనోహరాలాపములచే, మనోజ్ఞభావములచే, నానాదేశస్థ రసికజన హృదయములఁ గొల్లలాడినది. ఈరెండింటను కవి, ఒకదాన నిర్జనారణ్యమును, ఒకదాన నాశ్రమవనవాటికను కథాస్థలములఁ గావించి, కథానాయికలఁ దమ ప్రియులతో ప్రవేశపెట్టి కథాచ్ఛలమున వారి నందు విహరింపఁజేసి ప్రకృతి రామణీయక వర్ణనములందుఁ దనకుఁగల యపారతృష్ణ నపనయించుకొని యున్నాఁడు.

ఆకారమునఁ జిన్నదయ్యు 'వనకుమారి' కంటె నన్ని తెఱఁగుల నుత్తమమైనది "కడపటి వీడుకోలు". ఇది వ్రాయునాఁటికిఁ గవియొక్క శైలి చక్కని పరిపాకమునకువచ్చుటయేకాక, మన స్తత్త్వపరిశీలనశక్తియును మహనీయ వికాసముం గాంచినది. ఇఁక "భావనాశక్తి" కవి కుగ్గుఁబాలతోనే లభించిన విద్య కదా! ఏహేతువుచేతనేని కృతు లన్నియు నష్టములైపోయినను ఈనూటయేఁబది పద్యములకృతి యొక్కటియే రామిరెడ్డి కవియశస్సుం దిరముసేయఁ జాలియున్నది. రామిరెడ్డివంటి యార్ద్రహృదయుఁడు ఈ విషమ దృశ్యము నెట్లు భావింపఁగలిగెనో, తన

సృజించిన రసనిర్ఝరిణిలోఁబడి మునిఁగిపోక దీనినెట్లు తుదముట్టింప నోపెనో, నాతివిస్తృత కథా సంవిధానముగల యింత చిన్నకృతిలో నింతరసము నెట్లు చిప్పిలఁజేసెనో నాకుఁదీఱని సందేహములు. ఈకృతిని దొల్త నేను జూచి నపుడు, రామిరెడ్డియెడఁ జనవునంజేసి కవ్యు పాలంభముగా వ్రాసి పెక్కింటివలెనే ముద్రిత ములుగాక యుంచినపద్యములలోఁ గొన్నింటి నిందుఁబొందుపఱిచి, కవి కలిగించిన నిస్సీమ నిర్వృతికి అతనికి నేఁబడిన యప్పు కొంతకుఁ గొంత తీర్చుకొనియెద.

## ఆప్తవాక్యము

పువ్వులలోనఁ బువ్వయి త
పోవనవాటి నలంకరించు లే
జవ్వని కీడుజోడగు య
శస్విపయిన్ బ్రణయంబు గొల్పి యా
మవ్వపుఁ బ్రేమవల్లి తుది
మాత్రమునన్ మొదలంటఁ గోసెదే!
యెవ్విధినోపితో యి లిఖి
యింపఁగ నిట్టి కఠోరచిత్రమున్.

ప్రజల హృదయంబుపైఁ బ్రభుత్వము వెలార్చు
కవుల కొక్కింత కారుణ్య కలన వలదె?
ఇంత యెరియించిరే విషాదాంత కథలఁ
బ్రాక్కవీశ్వరు లెవరేనిఁ బఠితృజనుల

*        *        *

ఒండొకరుండవైన నిటు
లొత్తివచింప, నదేమొకాని, మి
త్రుండ! త్వదీయభావరస
ధూర్వహ భవ్యవచః పరంపరల్
పండువుసేయు వీనుల క
వార్యములై, యెలయించుఁ జేతమున్,
గొండొక నూత్న విశ్వమున
కున్ గొనిపోవును బాఠకావళిన్.

బ్రహ్మసృష్టికన్న బహురూప కవిసృష్టి
యజర మమర మద్భుతావహంబు;
కాన విషమదృశ్య కల్పనమ్ములకంటె
భవ్యదృశ్యసృష్టి ప్రార్థ్యతరము.

ఇది భూనందనఁగూర్చె రామునకు సం
స్తుత్యంబుగానైనఁ బూ
ర్వాశా తద్విరహవ్యథా కథనముల్
పాటించి వల్మీక జ
న్ముఁడగన్ దూరెఁ గఠోర చేతుఁడనుచున్
భోజాధిపుం డిట్టిచో
నెదనీరై చనునీకృతిన్ జదువువా
రేమందురో నిన్ సెచ్చెలీ!

*        *        *

అరుణారుణాంశు నవ్యస్పర్శనంబుల
లాలించి మమునల్ల మేలుకొల్పి
మునికన్య సరసిమున్గిన గౌతముని పూన్కి
మనఁజేసి తెఱపిగట్టునకుఁ జేర్చి
అవల వసంతంపుటాటపాటలఁ గన్నె
సొబగు మాకనులకుఁ జూఱలిచ్చి
కల్లేల ననిచి సఖీసఖులను బండు
వెన్నెల నుద్యానవీథిఁ ద్రిప్పి
ఆమ్రతరుశాఖ ననిచి యుయ్యాలలూఁచి
తుదకు నడివాకలోనఁ ద్రోయుదువె వారి?
బువ్వపున్ బంతి సాగించి పోయుదయ్య
'నమృతమ'స్తని చేతిలో హాలహలము!!

(16—7—1923)

రామిరెడ్డి చిత్రకారుఁడని పెక్కండ్రెఱుంగరేమో. అతఁడు వర్ణించు దృశ్యముల మనకుఁ బ్రత్యక్షీకరింపఁజేయుట కీకళ యాయనకు మిగులఁ దోడ్పడుచున్నదని నా యాశయము. చిత్రకారుని దృష్టి మన

దృష్టికంటె విలక్షణమైనది. ఒక చిత్రముం దీర్పవలయునన్న అతఁడు మనవలెనే స్థూలముగా ఆకారము నంతయు మనస్సునకుఁ దెచ్చుకొన్నను ఏయే భావముల నెట్లెట్లు తీర్చిన చిత్రము సజీవముగాఁ గానవచ్చునో యారహస్య మతనికి ప్రయత్నముగ గోచరించును. ఒక్కరేఖ, ఒక్కచుక్క, వర్ణసమ్మేళనమున నొక్కింత మార్పు, ఇట్టివానిచే నతఁడు చిత్రమునఁ దాను వెలయింపఁ దలఁచిన భావముల నిపుణముగ నావిష్కరింపఁ గలఁడు. వర్ణనాంశములలో కవిసేయు పనియు నింతకన్న భిన్నము కాదు. తొలికవితయైన "నలజారమ్మ" దొరఁకొని 'కడపటి వీడుకోలు' వఱకుంగల కావ్యపరంపరలో నెచ్చటఁ జూచినను రెడ్డిగారి యీ చిత్రణనైపుణ్య మకుంఠితముగాఁ గానవచ్చుచున్నది. వర్ణితుఁడు కృషికుఁడుగానీ, ఋషి కుమారుఁడుగానీ, వర్ణిత రాకుమారిగానీ, నీటమునిఁగిపోవు మునికన్యగానీ, వర్ణ్యము పంటపొలములుగానీ, మింట వ్రేలాడు జలదశకలములుగానీ, అవి యెల్లఁ గనులకుఁ గట్టినట్లు కానరావలసినవే. ఇట్టి స్థిరముల నేకాక చిత్రమునకందని పారిప్లవములంగూడ రెడ్డిగారు మనకు సాక్షాత్కరింపఁ జేయఁగల రనుటకు గ్రంథములఁ దార్కాణములు బంధురములుగా నున్నవి.

కవి తాను ప్రత్యక్షము సేసికొనక, ఒక దృశ్యమును ఇతరులమోల సాక్షాత్కరింపఁజేయ నేరఁడు. తొల్లిఁ దాను జూడవలయును; వెనుక నొరులకుఁ జూపవలయును. ఆ చూపు కవివరేణ్యులకుఁగాక యన్యులకు లభించునట్టిదా? లభింప దనుటకు రామిరెడ్డియే మనకు సాక్ష్యము.

రార, సైరిక! కనుఁగొమ్మ రమ్యమైన
సస్యకేదార ఖండంబు; సత్కవీశ
భావలోచన మెఱవుగాఁ బడయుకున్నఁ
గాంచనేర వంతర్లీనకాంతి సరణి.

ఇట్టి బహిర్దృశ్యముల నేకాక యంతర్దృశ్యములఁ (చిత్తవృత్తుల) గూడ రామిరెడ్డి చక్కఁగాఁ దీర్చియున్నాఁడు. ఇవి తొలి కృతులలో నంతగాఁ గానరావుగాని వెనుక వెనుకవానిలో వెల్లివిరిసి కావ్యశోభ నినుమడింపఁ జేయుచున్నవి. "కడపటి వీడుకోలు"లో

శారదా రమ్య చంద్రికాస్పర్శనముల
మత్తహృదయులమై మేను మఱచినాము;
తాపసాంగన లెల్లరుఁ దరలినారు
ఉటజముల, కిఁక మన కిట నుండఁదగదు.

అని సంబోధించు నెడ "తన నామాక్షరములు" "తేనెముత్తెము లట్లు" "మునితనయని" "నోటరాలినందుకే" "ముగుద" "యంతరంగమునఁ బొందిన" "గూఢప్రమద" మొక యుదాహరణము. "తేనె ముత్తెములు"— ఇది ద్వంద్వమా? కర్మధారయమా ? రెండవ పక్షమున నర్థమేమి? అక్షరముల ముత్తెములతోఁ బోల్పవచ్చుంగాక, శబ్దమాత్రము నట్లనుట తగునా? ఈవిమర్శ "వస్త్రమూల్యవిచింతకుల"కు వదలి మనము

కవి హృదయము మాత్రము గ్రహింతము గాక. మఱియు వాఁగుపై "వంతెన యట్టులు" "వంగియున్న" కొమ్మయుయ్యెలమీఁదఁ గూర్చున్న సమయమున తమరిర్వురు వేర్వే ఱుగా నున్నను వాఁగునీటఁ దమప్రతిబింబము లొండొంటి దొరయు నెడ, ఆ ముగ్ధముని బాలిక చూపిచెప్పిన యీపద్యమునర్థముం దిలకింపుఁడు :

కనుమోయీ, యనుగుం జెలి !
మనయిద్దఱి నీడ లిపుడు మధురాశ్లేషం
బునఁ దమచూత్మక లెఱుఁగని
యనుభూతినిబొందు జడము లయ్యును నహహా !

వెంటవెంటఁ బాటిల్లిన సంభాషణ క్రమము ననుసంధింపుఁడు. ప్రణయపరిణామముల నింత సుకుమారముగా వర్ణింపఁగల కవీంద్రుని యభిరుచి యెంత విమలమోకదా ! ఇట్టి వీ కావ్యములలో ననేకములు గానవచ్చుచు న్నవి.

జీవిత పరమార్థముంగూర్చి కవియాశ యము లెట్టివి యని ప్రశ్నించుకొని తద్దృ ష్టితో నాతని కృతులఁ బరిశీలించుట హ్రాణుల యాచారము. మన దేశమున మతమువలని కట్టుపాట్లు అవిలంఘ్యములు కావునను, పురు షార్థవిమర్శ యొక్కొక్కఁడును దాను చేసి కొనవలసినది కాక యీవఱకే మహాపురుషు లచే నిర్ణీతమైనది కావునను, ఆర్యకవుల ప్రబంధముల నీ దృష్టితోఁ బరికించుట ఫల కారి కానేరదు. వారి యెల్లర దృష్టియు నొక్కటే. కావున వారి 'సందేశమును' ఒక్కటియే. అవి యెల్ల నిర్ణీత పూర్వ పురు షార్థాంతఃపాతులు. మన రెడ్డిగారు ఈ తెగకుఁ జేరని 'స్వైర విహారధీరు'లు. కావున వీరి కృతులఁ బూర్వోక్త దృష్టితోఁ బరిశీలించుట ప్రయోజకము కావచ్చును. ఇట్లు సేయు టలోఁ బాత్రౌచిత్యముకొఱకుఁ గథా పురు షులనోట వారు పలికించిన వాక్కులు వారి తలంపులుగా మనము భ్రమింపకుండవల యును. 'శారద' వ్యష్టి జీవితమునందలి సుఖ భోగముల నుగ్గడించినను, 'గౌతముఁడు' విశ్వమయ జీవితమునందలి యానందము నగ్గించినను అవి వారివారి తలపోఁతలుగాని కవితలంపులు కానేరవు. 'వనకుమారి' యడవిలోని స్వచ్ఛంద జీవితసుఖముల నభి వర్ణించినను, 'రాకుమారుఁడు' రాజాంతః పుర విలాసములఁ బొగడినను, అవి వారివారి తలంపులు కాని కవివి కావు. ఈ తెరచాటు మాటలలోఁ గవిహృదయ మేవంకకు ములు సూపుచున్నదో కొంతకుఁ గొంత మనము గ్రహింపవచ్చుంగాని యిదమిత్థమని రూఢి చేసికోరాకయుండును. అట్లుగాక, కవి సొంత మాటలమూలమునఁ దేలు సిద్ధాంతములు మనకుఁ బ్రమాణీకరింపఁ దగియుండును. ఈ సంపుటములోని కృతులలో 'కృషీవలుఁడు' ఆ జాతికిఁ జేరినది. ఇందుఁ గవి స్వయము కృషీ వలునిఁ, దత్కాంతను సంబోధించి 'విజ్ఞాన మత' బోధ గావించుచున్నాఁడు. ఇందుఁ గవికి గల కృత్రిమ నాగరకతా వైముఖ్యమును, పల్లెటూరివారి ముగ్ధజీవితమునందలి ప్రీతియు



'కారకాల్' శిథిలములు, 'మయ' శిల్పము (P. P. A.)



'కారకాల్' శిథిలములు. 'మయ' శిల్పము (P. P. A.)

విస్ఫుటములుగాఁ గాన్పించుచున్నవి. 'జలదాంగన' వృత్తమును వినుటకుఁ గవి తానే 'భావమున' 'నబ్దసారూప్యముం' బొంది యెడనెడఁ దనతలంపుల తెల్లము కావించియున్నాఁడు. 'జలదాంగన' మంచుకొండ నెత్తముల మనోహర దృశ్యముల వర్ణించి చెప్పినపుడు కవి తత్రత్య ప్రకృతి రామణీయకము సదర్శించుటకుఁ దనకును మేఘమునకుఁ బోలె కామచారము లేమికిఁ బొగులుచున్నాఁడు. 'యువకస్వప్నము'లోని 'తరుణుఁడు' కవియే యని చెప్పనక్కఱలేదుకదా. 'ప్రతీకారశక్తి' తోను, 'జనయిత్రి' తోను అతనికిఁ జరుగఁగిన సంభాషణములోని యీ క్రింది పద్యముల జీవయాత్రా స్వరూపము—కవి గ్రహించిన తెఱంగున—మనకు గోచరమగుచున్నది.

అంబు సదరాని సాగరమందు సలిల
బిందువటు లెన్నఁడో మున్ను నేఱుపడితి;
వడసఁ జిక్కాని పేనట్టి నావమీఁదఁ
జనుచు నున్నాఁడఁ గాలవాహినిఁ దరింప.

ఎన్ని రేవుల లంగరు లెత్తినానొ!
యెండి యెన్నిట నింకను వేయవలెనొ!
నేఁడు నీవార్థితటమున నిలిచినాఁడ;
రేపు తెలియదు లంగ రే రేవునందొ.

పట్టునడి బాటలఁ దుఫాను గొట్టుకున్నఁ
గ్రిందిచట్టము గిరిదాఁకి వ్రీలుకున్న
దెసలు గుర్తింప ధ్రువతార యొసఁగుచున్నఁ
జేరవచ్చు జన్మస్థానసీమ త్వరగ.

మఱియు, బలహీనుల నోడించి సౌఖ్యములు వడయు బలవంతుల దెసఁ గవికిఁగల యమర్షము ఈ క్రింది పద్యములఁ గానవచ్చుచున్నది:

బలయుతమైన జాతి యిలఁ
బాలనసేయు; నధర్మమయ్యు భూ
తలపతి ముద్రివడ్డ నది
ధర్మమయౌను; బ్రిజాళి సౌఖ్యముం
దలఁపక యాత్మభోగ పర
తం జరియింతు వసుంధరాపతుల్
పలువురు లోకకంటకులు
పాలనసేయఁగ శాంతి గల్గునే?

కడుపునకుఁ గూడు దొరకక గాసిఁజెంది
అన్నమును దొంగిలించినయతఁడు దొంగ;
రాజ్యలోభంబునను బరప్రజల హత్య
సలుప నసిఁబూన ధర్మశాసనుఁ డతండు!

సంఘసరసి దురాచార శైవలములు
గప్పివైచెను నీరంబు కంపుపట్టు;
సతము స్వాతంత్ర్యముం గోరు సారసములు
నిలువ నొకయంగుళంబైన నెలవు లేదు.

మొత్తముమీఁద కవి కవిత్వమునందుం బోలె సాంఘిక రాజకీయములందును కృత్రిమ నిర్బంధములనుండి విడివడి సత్యసరణి గమనింపఁ గోరుచున్న స్వాతంత్ర్యలాలసుఁడు. ఇఁక నాధ్యాత్మికమునందో శారదా గౌతముల సంభాషణములు తుల్యబలము కలిగి యున్నను, కవికి గౌతముని పక్షమే యాదర్శముగాఁ దోఁచెననుట యుక్తము. ఐనను రెడ్డిగారు ఆదర్శములకొఱకును, ఉపదేశములకొఱకును వ్రాయువారుకారు. వారు రసపిపాసువులు. రసముకొఱకే వ్రాయుదురు. అది యెందున్నను, విషయమునుండి పిండి క్రోలఁగల సమర్థులు. ఇంతియగాక దాని నితరుల కందీయఁగల రససిద్ధులు. కావుననే "కడపటి వీడుకోలు"లో భోగాస్థైర్యము నంతగా

వర్ణించిన రెడ్డిగారు కామోపభోగపరమైన "పానశాలం"గూడఁ బాఠకుల కుపాదేయ మనియే తోఁచునట్లు వ్రాయఁగల్గినారు. కవి డెందము విరాగభోగములలో నొక్కప్పు డొకప్రక్క, వేఱొకప్పు డొకప్రక్కఁ దూఁగు సంధిగ్ధావస్థయం దున్నదని మన మూహించుట యసమంజసము కాదు. అదిజీవహృదయ పరిణామమునఁ బరమార్థమునకు ననతి దూరమున నున్న యొక యవస్థావిశేషము.

కథాపురుషుల చిత్తవృత్తుల, కథాంశముల కనికట్టువిద్యచేతంబోలె మన మ్రోల స్ఫురింపఁజేయు శబ్దవర్ణనల యొక్కయు, సంభాషణములయొక్కయు నౌచిత్యము చేతను రెడ్డిగారి కవిత యందలి యర్థవిభవ మెంత మనోహరముగా నున్నదో, ప్రసాద సమృద్ధి చేతను, శయ్యాసౌభాగ్యము చేతను శబ్ద వైభవము కూడ నంత శ్రవణసుభగముగా నున్నది. ఈయనకుఁ గొన్ని యేండ్లనాఁడు బెజవాడలోఁ గూడిన 'యాంధ్ర మహాసభ'వారు 'కవికోకిల' బిరుదముం బ్రసాదించియున్నారు. అది యెంత యుచితమో యీయనకృతులఁ జదివి మాధుర్యము ననుభవింపఁగల సరళమతుల కెఱుక. ఈ బిరుదమునకుఁ గవియు నెంత సంతుష్టుఁడై యుండవలెనో ఈ నవప్రియుఁడు వనప్రియములం గూర్చి తన కృతులలో నందందు వ్రాసిన యీ పద్యములంబట్టి యూహ్యము.

గొటియల మేఁతకుఁ గిరులు
 కోమలఘాస లతా నికుంజ ని
ర్ఝరకలితంబులై యచట
 రాజిలునే? హరిణీ కుమారికో
త్కరములు నిర్భయాత్మలయి
 కానఁగనౌనె తృణాంకితావనిన్
సరస కలాస్ఫుటారవము
 సల్పుపికాంగనలున్నె మావులన్.

కలరవ కోమలంబగు వి
 కస్వర సుస్వరమెత్తి నీహృదిం
గల సరసానురాగ మెస
 కమ్మఁగఁ బాడెద, విట్టివిద్య నెం
దుల మును నభ్యసించితివి?
 దుఃఖ నిమగ్నను జేయు ప్రేయసుం
డలవడఁ డేమొ నీకును బి
 కాంగన, పల్కుమ ముద్దుపల్కుఁగన్.

మధుర మధుమాసనిశ నున్న మావియందుఁ
గొమ్మలాకుల నేడనో గూరుచుండి
ముగ్ధమగునాటవిక గానములను జేయు
కోకిలను నేను ప్రేమింతుఁ గువలయాక్షి.

వెనుక వేయిగుణము లున్నను కావ్యములలోఁ దొలుత నావశ్యకమైనది శ్రవణప్రసాదనము. దీనికిఁ దనిసియే కదా పూర్వులు కథాసృష్టి రసపోషణాదులు లోకోత్తరములుగా నున్నను వాల్మీకిం గోకిలమని కొనియాడినది. 'మధుర' మనుటతోఁ దనియక 'మధురాక్షరమ్మ' నియన్న యాప్రశంసకుని పదలాలిత్య పరాయణత్వముం బరికింపుఁడు. ఇట్టి పదలాలిత్యమును, అర్థగాంభీర్యముతో సమరసింపఁజేయఁగల రచయిత కృతార్థుఁడు. అట్టి కృతార్థ కతిపయులలో రెడ్డిగారు ఒకరు.

---

# "వెక్కిరింపఁ బోయి బోల్తాపడుటయే"

## ౨

శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

దీనిని గూర్చి డిసెంబరు భారతీసంచికలో సంగ్రహముగ నా వ్రాసిన వ్యాసమును చదివిన నా శిష్యులు పలువురు నన్నుఁ గూర్చి "ఈ వయస్సులో, ఈ అనారోగ్యస్థితిలో మీ కేల యీ పరిశ్రమము? అదిగాక మీరు సమాధానము వ్రాయఁదగిన యంశము లం దేమి యున్నవి? ఏమేని యున్నచో వ్రాయుటకు మే మెందఱ మున్నారము కామా" అనుచు నన్ను వందలించుచు నుత్తరములు వ్రాయుచున్నారు. కొందఱు తమ తమ నేర్పు కొలఁదియు ఖండనములు వ్రాసి నాకడ కంపి యున్నారు. అం దొక ప్రశిష్యుని ఖండనము నందలి పద్యములలోని యొకపద్య మిట నుదాహరించుచున్నాఁడను—

ఉ. "చాలును జాలు నీ వెలుక
చాలక దూఁకితి చింతనిప్పులో
లోలత, దోమయుంబలె ని
లోలుఁడ వైతివి, దారి తప్పి, తో
యోలెటివార్ధిశీతకర!
ఓపు దె? యోర్వఁగ వేంకటేశ్వరుం
మాలిమి వీడు, వేఁడుము క్ష
మాపణ, వారిని వారి శిష్యులన్"

ఇతఁడు ప్రశిష్యుఁ డెట్లయ్యెనో యీ క్రింది యితని వాక్యములవలన నవగత మయ్యెడిని.

"అయ్యా! నేను మీ శిష్యులగు మల్లికార్జున శాస్త్రులవారి తృతీయపుత్రుఁడను. చిట్టిగూడూరి పాఠశాలలో విద్వాన్ ౨ వ క్లాసు చదువుచున్నాను. మీ పొత్తముపై వ్రాసిన విమర్శనకు నాకుఁ దోఁచిన భంగిఁ బైరీతి నుత్తరం బిచ్చితి..." (చేవ్రాలు.)

ఈ ప్రశిష్యుని పేరు, వీరేశ్వరశర్మ. ఇంటిపేరు మల్లంపల్లెవారు. ఇతఁడు చాల పూపప్రాయమువాఁ డనుకొందును. ఈతని తండ్రి మంచి విద్వత్కవి. కొమరులందఱును విద్వాంసులై పయికి వచ్చినారు. తండ్రిగారి యదృష్ట మభినందనీయము. ఈ ప్రశిష్యుని జూచినజ్ఞాపకము లేదు గాని యితనియన్నలం జూచినట్లు జ్ఞప్తియున్నది. వారల విద్య కన్నను వినయము మిగుల నభినందనీయము. "విద్యవలనను వినయంబు" అను నభియుక్తోక్తికి నిజ మైన యుదాహరణ మా బాలురే! ఇతఁడుగూడ నట్టి వినయము గలవాఁడే అని నా యూహ. అగుచో మన "విమర్శకబుధులు" శ్రీ సుబ్బరాయ శాస్త్రులవారిపై నిట్లు కాలు దువ్వవచ్చునా అనియు సంశయింతును. కాని "సుబ్బరాయ శాస్త్రులవా రేమంత తారతమ్యమును గమనించిరి నే గమనించుట" కని యితఁ డనుకొని యుండు నని సమాధానము చెప్పికొంటిని.

అయినను ప్రశిష్యుని మందలించెదను. "అబ్బా యీ! సుబ్బరాయశాస్త్రులవా రుపాధ్యాయులు. నీ వింకను విద్యార్థివి. వయస్సులోఁ గూడ నీకన్న వారు చాల పెద్దలు. తెల్వితేటలు దైవాధీనములు గదా! మనకు వయస్సే ప్రధానము. వారు వారి తప్పును గ్రహించి క్షమాపణ చెప్పికొన్నను చెప్పికొనకున్నను నీవు వారిపై కాలు దువ్వినందులకు క్షమాపణ చెప్పుట యుక్త మనుకొందును. కావున నటు లొనర్తువుగాక"

చదువరులారా! ఇదివఱలో దీనిని గుఱించి నేను వ్రాయునప్పటికన్న నిపుడు కొంచె మెక్కుడు దేహారోగ్యము కల్గి యున్నాను. లోకులు నా వ్రాయుట కంగీకరింపకున్నను "విమర్శకబుధుఁడు" గారి యింకొక వాక్యమును రంగమున కవతరింపఁ జేసి రెండు పంక్తులు వ్రాసి విరమింతును. క్షమింపుఁడు—

"వరుఁడు నళినాసన వాహన హంసములలో నొకఁడు, వధువు నళినాసన రథవాహన హంసపతివంశ సంభవ. అట్లయినచో, నేకగోత్రజనితులకు వివాహ మంగీకరింపవలయునా?"

చూచితిరా? విమర్శకబుధుఁడుగారి ధర్మశాస్త్రపరిశీలనము. హంసములకు వివాహమొనరించుపట్టునఁ గూడ—

"చాతుర్థిం" అను శ్లోకార్థమునే కాక "కూటస్థగణనాయాం తు స్వసారం మాతరం వినా, ఊనద్వాదశవార్షికీమ్." లోనగు శ్లోకతాత్పర్యములనుగూడ విచారించికాని చేయఁగూడ దన్నంతలో నున్నది. ఒకటి మన మాలోచించుకోవలెనేమో? సర్వసామాన్యమైన పక్షులవిషయమే యగుచో "విమర్శకబుధుఁడు"గా రింత విచారింపరు. ఈ పక్షులకు మనుష్యభాషణాదులే కాక చాలవిద్యలు వచ్చిన ట్లున్నది కావున వీనివివాహవిషయము మనుష్యులతోపాటుకూడ కాక అంతో యింతో బ్రహ్మసంబంధముకూడ నుంటచే బ్రాహ్మణులతోపాటు చేయింపవలె నని వారితాత్పర్యమేమో? మహాత్మ్యకార్యములగు సంభాషణాదులు వీనియందుండుటచేత నే మహద్వివక్షు చేసి—"ఏకగోత్రజనితులు" అని ప్రయోగించియున్నా రనుకొందమా? ఆ యీ సందర్భములను బట్టి యీ వివాహమునకు పంచకరహితమైన లగ్నముకూడ బలవత్తర మైనది యున్నంగాని విమర్శకుఁడుగా రొప్పరు కాఁబోలును! ఇంతేకాక రజస్వలావివాహమునకుఁ గూడ నొప్ప రనుకోవలెను. పక్షుల విషయమున రజోదర్శనవయోనిర్ణయము నగయిరా లీయనకు తెలిసియేయుండు ననుకోవలెను. మఱచితి నింకొక పెద్దచిక్కున్నదికదా! "శారదా" బిల్లుబాధ కూడ గమనింపక యీలోఁగానే యీపక్షుల వివాహము జరుపవలె నని నిర్బంధింతురు కాఁబోలును! ఇతరుల కెట్లులైనను మాకును, ఈయనకును ప్రేంచిటవును యానాము పరిచయము పూర్తిగా నుంటచే బిల్లుబాధకు

మేము భయపడము. అయ్యో! విమర్శనమా! నీ కెన్నిపాట్లు వచ్చినవి! నీకర్మ మెట్లు కాలు చున్నదో చూచితివా? 'కాదు. ఇది పరుణ భాషావేత్తల సంప్రదాయపు వాసనతో మిళిత మైన విమర్శన' మందువా? అఘోరించినట్లే యున్నది నీ సమాధానము. చెప్పెద నాలింపుము. కాళిదాసు నెఱుఁగుదువా? రఘువంశ మెఱుఁగుదు వనుకొందును. అగుచో నందినీ ధేనువు నెఱుఁగకుందువా? ఎఱుఁగుదువు. దాని యందున్న మహత్కార్యములనుమాత్ర మేల యెఱుఁగకుందువు? అగుచో, ఆనందినీ ధేనువునకు పంచభక్ష్య పరమాన్నములను బెట్టింపక కాళిదాసు దిలీపమహారాజువంటి చక్రవర్తిచేత గడ్డినే పెట్టించినాఁ డేలొకో? తెలిసికొంటివా?

"శ్లో. ఆస్వాదవద్భిః కబళై స్తృణానామ్"
(రఘువంశము. ౨ వ సర్గము)

ఎంత మహద్వ్రతమునకు తగినదానికేని జాతిధర్మ మనివార్య మనిరేకద! ఆనందినీ ధేను సంతానమునకు దాంపత్యవిషయమున వరుసవావు లుండునా? లోకముననున్న పశువులలో నెక్కడనేని యీ విషయము నెఱుఁగనివారు మనుష్యమాత్రులలో నేజాతిలో నేని గలరా? భవతు. అది పశువిషయము, ఈ దృష్టాంతము పశువిషయ మందువేమో. పక్షులకుమాత్రము వరుసవావు లున్నవా? హంసముల నెఱుఁగవుగాని పావురములనేని యెఱుఁగవా? ఏకగోత్ర జనితులకఁట! వివాహమఁట! అంగీకరింప వలయునఁట! మేలు! మేలు! మాటలాడ నేర్చిన మాత్రాన జాతిధర్మములకు స్వస్తి చెప్పనెడల శ్రీహర్షాదుల కీజ్ఞాన మేల లేకపోయినదో? "మృణాళాగ్ర భుక్కులనుగా శ్రీహర్షుఁడు హంసముల నేల చిత్రించెనో కదా? చిత్రించుఁగాక. దానినాంధ్రీకరించిన శ్రీనాథునకుఁ గూడ నవకించు తెల్వి లేదాయెనే! "రసంబు పోషించియు, అనుచితంబు త్యజించియు" ఇత్యాదికము లెన్నో మాటలుపోద్ఘాతములో వ్రాసికొని కదా శ్రీనాథుఁ డాంధ్రీకరింప మొదలిడినాఁడు!

"చదలేటి బంగారుజలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బూవుఁబోఁడి!"

అని యేల యాంధ్రీకరించెనో? మనుష్య భక్షణయోగ్యమైన వస్తువులనే భక్షించెద మని హంసచేఁ జెప్పించినచో "విమర్శక బుధుఁడు"గారినంటివా రానందింతురుగదా! స్థాలీపులాకన్యాయమున — "వెక్కిరింపఁ బోయి" అనుసామెతను వాఁడనస్థలమునుబట్టి యే"విమర్శకబుధుఁడు"గారి తెల్వి తేటలుస్పష్ట మయినవిగదా! పిమ్మట. విమర్శించుపాత్రము నంగల నవరణను గుఱించపక వృథాసోదెను పెంచి విలువగల భారతీపత్రికకు వ్యర్థపుఁ బనిగల్పించి, "చావల్ ఖరాబు" సామెతను జ్ఞప్తికిఁ దెచ్చుటవలన మఱింత స్పష్టపడియుండును. ఇఁక నీ "ఏకగోత్రజనిత" వివాహ విచారమువలననో? "సర్వం సంపన్నం, సుసంపన్నం" అయిన దనుకొనివా

రుండ రనుకొందును. ఈ వివాహసందర్భము ప్రథమాంకములోనిదే. ఇది నూటఁ దొంబది వంతులు పూర్తి యగువఱకు తిరుపతి శాస్త్రి గారు జీవించియేయున్నారు. ఇది మన ముందుఁ బెట్టికొని యీ క్రింది గ్రంథమును దిలకింపుఁడు.

"తిరుపతిశాస్త్రిగారొక్కరే సంపూర్ణముగ నీ నాటకమును రచించిన నిట్టి పూర్వోత్తరవిరోధము లుండకుండునో? లేక యింత కన్న నెక్కుడుగా నుండునో?"

"విమర్శకబుధుఁడు"గారి తాత్పర్యము కాదుగాని పైకిమాత్ర మీ వాక్యమున కర్థము, "అయ్యవారిని జేయఁబోయిన" అను సామెతకు స్ఫోరక మగుచున్నది కావున నిదిగూడ "బోల్తాపడు" అన్నదానితో జమకట్టుకొని, అతని తాత్పర్యమునుబట్టియే పైవాక్యమున కర్థము చెప్పికొందము. తాను తెల్విలోపముచే మానాటకమునఁ జూపిన లోపములకు ముఖ్యకారణము, వేంకటశాస్త్రులుగారి రచనముగూడ నిందుఁ జేకుటయే యన్నది "విమర్శక బుధుఁడు"గారి తాత్పర్యమైయున్నది. అగుచో, ప్రథమాంకస్థమగు— "ఏకగోత్రజనిత వివాహము" వేం. శా. రచనకు సంబంధించినది కాదుగద! ఇది స్వవచోవ్యాఘాతమా, కాదా? బ్రదుకంతయు స్వవచోవ్యాఘాతముగా నున్నప్పుడు—ఇది అని విడఁదీసి చూపరాదని ప్రాజ్ఞు లందురు కాఁబోలును! అగుచో, నీక్రిందిమాటలు వ్రాసి ముగింతునుగాక—బాగుగ నాలోచించినచో నీనాటకము రచించుటకు, తి. శా. గారును అర్హులు గారు, వేం. శా. గా రంతకు మున్నె కారుగదా! ఈ కథానాయిక ప్రభావతిగాని, నాయకుఁడు ప్రద్యుమ్నుఁడుగాని, లేక యిరువురుంగాని యేకొంచెమైనను అదృష్టవంతులే యైనచో నెన్నఁటికేని యిద్దాని రచనకు మా వోలేటి వెంకటసుబ్బరాయశాస్త్రులవారే పూనుకోవలయు ననుకొందును. అది యటులుండె. సంశయమున్నచో, విమర్శకబుధుఁడుగారు వ్రాసిన చొప్పున—"జీవతః కవేః ప్రష్టవ్యమ్" కనుక జీవించియున్నా కొకకార్డు వ్రాసి కనుఁగొవచ్చునే! లేదా తన కన్నఁ గొన్ని రెట్లధికుఁడు, తారతమ్యజ్ఞానశాలి, మాయింటిపిల్లుఁడు, విశేషించి తన కన్నయునైన సూర్యనారాయణశాస్త్రి నడుగవచ్చునే! లేదా? అతనిద్వారమున నాకు కబురుచేసి తెలిసికోవచ్చునే! పత్రికలో వ్రాసియే కనుఁగోవలెనోటు? కావున నీప్రయత్నము సర్వథా యశస్సంపాదనార్థ మనుకోకతప్పదు. దానికిని మంచిమార్గము లనేకము లున్నవి. ఈయన వాని నన్నిటిని విడిచి యీముళ్లకంచెలోఁ బడినాఁడు. పాపము! గ్రంథకర్తచే క్షమాపణచెప్పించి సంతోషింపవలయు నని యీయనకుతూహలము. చూడుఁడు.

"పరిశీలించి నవరింప నక్కఱలే దనిన సంతసము"

పై వాక్యమువలన "విమర్శకబుధుఁడు" గారికుతూహలము వెల్లడి యగుచున్నది గదా? ఈయనను తఱచుగా మీరు విమ

ర్శకబుధుఁ డని వ్రాయుచుంటిరే, కారణ మేమని చదువరు లడుగుదురేమో? ఆబిరుద మాయనవాక్యములయందలిదే !

“శ్లో. గుణదోషౌ ... నియచ్ఛతి” అను విషయము విమర్శకాన్యబుధవిషయమని చెప్ప వలయును.”

ఈయన కేవలబుధుఁడు కాక “విమర్శక బుధుఁ”డఁట! అక్కతమున “గుణమును గ్రహించుట మాని దోషమునే గ్రహించు” నఁట! అందులకై వెదకి వెదకి— “వెక్కిరింపఁ బోయి బోల్తాపడెను” కాఁబోలు; నాకు శీర్షికను వెదకికొను పరిశ్రమలేకుండఁ జేసి పెట్టినందులకే “విమర్శక బుధుఁడు” గారిని మిక్కిలి యభినందించుచు, నిప్పటికి దీనిని ముగింతును. ఇంకొకపరి “ప్రతిఫలన” మునుగూర్చి యోపిక తెచ్చికొని కొండొక వ్రాయుదును. వ్రాయుట కేమిగాని యీవిమర్శకబుధుని లోలోనేని అన్న సూర్యనారాయణశాస్త్రి మందలించుట యావశ్యక మని నా తలంపు. ఇది యుక్తమే యని తోఁచినచో నతఁ డఙ్గీకరించుఁగాక. లేదా, “కాఁదగ్గపని గంధర్వులే తీర్తురు!!”


# జెనిత్ ద్రాక్షాసవ

ఆయుర్వేద శాస్త్రీయ పద్ధతులమీద తయారు కాబడినది

ఆరంభదశలో నున్న క్షయరోగము, ఉబ్బసము, శ్వాసనాళీదాహము, ఊపిరితిత్తులకు సంబంధించిన యితర వ్యాధులు, శీతలము, పడిశెము, మందాగ్ని, అజీర్తి, మలబద్ధకము, కడుపు పులియుట, వాంతులు వచ్చువట్లుండుట అన్ని విధములగు గొంతువ్యాధులు మున్నగు జాడ్యములను ఇది పూర్తిగా కుదుర్చును. పిల్లలకున్ను పౌష్టికములలో అద్వితీయ మైనది. త్రాగుటకు మధురముగా నుండును. క్రమముగా సేవించినచో, ప్రేగులను శుభ్రముగా నుంచి, ఆకలిని వృద్ధిజేయును. జెనిత్ ద్రాక్షాసవమును రాత్రివేళ పరుండకముందు పుచ్చుకొనిన సుఖనిద్ర నిచ్చును. ఉదయమున మేల్కాంచినంతనే తమపనులయం దాసక్తులై చురుకుగా నుందురు.

“జెనిత్ ద్రాక్షాసవము” ఇప్పుడు ప్రతినగరములోను, పల్లెలందును గల దుకాణములలో దొరకును. తపాల ద్వారా సీసాల నంపుటచే మిగుల వ్యయ మగును గాన మా ఖాతాదార్లు వారి గ్రామములో గల దుకాణములందే “జెనిత్” ద్రాక్షాసవమును కొనినచో వీలుగా నుండుటేకాక లాభకరముగాగూడ నుండును.

వెల 1½ పౌను రు. 1-12-0. 1 పౌను రు. 1-4-0. ½ పౌను రు. 0-12-0. ప్యాకింగ్ వి. పి. ఖర్చులు ప్రత్యేకము.

ఆంధ్రజిల్లాల యేజంట్లు:—
ఉపేంద్ర అండు కో., గుంటూరు.

**Zenith Chemical Works,**
Dekarau mansions, Princess St., Bombay No. 2.

# పద్యానుబంధము

వ్యాకరణవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ,

ఆ కె ళ్ల శే షా ద్రి

ధాతువులు సకర్మకములనియు, నకర్మకములనియు రెండువిధములు. కర్మంబుతోఁగూడినవి సకర్మకములు; కర్మశూన్యము లకర్మకములు. 'కొట్టు' మొదలగు ధాతువులకు 'కుక్క' మొదలగు కర్మంబు లుండును గాన నవి సకర్మకంబులు; 'నవ్వు' మొదలగువానికిఁ గర్మంబుండ నేరవు గాన నాధాతువు లకర్మకంబులు.

సకర్మకధాతువులకంటె లకారములు కర్త్రర్థమునందును, కర్మార్థమునందును వచ్చును. అకర్మములకంటెఁ గర్త్రర్థమందుమాత్రమేవచ్చును. ఈయర్థము నే పరవస్తు చిన్నయసూరిగారు "లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును, లాఁతికిం గర్తయందు నగు" (బాల. వ్యా. క్రి. ౪౮.) అని చెప్పియున్నారు.

సకర్మకమగు కొట్టుధాతువునకుఁ గర్త్రర్థమున లడాదులచే "కొట్టుచున్నాఁడు, కొట్టెను, కొట్టఁగలఁడు, కొట్టును" మొదలగురూపము లేర్పడును. ఇంకఁ గర్మార్థమున "పడుజ్యనుబంధంబు కర్మంబునం దగు" (బా. వ్యా. క్రి. ౪౯.) అనుసూత్రముచే 'పడుజి' అను ననుబంధమును, పడుజియందలి జిత్త్వముచే "జిత్తు పరంబగునపు డుత్వంబున కత్వం బగు" (క్రి. ౫౦.) అనుసూత్రముచే ధాతూకారమున కత్వమును, "కలజిపడుజులు పరంబు లగునపుడు నుగాగమం బగు" (క్రి-౨౧) అనుసూత్రముచే నుగాగమంబును, ఆనుగాగమము ద్రుతమగుటంజేసి యద్దానికి ద్రుతకార్యములును రాఁగా, 'కొట్టఁబడు' అను ధాతురూప మేర్పడును. దీనికంటె లడాదు లుత్పన్నము లగుటచే "కొట్టఁబడుచున్నాఁడు, కొట్టఁబడెను, కొట్టఁబడఁగలఁడు, కొట్టఁబడును" మొదలగు రూపము లేర్పడును.

"రాముఁడు రావణునిఁ గొట్టుచున్నాఁడు, రామునిచే రావణుఁడు కొట్టఁబడుచున్నాఁడు" అనువాక్యద్వయమునందును రాముఁడే కర్త, రావణుఁడే కర్మంబు. ఇచ్చట 'కొట్టు' ధాతువునకు 'బాధకలిగించుట' అని యర్థము. బాధ యనునది ఫలము, కలిగించుట యనునది వ్యాపారము. ఈరెండును ధాత్వర్థములేయని సిద్ధాంతము. "ఫలవ్యాపారయో ర్ధాతుః" అని వైయాకరణభూషణసారము. ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తయనుటచే 'కొట్టు' ధాత్వర్థమగు 'కలిగించుట' అనువ్యాపారమునకాశ్రయమగుటంజేసి రాముఁడు కర్త. ధాత్వర్థఫలాశ్రయంబు కర్మం బనుటచే 'కొట్టు' ధాత్వర్థమగు బాధ అనుఫలమున కాశ్రయ మగుటంజేసి రావణుఁడు కర్మం బనఁబడును.

'రాముఁడు రావణునిఁ గొట్టుచున్నాఁడు' అను చోటఁ గర్త్రర్థమున లకారము వచ్చుటచే లకారముచేతఁ గర్త యభిహితుఁడయ్యెను. ఇచటఁ గర్తృకారకవాచకమగు రామశబ్దముకంటె "చేతవర్ణకంబు కర్తకగు" (కార-3.) అను సూత్రముచేఁ దృతీయ ప్రాప్తించుచున్నను, నుక్తార్థంబగుటచే "ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులందుఁ బ్రథమ యగు" (కార- ౧ సూ.) అను సూత్రముచేఁ బ్రథమయే వచ్చును. మఱియు నిచ్చటి లకారముచేఁ గర్తయేకాని కర్మంబుక్తము కాకపోవుటచేఁ గర్మకారకవాచకమగు రావణశబ్దముకంటె నుక్తార్థప్రథమకుఁ బ్రాప్తి లేమింజేసి "కర్మంబున ద్వితీయ యగు" (కార-౨.) అనుసూత్రముచే ద్వితీయయే వచ్చును. కాన 'రాముఁడు రావణునిఁ గొట్టుచున్నాఁడు' అని యగును.

ఇంకఁ గర్మార్థమున "రామునిచే రావణుఁడు కొట్టఁబడుచున్నాఁడు" అనునపుడు కర్మార్థమున లకా

రము వచ్చుటచే లకారముచేతఁ గర్మం బభిహితమయ్యె. ఇచ్చట రావణశబ్దముకంటె "కర్మంబున ద్వితీయయగు" అనుసూత్రముచే ద్వితీయ ప్రాప్తించుచున్నను, దానిని బాధించి "ప్రాతిపదిక సంబోధనోక్తార్థములందుఁ బ్రథమ యగు" అనుసూత్రముచేఁ బ్రథమయే వచ్చును. ఇంక లకారముచేఁ గర్త యభిహితము కాకపోవుటచే నుక్తార్థ ప్రథమకుఁ బ్రాప్తిలేమిని, "చేతవర్ణకంబు కర్తకగు" అనుసూత్రముచేఁ దృతీయయేవచ్చును. కావున "రామునిచే రావణుఁడు కొట్టఁబడుచున్నాఁడు" అని యగును.

పై ప్రక్రియయంతయు బాలవ్యాకరణము ననుసరించి చేయఁబడినది.

ఆంధ్రవ్యాకరణములలో నెల్ల నతి ప్రాచీనమనఁ దగు నాంధ్రశబ్ద చింతామణిని రచించిన నన్నయభట్టారకుఁడు "కర్మణ్యనుబంధఃస్యా త్పతిధాతుః కర్తృవచ్చ తద్విధయః" (క్రి. ప.) అని చెప్పియున్నాఁడు. ఈ సూత్రమునకు వ్యాఖ్యాతలు, ప్రతిధాతువునకును గర్మార్థమున 'పతిధాతువు,' అనఁగా 'పడు' అనుధాతు వనుబంధముగా వచ్చుననియుఁ, బిమ్మటఁ దదనుబంధ విశిష్ట ధాతువుకంటె లకారాదులు కర్త్రర్థమున వచ్చునట్లే వచ్చుననియు, నర్థము చేసియున్నారు. కాని ధాతువుకంటె నీయనుబంధము వచ్చునని వ్యాఖ్యానముచేసినచో 'కొట్టుపడుచున్నాఁడు' అను ననిష్టరూపమగును. 'కొట్టఁడు, కొట్టగలఁడు' మొదలగు రూపముల నిష్పత్తికొఱకై చింతామణి క్రియాపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడిన 'వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్' అనుసూత్రమునందలి యాదిపదముచే నత్వము చేయుదమనినను 'కొట్టఁబడు, కొట్టంబడు, కొట్టన్‌బడు' అను రూపములలోని ద్రుతకార్యములను బొందునకారము నెచ్చటనుండి తేఁగలము? అట్టినకారమును విధింపకుండుట పర్యాలోచింపఁగా నీ పడ్వనుబంధము కేవల ధాతువులకంటె వచ్చునని యాతని యాశయము కానట్లును, తుమున్నాద్యర్థ నుజ్యంతములగు నసమాపక క్రియలకంటెఁ బడుధాతు వనుప్రయుక్తమగునని యూహించియుండునేమోయనియుఁ బొడగట్టుచున్నది.

నన్నయభట్టు తుమున్నాద్యర్థ నుజ్యంతములకంటెఁ బడుధాతు వనుప్రయుక్తమగునని స్పష్టముగాఁ జెప్పియుండలేదు. పడుధాతు వారూపములో నున్నదని మాత్రము స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. కాని యిచ్చటి ద్రుతకార్యముల నాతఁడు సాధింపకుండుటయు, నీరూపము పదద్వయముచే నేర్పడియుండునని చెప్పుట కవకాశముండుటయు నా పై యూహకు దారి చూపుచున్నవనుమాట సత్యదూరము కాదు. ఇట్లే వండఁగలఁడు మొదలగు భవిష్యదర్థక క్రియలలోఁగూడ ద్రుతకార్యములను సాధింపకుండుటచే నవిమూష నుజ్యంతములకంటె 'కలఁడు' అను క్రియను జేర్పఁగా నేర్పడినరూపములే యైయుండు నని నాయూహయు, దానికుపపత్తులును భావసంవత్సర వైశాఖమాస భారతిలో వ్రాసియేయున్నాను.

కాఁబట్టి 'కొట్టఁబడుచున్నాఁడు' మొదలగు శబ్దరూపములు చిన్నయసూరి తలఁచిన ఏకపదములు కాక 'కొట్టక' అను నసమాపకక్రియయును, 'పడుచున్నాఁడు' అను సమాపకక్రియయును జేర్పఁగా నేర్పడినవని మన మూహింపవచ్చును.

అట్లయినచో 'రామునిచే రావణుఁడు కొట్టఁబడుచున్నాఁడు' అనువాక్యమందలి రెండుక్రియలును నేకకర్తృకములా? భిన్నకర్తృకములా? అయినఁ గర్త్రన్వయ మేది? అచ్చటి విభక్తులకు సాధుత్వమెట్లు? వాక్యమున కర్థ మేమి? అనుప్రశ్నలకు సమాధానము లూహింతము. ఇచ్చట వాక్యార్థము మూఁడు విధములుగాఁ జెప్పవచ్చును.

౧. 'కొట్టక' అనునది భావలక్షణార్థనుజ్యంతము. దీనికి 'కొట్టఁగా' అని యర్థము. ఈయర్థమునందు నుజ్ప్రత్యయము బాలవ్యాకరణమున విధింపఁబడినది. (చూ. క్రి. ప. ౮౦ సూ.) 'పడుచున్నాఁడు' అనఁగా 'పొందుచున్నాఁడు' అని యర్థము. 'సుఖపడు, శ్రమంపడు' మొదలగు చోటులందు 'పడు' ధాతువునకు 'అనుభవించు, పొందు' అను నర్థములు ప్రసిద్ధముగానే యున్నవి. ఇచ్చటఁ గొట్టుటలో రాము

నికిని, పడుటలో రావణునకును గర్తృత్వము కలదు. 'రాముఁడు కొట్టఁగా రావణుఁడు పడుచున్నాఁడు, అనఁగా 'అనుభవించుచున్నాఁడు' అని యర్థము. ఈపడుధాతువు సకర్మకముకాన, దేని ననుభవించుచున్నాఁ డని ప్రశ్నరాఁగా, సన్నిహితధాత్వర్థఫలమే కర్మంబుగ నన్వయించుటచే, 'రాముఁడు కొట్టఁగా నా కొట్టుటకు ఫలమగు బాధను రావణుఁ డనుభవించుచున్నాఁడు' అని వాక్యార్థము సంపాదింపవలయును. కావున నీ కర్మార్థక ప్రయోగమునందు రావణునికిఁ గర్తృత్వమేకాని కర్మత్వ మెంతమాత్రమును లేదన్న మాట! రావణునికిఁ గూడ గర్తృత్వ ముండుటచేఁ దృతీయ ప్రాప్తించుచున్నను, 'పడుచున్నాఁడు' అను క్రియలోని లకారముచేఁ గర్తృత్వ ముక్తమగుటచే నుక్తార్థప్రథమయే వచ్చినది. మఱియు 'కొట్టన్' అను పదమునందలి నుజ్ప్రత్యయము భావలక్షణార్థమున వచ్చినదేకాని, రామునియందలి కర్తృత్వమును జెప్పఁజాలదు గాన, నుజ్యంతధాత్వర్థవ్యాపారాశ్రయత్వరూప కర్తృత్వమును నిమిత్తముగాఁ జేసికొని 'రామునిచేన్' అని తృతీయ వచ్చుట నిర్బాధ మని యెన్నినది.

'రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచెను' అను నుదాహరణమునందువలె 'భావార్థకాది యోగంబునం గర్తకుం బ్రథమ యగు (బా. వ్యా. కార. ౩౨) అను సూత్రముచే నుజ్యంతయోగమునఁగూడఁ బ్రథమరావలసినదేయని శంకింపంబనిలేదు. చిన్నయసూరి 'కొట్టఁబడుచున్నాఁడు' అనురూపము నేకపదముగానే తలంచి యున్నందున, దానిలోని 'కొట్టన్' అనుదానిని భావలక్షణార్థనుజ్యంతముగా గ్రహించినవాఁడు కాకపోవుటచే నిచ్చటితృతీయ యాతెనిసూత్రముచే సాధింపఁబడక పోయినను క్షతి లేదు. అతఁడు 'రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచెను' అనునది మొదలగునవియే భావలక్షణార్థనుజ్యంతోదాహరణములుగాఁ దలఁచి, యచ్చటఁ గర్తకుఁబ్రథమయే ప్రయోగములలోఁగానవచ్చుటంజేసి, యాప్రథమనే యా సూత్రముచే సాధించుకొని యున్నాఁడు. ఇచ్చటి తృతీయను మఱొకవిధముగా సాధించుకొనినాఁ డని మొదటనే వ్రాసితిని.

౨. 'నీవు కొట్టవలయును' అను మొదలగుచోటులందు వలయ్యాదిధాత్వర్థములోఁ గొట్టుధాత్వర్థవ్యాపారమునకును, నద్దానిలో యుష్మచ్ఛబ్దార్థమునకును గర్తృత్వము కలదుగదా! ఇట్టి ప్రయోగముల సాధుత్వమునకై చిన్నయసూరి "వలయ్యాదిక్రియలకుం గర్తయగు భావంబునందు నుజియగు" (క్రి. ౧౨౨) అనుసూత్రముచే 'కొట్టన్' అను చోట భావార్థమునందు నుజిని విధించినాఁడు. నుజ్యంతధాత్వర్థమగు కొట్టుటలో యుష్మచ్ఛబ్దార్థమునకుఁ గర్తృత్వమున్నను, "భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమయగు '(కార. ౩౨) అనుసూత్రముచేఁ బ్రథమయే వచ్చును. ప్రౌఢవ్యాకరణకర్తకూడ దీని ననువదించి, యిచ్చటినుజ్యంతముచేఁ గర్త యభిహితప్రాయ మనునభిప్రాయమును సూచించియున్నాఁడు. చూ॥ "కర్తృభూతక్రియతోడఁ దత్కర్త కన్వయం బగు" (క్రి. ప. ౨౭ సూత్రము.)

కనుక 'నీవు కొట్టవలయును' అనుచోట 'యుష్మత్కర్తృకమగు కొట్టుట వలయును' అనియు, 'నీవు కొట్టఁగూడదు' అనుచోట 'యుష్మత్కర్తృకమగు కొట్టుట కూడదు' అనియు నర్థముకదా!

పైయుదాహరణములలో భావార్థమున నుజివచ్చినట్లే 'కొట్టన్‌బడుచున్నాఁడు' అనుచోటఁగూడ 'కొట్టు' ధాతువునకంటె భావార్థమున 'నుజి' వచ్చిన దనుకొందము. వలయ్యాదిక్రియలలో నుజ్యంతధాత్వర్థవ్యాపారమునకుఁ గర్తృత్వమున్నట్లే, యిచ్చట 'పడు' ధాత్వర్థములో నుజ్యంతధాత్వర్థఫలమునకుఁ గర్మత్వ మున్నదనుకొందము. ఇచ్చట నుజ్యంతధాత్వర్థవ్యాపారములో రామునికిఁ గర్తృత్వము కలదు గాన 'రామునిచేన్' అనుతృతీయ యుపపన్న మగును. ఇట్టియభిప్రాయ మెచ్చటను వ్యాకరణకర్తలు సూచించియైన నుండలేదు. ఇచ్చటఁగూడ మొదటిరీతియందువలెనే రామునికిని రావణునికినిగూడఁ గర్తృత్వమే కలదు.

౩. 'కొట్టక రామునిచేతన్ రావణుఁడు పడుచున్నాఁడు' అనుచోటనున్న 'చేతన్' అనునది యౌప విభక్తికాంతమగు చేయిశబ్దముయొక్క సప్తమ్యేకవచనము. 'కొట్టక' అనునది తుమర్థ నుజ్యంతము. 'చెట్టునుండి పండుపడెను' అనుచోటునందువలె నిచ్చటిపడు ధాతువునకు 'పతన మగు' అని యర్థము. ఈయర్థమునం దిది యకర్మకము. 'కొట్టుటకు రామునిచేతిలో రావణుఁడు పడుచున్నాఁడు. అని యర్థము. పడుటలో

రామునిచేయి యధికరణముగాన, 'రామునిచేతన్' అని సప్తమివచ్చినది. సన్నిహితుఁడగుటచే రాముఁడే కొట్టుటలోఁ గర్తగా నన్వయించును. కొట్టుటకై రామునిచేతి యందు రావణుఁడు పడుచున్నాఁ డనఁగా, రాముఁడు రావణునిఁ గొట్టుచున్నాఁడని యర్థము. ఇచ్చటఁ గర్మంబగు రావణునికే కర్తృత్వము కలదు. తెనుఁగున నిట్టి కర్మకర్తృ ప్రయోగము లున్నవి. "పది రూపాయలు జేబులోఁబడినవి. అన్న ముడుకుచున్నది." మొదలైనవి. రూపాయలు స్వయముగా జేబులోఁబడలేవు. కర్త వానిని బడవేయవలయును. అయినను, రూపాయ లనాయాసముగా లభించినవను నర్థమును దెలియఁజేయుటకై యిట్లు ప్రయోగింతుము. ఇట్లే యన్నము నెవరైనను నుడికింపవలయునేకాని, యది స్వయముగా నుడుకదు. అయినను 'తొందరగా వంటచేయుచున్నాను. ఆలస్యము లేదు. తినుటకై తెమ్ము' అను నర్థమును బోధించుటకై యన్న ముడుకుచున్న దని యందుము. ఇట్టివే 'కత్తి తెగుచున్నది.' మొదలగున వని యెఱుంగునది.

సంస్కృతవైయాకరణులు సౌకర్యాతిశయము సూచింపఁబడునపుడు కర్మాదికారకములుకూడఁ గర్తృత్వము నొందు నని చెప్పి, యట్లే యుదాహరించి యున్నారు చూడుఁడు.

"యదా సౌకర్యాతిశయం ద్యోతయితుం కర్తృవ్యాపారో న వివక్ష్యతే, తదా కారకాన్తరాణ్యపి కర్తృసంజ్ఞాం లభన్తే, తేన పూర్వం కరణత్వాదసత్త్వేపి సంప్రతి కర్తృత్వా త్కర్తరి లకారః. అసిశ్ఛినత్తి, కాష్ఠాని పచన్తి, స్థాలీ పచతి, ఓదనః పచ్యతే"

(సిద్ధాన్తకౌముది, కర్మకర్తృప్రక్రియ.)

కాఁగా నిచ్చటి 'చేతన్' అనునది సప్తమ్యంతమే! కాని క్రమక్రమముగా భాషలోఁ బ్రత్యయముగా మాఱియుండుటచే నిది తృతీయావిభక్తి యని యనుకొని, యీవాక్యమందలి విభక్తుల సాధుత్వమునకై చిన్నయసూరిగారు మాఱుదారి త్రొక్కవలసివచ్చినది. చాలవఱకుఁ బ్రత్యయములు ప్రత్యేకపదజన్యములే యని భాషాశాస్త్రవేత్తల యభిప్రాయమై యున్నది.

పై మూఁడుమార్గములలోఁ జివరిమార్గమే భాషాశాస్త్రసంప్రదాయము ననుసరించియుండుటచే, నద్దియే యుక్తతమముగాఁ గన్పట్టుచున్నది. "కర్మణ్యనుబంధః స్యా త్పతిధాతుః" అనిచెప్పిన చింతామణికూడఁ బతనార్థకమగు పడుధాతు వనుబంధకమగు నని బోధించుచు నీమూఁడవపక్షమునే సూచించుచున్నదా యనవచ్చును.

'కొట్టఁబడుచున్నాఁడు' మొ॥లగునవి పదద్వయజన్యములని మహాకవుల ప్రయోగములును జాటుచున్నవి.

(౧) "కానంగఁ బడునన్నఁ గైకొని" (భారతము.)

(౨) "పతితులనఁగఁబడుదురు జగతిన్" (పద్మపురాణము.)

(3) నలుచేత విడువంగఁబడిన హంస. (భార. అర.)

పై యుదాహరణములలో 'కానఁబడును' 'అనఁబడుదురు' 'విడువఁబడిన' అనునవి యేకపదములే యయినచో వానిలో మధ్యమున 'కన్' అనునది యుండుట యసంభావ్యముకదా! కాన నారూపములు పదద్వయజన్యము లనియే యూహింపవలయును. ఇట్టిప్రయోగము లెన్నియేని చూపవచ్చును.

ఇంగ్లీషుమొదలగు మఱికొన్నిభాషలలోఁగూడ నీయర్థమున రెండురెండుపదములనే వాడుచున్నారు.

సంస్కృతవైయాకరణులుకూడ 'భవితా + అసి' అను రెండుపదముల నేకపదముగా భ్రమించి, ప్రక్రియ సృష్టించి, సంస్కృతభాషలో 'లుట్' అను లకారమును గ్రొత్తగాఁ బుట్టించిరని సంస్కృతభాషాశాస్త్రవేత్తల యభిప్రాయము. (చూడు: భావ సంవత్సర వైశాఖమాస భారతిలోని 'ఆంధ్ర క్రియావిశేషములు' అను నావ్యాసము.)

ఇట్లే తెనుఁగులోని 'కొట్టఁబడుచున్నాఁడు' మొదలగు రూపములుకూడఁ బదద్వయ నిష్పన్నములే కావచ్చును. అయిన నీయాంధ్ర వ్యాకరణకర్తలు తాము వ్యాకరణములు వ్రాయునపుడు విశేషముగా సంస్కృత వ్యాకరణము ననుసరించినవా రగుటచే సంస్కృతమందలి 'హన్యతే' మొదలగు కర్మార్థకక్రియలు పదద్వయజన్యములని యనుటకు నిశ్చితప్రమాణము దొరకనందున, నీవ్యాకరణమునఁగూడ నీక్రియలను స్వతంత్రైకపదములనుగా సంస్కరించియుందురు.

కాని, వీని నిట్లు స్వతంత్రైకపదములనుగా సంస్కరించుట భాషాశాస్త్ర సంప్రదాయ విరుద్ధమేమో యని నాయభిప్రాయము.



'బతికి చెడినా తెనుగు ప్రాణమ్ము పోలేదు!'

కవి — పండితుడు — విమర్శకుడు - వ్యాసకర్త- కథానక రచయిత

తెనుగువీణ — సమీక్షాపంచకం1 — సాహిత్య గోష్ఠి 2 కథాశ్రేణి3 పై నాటి కుదాహృతులు.

# ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

దే. విశ్వేశ్వరరావు

కొలదిపాటి యువకులగు సారస్వత వర్ధమానుల శ్రేణిలో ఇతడు మంచిస్థానాన్ని ఆక్రమించాడు. కవిత్వంలోనూ కావ్యవిమర్శలోని క్రొత్తపోకడలు కథానకరచనలోని విశిష్టతా అలవరచుకొన్న ఈతడు అధునాతనాంధ్ర సారస్వతయుగంలో మంచిస్థానాన్ని ఆక్రమించుతాడు. సాహిత్య విమర్శలో ఎన్నదగిన పరిణతి చూపిన ఇతణ్ణి సారస్వతవర్ధమానుల్లో చేర్చుటకు కారణం ఇతడు కావ్య నిర్మాణంలోనూ, కథానక రచనలోనూ ఇంకా చూప వలసిన రచనా సౌలభ్యత, విషయోన్మీలనమూ, కథా వైదగ్ధ్యమూ మాత్రమే * కవిగా, విమర్శకుడుగా, వ్యాస - కథానకరచయితగా నీతడు చూపిన నేర్పు కూర్పుల నింక చర్చించెదను.

వీరేశలింగయుగంలో పానుగంటివారివలె అధునాతనాంధ్ర సారస్వతయుగంలో ఇతడే సారస్వతంలోని వివిధాంగాల్లో కొంచెమో గొప్పో సంబంధం కలవాడు. గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావుగార్లు ప్రారంభించిన నవీనాంధ్ర సారస్వతోద్యమంలో ఉత్సాహంతో పనిచేస్తూన్న పలువురు యువకుల్లో ఇతడొకడు. నూతన మార్గాల్లో సాహిత్యవిమర్శ, కథానక రచనా, కావ్యనిర్మాణం చేస్తున్న

౧

కవి:

"Poetry is the flower of magic, not of logic" —Edith Sitwell,

† 'ప్రేమకలుగక బ్రతుకుచీకటి!' అనే అప్పారాయకవీంద్రుని దివ్యసూత్రంమీద తన కవితాప్రవృత్తిని నడిపింప నుత్సహించినాడు. లోతు లేకపోయినా హృదయంమీద పనిచేసేరీతితో కావ్యాన్ని దిద్దుకొంటాడు. "ప్రపన్నాత్మ" లో వలె ఏదో దురంతావేదనను ఆత్మనివేదనపూర్వకంగా పరమేశ్వరునుద్దేశించి చెప్పుకుంటాడు:

---

1. "ఉపన్ను" అనినట్టుగ ఈగ్రంథాన్ని 'సమీక్షాపంచకం' అనుటయే చాలాఉచితంగా కనపడుతుంది, గ్రంథనామం 'వ్యాసావళి' అని ఉన్నాకూడా. 2, 3. ఈరెండు గ్రంథాలూ ఇంకా అముద్రితాలు.

* "Even the greatest men of letters are in a sense men of promise" ("Triveni" Vol. I, p 96.)

† ఆధునికాంధ్రకవిత్వంలో అభిమానవిషయం ప్రేమ. ఇది ఎంతయు ప్రశంసనీయము — ఆంగ్లకవి Baily "Poets are all who love, who feelgreat truths and tell them; and the truth of truth is Love" అన్నాడు.

"ప్రాకికొనివచ్చినాడ విశ్వాంగణమున
కీ సుగూరభారమ్ము సహించుకొంచు
నీ మధురహాసమురళి విన్పించునంత
నీ సుమామోదభరము వాసించునంత

..........................

ఈప్రపంచమ్ము పరమమోహాంకితమ్ము......
తీసుకొని వచ్చి నన్నిట దింపినావు
ఓప్రభూ! పూతనవనీత జీవితముల
నర్థమే చేసికొనని నిర్భాగ్యులందు
వేగలే నాగలే నింక విడివిపత్తు
తీసికొనిపొమ్ము! నీశాంతి ధామమునకు* "

ఈపద్యాలలో రవీంద్రకవిచంద్రుని మర్మకవిత్వ (Mysticism) ఛాయలు బహుళంగా గోచరమౌతున్నవి. వైష్ణవగీతాలలోని ప్రేమోన్మాదమూ, హృదయపక్వతా ఇందులో ప్రత్యక్షము.

ప్రేమప్రవృత్తిని బహుభంగుల ఆకళించుకొని పలుపోకలు పోయినాడీ కవి. పరావృత్తమైన ప్రేమ వేదనను 'ఈ కుసుమము కోలపే ఎవరికో దయచేయుము ప్రేమమూర్తినై' అని వెలిగ్రక్కెను. ఇంకా, విస్మృత ప్రేమ సన్నివేశాన్ని తలుచుకొని ఉవ్విళ్లూరే ఒకస్నిగ్ధ హృదయచిత్రము. కడు హృదయంగమము.

"త్రవ్వుకొలంది పూర్వపు కథల్ నవయౌవన తీవ్రవేళలం దివ్విధి దారుణంబుగ నదించు నభోధినకాల మేఘముల్."

(కావ్యం : ఏనాటిమాటలో)

ఈ ప్రేమసన్నివేశాని కిచ్చిన ఉపాధి (Back Ground) తీర్పు ఇంకా మనోహర మయినది :—

'ఉరుములకు పొంగిపోయి మయూరరాజు
హేమరత్నకిరీట మూడించుమోల'

ప్రకృతిలో ఉండే వివిధానుభూతులను ఆకళించుకొని ఒక అవ్యక్తవేదనతో ఇట్లా విప్పుతూఊతాడు మరొకచోట... (కావ్యం: ఏమో.)

'ఏపువ్వు పూసినా
ఏపాట పాడినా
ఎందుకో ఈహృదయ

---

* I am restless. I am athirst for far-away things

My soul goes out in a longing to touch the skirt of the dim distance

O Great Beyond, O the keen call of thy fluk!

I forget, I ever forget, that I have no wings to fly, that I am bound in this spot evermore.

I am eager and wakeful, I am a stranger in a strange land.

Thy breath comes to me whispering an impossible hope

Thy tongue is known to my heart as its very own

O Far-to-seek, O the keen call of thy flute!

I forget, I ever forget, that I know not the way, that I have not the winged horse.

I am listless, I am a wanderer in my heart.

In the sunny haze of the languind hours, what vast vision of thine takes shape in the blue of the sky!

O Farthest end, O the keen call of thy flute!

I forget, I ever forget, that the gates are shut everywhere in the house where I dwell alone! — Rabindranath Tagore — The Gardener (5th song.)

మింత కళవళ పడును?' అంటూను. 'చుక్కల మేడపైని జాబిలిరాజు' పకపకా నవ్వితే తన హృదయం 'కళవళపడునట! *

కవి ఒకప్పుడు పరావృత్త ప్రేమకు ఫలితంగా విరాగి అయి నిర్విణ్ణుడౌతాడు—అయి 'నీనవ్వు వెలుగులో నిలుపలేని బ్రతుకు, కమలినీ! కమలినీ! కరమెత్తి పిలువకే"

అని అపవృత్తిలోనికి దిగుతాడు. "మారుమ్రోత" కాళిదాసు ఒక అనుభవానికి విపులవ్యాఖ్యానం.

'వేలయుగములనాటి
ప్రేమవేదన రేగి
ఈయెడద చీల్చుకొని
ఎగసె "లావా" వోలె'

గేయాలలోని పలుకుతీర్పు చక్కగా ఉంది. భావప్రకటన స్వాయుగా వెళ్లినది. ఇతనికవిత్వం పద్యాల్లోకంటే గేయాల్లోఉంటే బాగానడుస్తుందేమో అనిపిస్తోంది. తెనుగుకవిత్వం పద్యంలోకంటే గేయంలో బాగా ఒదుగుతుందనే నమ్మకంగల గురజాడశ్రేణికి చెందుతాడితడు. గేయరచనలో అందవేసినచేయి 'భావకవిసామ్రాట్టు' బసవరాజును మేలుబంతికి తీసుకుంటే ఈతనిగేయాలు ముందుముందు చక్కగా నడుస్తాయి. ఈకవి "దిగనారిపోయిన
తెలుగుబిడ్డణ్ణి"

అని 'రాజమంద్రి' అనేగేయంలో తెనుగుతనాన్ని పురెక్కిస్తాడు. 'గోదావరమ్మ'ని 'కంట చూడంగానె' 'కడుపు చెరువౌతుం దీకవికి. విస్మృతాంధ్రాన్నత్వాన్ని జ్ఞప్తికితెచ్చేసన్నివేశాల్ని చూసి 'గుండెనెత్తురు పొంగుతుం' దంటాడు. (సంక్రాంతి—గేయం.)

'అవిరళజ్వాల మంతర్జ్వలామి!' 'మనిషి' అనే గేయంలో ఈతడు తన శరీరంలో నెత్తురోడినా, సత్తువుడిగినా దేశానికీ హృదయానికి ఆత్మార్పణం చేయ దలచినట్లు తన అనుభవాన్ని తెలుపుకొంటాడు. 'క్షామానికి క్షేమానికి నిలువునిలువునా నిప్పయిపోతా'నంటూ ఒక్కొక్కప్పుడు 'తలపుతలపునా' 'ఉలుకెత్తిస్తా' నంటూ ప్రతిజ్ఞపూనుతాడు. ఈగేయంలో దేశాభిమానంలేని తోడిసోదరుని ఉత్తేజితునిచేసి కార్యశూరునిగా మార్చ ప్రయత్నిస్తాడు. ఇందులో ఒళ్లెరుగని వీరావేశం ప్రస్ఫుటమౌతున్నది. "స్మృతికణాలు" (ఆంగీరస సం॥) స్థానిక చారిత్రకవిషయ గర్భితాలైనా, చాలా ఉత్తేజకరంగానూ, పకడగానూఉన్నాయిఇతనిమాటలు.

౨

'పగులదన్నుము వజ్రకవాటములను!' సాంఘికంగా ఈతడు చాలా ముందుకుపోయాడు. భావనాప్రపంచంలో అద్భుత పరిణామప్రవృత్తీ, సంఘకలుష వృత్తిని వేలెత్తిచూపటంలోని నిర్భయత్వం—ప్రశంసార్హాలు. సంఘ పునర్నిర్మాణోద్దేశం 'పండుగనాడు' 'మాయమనుషులు', 'ఒకడు' అనే కావ్యాల్లో కనపడుతుంది.

'ఒకడు' అనే కావ్యంలో ఇతడు సాంఘిక భావనాప్రపంచంలో ఉత్పన్నుడైన కవికుమారుడుగా కనపడతాడు. ఇందులో ఒక ప్రేయసీ ప్రియుల ప్రణయగాథ-వారిని సంఘం ఎట్లా పీడింపబూనిందో వర్ణించాడు కావ్యాంతాన్ని :

'పగులదన్నుము వజ్రకవాటములను
ఆవులించి తిండ్రించు సింహాల నదిమి
బొబ్బలెత్తింపు కృతసటాస్ఫోటనమున
యువక! నీ స్నిగ్ధహృదయమ్ము ఉడికెనేని.'

---

* ఈ గేయంలో 'కాళిదాసు' కవిత్వంలోని ఛాయలు కనిపిస్తాయి.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్ పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః,
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం భావస్థిరాణి జననాంతరసౌహృదాని"

ఈ శ్లోకపుస్ఫురణయే "మారుమ్రోత"కుఆధారం.

అంటూ చేసే ప్రబోధన సాంఘికమాలిన్యాన్ని ఉత్తప్తంచేసే ఉత్తేజితుడయిన కవికుమారుని వేలెట్టి చూపుతుంది. 'అంచలు'లో సంఘ కార్కశ్యాన్ని చూసి విసిగి మానవులు లేని లోకాలకి పోదాం రమ్మంటాడు ప్రేయసిని

"...నభోదినగీతికి ఒక్క అశ్రువే
వదలరు శుష్క మానవులు వారలతో మనకేమిలెమ్మపో
వుదము ఉమామహేశ్వర విచిత్రపదాంకితపుణ్య మేదినీ
పదముల రెక్కరెక్క గదియించి చరింపగ" అంటూ.

ఒక అభాగ్యజీవిశోచనీయస్థితి వర్ణించి చేస్తాడు సానుభూతితో హృదయాన్ని ప్రమ్మరిస్తూ, 'పండుగనాడు' అనే మరోగేయంలో. ఇందు కవియొక్క సుకుమారహృదయం సోదరజీవికష్టమునకు జాపు సానుభూతిమూలంగా సృగ్గోచరమౌతోంది.

కవి:—

"పాలవెల్లుల మొగలిరేకులు
పరిమళించిన వంతటూ
ఏలనో ఈ పాలవెల్లిని
వ్రేలుకో దొక పత్రమేకా—

* * *

ఊరిలో అందరికి ఉత్సవమ్మేట
ఇంటింటి బాలురకు ఇది పండుగేట
ఏ అబోధనిరాశ, ఏమానసాగ్ని
ఇతని పండుగమీద ఇంత రగిలింది."

అని దుఃఖితుడౌతాడు సానుక్రోశంగా. విశ్వసోదరత్వాన్ని ప్రబోధించే ఈగేయం ఆంధ్రసారస్వతానికి మెరుగుల వెట్టగలదు. 'కన్నెనోముల'న్న గేయం, భారత స్త్రీల ముగ్ధహృదయాన్ని ఉద్దేశించినది. * ఉషఃకాల వర్ణన ఉపాధి (back-ground) గా ఈ ఉద్బోధన తనరారుతోంది:—

' తూర్పుబంగరు కొలనులోనూ
తొందరగ జలకమ్ములాడీ
వచ్చినది మన ఉషోబాల—'

" లోతులేని లేతమనసుల, పూతపూసిన కన్నె ప్రేమల
వింత తియ్యదనాలుమరిగీ, సిగ్గులేలనె వెర్రితల్లీ!
*మగనిభాగ్యంకోసమై యే తగనినోములు నోచమన్నా
నగవుతో తలఊపి ముందుకు నడచివత్తువు కన్నతల్లీ!"

'మాయమనుషులు' ప్రత్యేకంగా ఎన్నదగినది. కావ్యవిషయం సంఘంలో ఉండే 'మాయమనుషులు' చేసే దౌర్జన్యాలు:—బ్రహ్మాండంలో ఉన్న శక్తిని అంతకంటె ఉత్కృష్టవస్తువుని చూపి ఆసపెట్టి అధోగతిపాలు చేయుట — వివిక్తప్రదేశాన నివసిస్తున్న ప్రేమోపాసకుని అకారణంగా బాధించుట—సౌఖ్యాంబుధిలో అమాయకంగా, నిర్విచారంగా జీవితం గడుపుతూన్న సుఖప్రాణుల్ని దుఃఖకూపంలో త్రోసేటందులకు ప్రయత్నించటం—విశ్వసౌందర్యాన్ని మలినపరచటానికి వెనుదీయకపోవుట—స్వర్గైకవాసియయిన కవికుమారుని రచనలమీద కత్తికట్టడం - వీటినిగూర్చి ప్రశ్నిస్తాడు కవి ముక్తకంఠంతో! ఈకవి తపఃతో వేసిన ప్రశ్నలకి సంఘంలోని దౌర్జన్యాలన్నీ సమసిపోవలిసిందే. కవిత్వానికి ముఖ్యావసరాలయిన ధ్వని (Suggestiveness), విశ్వజనీనత (Universaility), స్థిరత (Permanance) ఈకావ్యంలో ఉన్నాయి. ప్రతిభావిలసితం, పరిణతంఅయిన కవిత్వం ఇందులో కనిపిస్తోంది. ఇది ఒక రసగుళిక అని అనవచ్చు. 'రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం' కదా! ఇట్టి కావ్యాలు అధునాతనాంధ్రసారస్వతంలో అరుదుగా మాత్రమే ఉన్నాయి....ఈతని కవిత్వంలో శ్రేష్ఠరచనలు 'రాజమంద్రి' 'పిచ్చి తలపులు' 'ప్రపన్నాత్మ' 'కన్నెనో

---

* ప్రొద్దుపొడుపునోములు నోమఁ బూనినావొ చిట్టిబొట్టు కుంకుమఁ బెట్టు చిన్నదాన,
ధవళకీర్తిదుకూల సుందరములైన యాసలు పిలుదులంటు సోయగ మదేమె!

* అభము, శుభము నెఱుంగని యబల వయ్యు నదరు బెదరు లే కీవ్రత మందికొంటి
నేర్పరివిఁబోలె, కన్నెవు తీర్పఁగలవె? సందియము మాన్పరావమ్మ, చక్కనమ్మ!

"మంగళాచరణము" నుండి - "రాయప్రోలు"

# చిరకాలమునుండి బాధించుచున్న మూత్ర వ్యాధులకును శగ(గనేరియా)వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము




కృత్రిమములు చూచి మోసపోకుడు. "కోడి" మార్కు గమనింపుడు.

## గోనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము ఇంగ్లీషుమందులను దేశీయఔషధములను పుచ్చుకొనినను గుణముకలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేక పోయినయెడలను కడపటిప్రయత్నముగా మా గోనోకిల్లరునుగూడ పుచ్చుకొని చూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగ సంకటమైనను మరేట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గోనో. కిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝూకీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడు కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళమునందలివాపుతీసిపోవును. శగవ్యాధి (గోనోకోకసు)వలన మూత్రముబొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్రద్వారమునుండిపోవు తెలుపు, మూత్రద్వారముయొక్కవాపు. మూత్రద్వారముయొక్కచుట్టువుండు పొరయొక్కవాపు, మూత్రాశయముయొక్కవాపు లేక మూత్రతిత్తియొక్కవాపు, నరములజబ్బు, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గోనోకిల్లరువలన కుదురును. వీర్యము(సెమను)పోవుట, మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. ఖరీదు 50 మాత్రలుగల సీసా రు. 3-0-0. కృత్రిమములు చూచి భ్రమజెందవలదు. మా పుంజుమార్కు గమనింపుడు. వి. పి. చార్జి ప్రత్యేకము. అడ్రసు:—డాక్టరు డి. యన్. జసాని, గిర్గాను వెనుకరోడ్డు, బొంబాయి 4.

Dr D. N. JASANI, Girgaon Back Road, Bombay, 4.
Madras Agents:—DADHA & Co., 52, Nainiappa Naick St, P. T. Madras



## ముఖవర్చసుకు కాంతినిచ్చును



పటన్‌వాలా ఆఫ్గన్‌స్నోను తయారు చేసిరి. దీనియందు కేవలము వనస్పతులు నానా విధకుసుమముల సారములు చేరియున్నవి. దీనిని ప్రతిరోజు వాడుచున్నయెడల శరీరము మృదువుగానుండి ముఖములువలె అతి మనోహరముగా నుండును దేహము మీదిమచ్చలు, మొటిమలు, కురుపులు వగైరాలు మానును. బుగ్గలు గులాబిరంగుపొందును.

# ఆఫ్గన్ స్నో

ప్రతిచోట దొరకును.

### యి. యస్. పటన్‌వాలా,

182, 84 అబ్దుల్ రహమాన్ వీధి,

బొంబయి 3





# చలిజ్వరమా

## దీనిని సేవించినచో తిరిగి బలము చేకూరును.

ఈ తెల్లనిపొడరు మీకు తిరిగి బలమును శక్తిని నొడగూర్పకలుగునా యను శంకబొడమును. అయితే దానియందుఆరోగ్యముయొక్క ముఖ్యరహస్యమిమిడియున్నదనుసంగతిని మరువవద్దు. అందువలన దానికి 'సనటోజన్' అని పేరు. అనగా, ఆరోగ్యప్రదాయిని అని అర్థము.

సనటోజన్‌గురించి బొంబయిలోని యం. జే. సేత్ గారు ఏమివ్రాసియుండెనో మీరు వినియున్నారా? ఆలేఖ యిది—

"చలిజ్వరము తరచుగా వచ్చుచుండుటచేత బొత్తిగా శల్యావశిష్టుడనైతిని. ఆహారమేమియు తినలేకుంటిని. సనటోజన్ సేవించిన తరువాత చలిజ్వరము తగ్గెను. ఆకలిహెచ్చెను. జీర్ణశక్తి గలిగెను. ఇపుడు ఆహారమును భుజింపగలను. ఆరోగ్యముగూడ చక్కబడినది. నాశరీరమున ఒకవిధమగు యుత్సాహపటిమ ప్రవహించుచున్నది."

ఇతరులు వేనవేలమంది ఆరోగ్యము బలము జెంది 'సనటోజన్' యెడల కృతజ్ఞులై యున్నారు. మీరుకూడ అదేవిధముగ తిరిగి మీబలమును సంపాదించుకొనవచ్చును. ఈరోజునుండియే సనటోజన్ ప్రారంభింపుము. ప్రతి మందుల దుకాణములోను బజారులోను దొరకును.

# SANATOGEN

నెం. 1 నిజమైన బలప్రవృద్ధికౌషధము

సనటోజన్ తయారుచేయునపుడుగాని ప్యాకింగుచేయునపుడుగాని చేతితో తాకబడియుండలేదు. దీనిలో ఏజాతిమతవిరుద్ధములగు వస్తువులుగూడ కలిసియుండలేదు.

## ఆర్షరసాయనశాల ముక్త్యాల, కృష్ణా

స్థాపితము 1925

ప్రశస్తాయుర్వేదౌషధములకు నిలయము. ఏమందుకావలసినను మాకువ్రాయుడు. నమ్మకమైనవిలభింపగలవు

ఆయుర్వేదభూషణ
వేమూరి శంకరశాస్త్రి, ఎ.ఎం.ఎ.సి.
CONSULTING PHYSICIAN

## భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి. ఏ., బి. యల్.,

ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంతవిధానము, బాఘ్‌విహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములవైఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ-ఏకవర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్రకళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము. వెల. రు. 1-1-0.

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల,
నెం. 2, తంబుచెట్టివీధి, మదరాసు.

ములు' 'మాయమనుషు'లూను. కొన్ని కొన్నిచోట్లభావ కవిచాదస్తాలు కనపడుతున్నాయి. గణపతి కవితలోని తపనా, తుందుర్తిలోని వీరావేశమూ, మల్లవరపులోని నగిషీపనీ, శ్రీ శ్రీ లోని భావతైక్ష్ణ్య ఈకవి తనకవితలో ప్రవేశపెట్టగలడు మున్ముందు. వీరకవిత గేయాల్లో ప్రవేశపెట్టి కొంత నూతనత్వాన్ని రచనలలో చూపినా గేయరచనలలోని సాఫీ కనబడనిదే అది అంత ముదావహం కాదు. 'ఆకలిచిచ్చుకన్నీరు' 'క్రొం జెమట నెత్తురుబొట్టు' 'క్రాగినమంట నిట్టూర్పు' 'ముత్తైపుపచ్చిపంట' మొదలైన పదసంఘటనలు ఈతని కవితను రాణింపజేస్తాయి. ఏమయినా యువకవుల శ్రేణిలో మంచి స్థానాన్ని ఆక్రమించడానికి ఒకఅడుగు ముందుకువేసి గేయరచనలో విశిష్టతచూపితేనేగాని కావ్యసమీక్షలో చూపిన ప్రతిభ కావ్యరచనలోకూడా కనపడదు. ఎల్లాగయినా భవిష్యదాశాజనకంగానే ఉంది!

విమర్శకుడు:

'కావ్యవిమర్శ అంటే కత్తికోతా కాదు, గంధానులేపనమూ కాదు; సమీక్షాపూర్వక తత్త్వమీమాంస'
—శబరీ సమాలోకనం.

ఆధునికరీతులని కావ్యసమీక్ష చేసే విమర్శకారుల శ్రేణిని అలంకరించేవారు రామకృష్ణశాస్త్రి, జనార్దనరావు, జొన్నలగడ్డ, హనుమచ్ఛాస్త్రిగార్లే కనపడుతున్నారు. ఈ శ్రేణిలో హనుమచ్ఛాస్త్రికి గల స్థానం నిరూపిస్తాను.

ఇతడి లక్ష్యం 'తత్తద్గ్రంథ సమీక్ష చేసి' 'ప్రల్లదనమున కెడమీయకుండా పిండితాంశమును కచ్చితంగా చెప్పడమే. 'విమర్శనను' 'అభినవమార్గంలో' 'మెలకువమీరి' నడిపించి తెనుగు విమర్శను 'ఒక మెట్టెక్కింపజూశేడు.'

అప్పారాయ కవీంద్రునిఅనుసరించేవారూ, అభినందించేవారూ చాలా మంది ఉన్నా వాఙ్మయంలో ఆయనకుండే స్థానాన్ని అంచనాచేయలేకపోవటం శోచనీయం. ఈలోటు తీర్చిన ఈతడెంతయు ప్రశంసనీయుడు. ముత్యాలసరాల పుట్టుక చాలా హృదయంగమంగా వర్ణింపబడింది. అప్పారాయకవిని ఆదికవి వాల్మీకితో పోల్చే డీ సందర్భంలో. 'అప్పారాయకవి మొరకు మానవులమీద గుడ్లెర్ర చేశాడు. ఆ ఎరుపుమంటలోనుంచే 'కన్యాశుల్కం' ధూమ్మని ప్రేలింది. ఆ 'అగాధ' తో ఆంధ్రదేశం దద్దరిల్లిపోయింది. ఆదెబ్బ దేశానికేకాకుండా ఇనపగొలుసులతో కట్టిన తెలుగు సారస్వతంమీదకూడా పడి లింకులను వదులుచేసింది... ఆతపస్విచేతులలో ముత్యాలసరాలు మిలమిల మెరసినవి. ఇవే నవ్యాంధ్రసారస్వతమునకు తలకట్టులు, విజ్ఞానకోశములు, ఒరవడులు.'

పాత్రౌచిత్యపరిశీలనం 'సీతమ్మశోకం-పాపరాజు' లో కనపడుతుంది. రసానుభూతితో కావ్యాన్ని విమర్శించడం ఇందలి విశిష్టరచన. ఇక 'రెండునక్షత్రాల' వంటి రచన తెనుగుసారస్వతానికి ఎంతవరకు ఉపయోగిస్తుందో చింతనీయం. కొమ్ములుతిరిగిన పండితులు అవగతంచేసుకొని జవాబుచెప్పదగిన విషయం సూక్ష్మంగా గీతలు గీసిచూపి అబోధోపహతం చేశాడీతడు. ఎలాగయినా సమానులైన కాళిదాసు భవభూతులను సంగ్రహంగా చర్చించి అందులో ఒకరికి ఎక్కువ స్థానం ఇవ్వజూడడం సాహసమే.*

'శబరి' ని చాలామంది అభినందించేవారున్నారు. అయినా దానిని గ్రుడ్డిగా భజింపక కావ్యంలోని కానపడే కవిప్రతిభను అభినందిస్తూ కనిపించిన లోపాలని నిర్మొహమాటంగా ఎత్తిచూపినాడీతడు "శబరీ" సమాలోకనంలో.

'వకుళమాలా పరిశీలనం" లో ఉమాకాన్త విద్యాశేఖరునివంటి ఏకేవలపండితుడో విమర్శించినట్టు తానూ కవి ఐ ఉండిన్నీ ముక్కుకు సూటిగా విమర్శించి న్యాయానికి కట్టుబడడం ప్రత్యక్షమవుతుంది. ఇందులోని హేతువాదంచూస్తే మంచి సమీక్షాధోరణి కనిపించినా అక్కడక్కడ అతివాదం కనపడుతుంది. అసలాకావ్యంమీద అంతవిమర్శ అనవసరం. ఏమనగా

---

* 'వ్యాసావళి' ని రివ్యూచేస్తూ 'కృష్ణాపత్రిక' నాయీ అభిప్రాయంతో ఏకీభవించింది--దే. వి. రావు.

కావ్యంగా చెప్పదగినభాగం పుస్తకంలో ఎంతతక్కు-
వయితే అంతవిమర్శ తగ్గివుండాలి. అయితే 'వికృతి
కావ్యమునకు విమర్శకుడు ఉత్తేజితు' డవుతాడని ఇతని
'ప్రరోచన' ఎదురుకొని జవాబు చెప్పినా కాళిదాస
భవభూతుల కావ్యసిద్ధితో పోల్చిచూడడం ఏమయినా
అతివాదమే. ఇంతకూ ఇటువంటి కావ్యాల కిది ఒక
గొడ్డలిపెట్టు. సరియయిన విమర్శనాదృష్టి కిది ప్రథమ
ప్రయత్నం. కాని సమీక్షాపరిణతిని ఇతడు ముద్రకొట్టి
నది మాత్రం "కృత్తివెంటినారి సెలపొడుపు" విమ
ర్శలో (చూ. ప్రబుద్ధాంధ్ర జూన్ ౧౯౩౫). 'సెల
పొడుపు విమర్శ' Rational Criticism నకు మేలు
బంతి...సంగ్రహసమీక్షలలో పేర్కొనదగినవి 'భాగ
వతావతరణము' 'ప్రేమతత్త్వము' విమర్శనలు (ప్రబు
ద్ధాంధ్రలోనివి.) ఇందులోని 'ప్రేమతత్త్వ' గ్రంథ
సమీక్ష శ్రీ పాటిబండ మాధవశర్మగారి 'రసపరి
ష్కార' మను విమర్శనవ్యాసమున కెట్లు దారిదీసినదో
చూసిన నీతని నిశితసమీక్షాకౌశలం ప్రస్ఫుటముకాగలదు.
భారతి అన్నట్టుగా 'విమర్శకు కావలసిన పాండి
త్యమూ, సమీక్షా, సహృదయతా' ఇతడియందు కన
పడుతుంది. అందువలననే నేటి విమర్శకుల్లో ఇతనికి
'మంచి పద్దుపడింది.' దీనిని నిలుపుకోవలసిన బాధ్యతా,
భారమూ ఈ విమర్శకుడిమీదనే ఉంటుంది.

కావ్యవిమర్శ కటువుగా ఉంటే వాఙ్మయాభి
వృద్ధికి దోహదంగా ఉండక రచయితల రచనాపాట
వాన్ని సడలించదా అనే పృచ్ఛ రావచ్చును. హనుమ
చ్ఛాస్త్రివంటి కటువిమర్శకులు కావ్యనిర్మాణమునకు
దోహద మొసంగక సారస్వతపుష్టికి కారణభూతు
లవరేమోఅనుభయముసహజమే. అట్టివారికి D' Alembert వాక్యముల జ్ఞప్తికి తెచ్చెదను:

If criticism is fair, accept it with respect and thanks; if it is fair but unkind accept it with respect without thanks; if it is unfair and unkind, treat it with contempt".

(" Between Ourselves" By Max O' Rell)

కావ్యరచన కళ అనుటచేత కావ్యవిమర్శ కళా
విమర్శవంటిది. కనుక కావ్యవిమర్శ Constructive
గాఉంటేగాని వాఙ్మయాభివృద్ధికి. కావ్య నిర్మాణానికీ
దోహదమీయలేదు. అందువలన హనుమచ్ఛాస్త్రి
జేమ్సుకజిన్సువంటి ఉత్తమకళా విమర్శకులను మేలు
బంతిగనుంచికొని ఇకముందు కావ్యవిమర్శనకి పూను
కోవాలి.

వ్యాసకర్త.

ఇతని వ్యాసరచనాప్రౌఢిమను ద్యోతకం చేసేది
అముద్రితం అయిన 'సాహిత్యగోష్ఠి.'

వ్యాసాల్లో ఇతని ఉభయభాషాపాండిత్యం
వ్యక్తమవుతుంది. "ఆంధ్రులకు సంస్కృతం ఎంతవరకూ
కావాలి?" (జూన్ ౩౪, ప్రబుద్ధాంధ్ర) అనే వ్యాసం
అనాదిగాఉండే సంస్కృత పామరత్వాన్ని కొంత
వరకూ విడగొట్టజూచింది. 'కళా: నీతి' అనేవ్యాసం
(ఉదయిని:మూడోసంచిక) శాస్త్రీయమైన సూక్ష్మవిమ
ర్శలను ప్రస్తరించి చూపింది. వాఙ్మయంలోని వివిధ
ప్రశ్నలకి జవాబిస్తున్న ఈవ్యాసాలు వాఙ్మయాభివృ
ద్ధికి ఎంతయినా దోహదమిస్తాయి. నవీనాంధ్ర సారస్వ
తానికి మెరుగులుపెట్టే వ్యాసాలు చాలతక్కువ శ్రీ
జొన్నలగడ్డ సత్యనారాయణగారిని తప్పిస్తే. సారస్వతా
నికి వన్నెతెచ్చే వ్యాసాలు ఇంకా ఈసారస్వత వర్ధమా
నుని కలంనుంచి ఆంధ్రలోకం ఎదురుచూస్తుంది.

కథానకరచయిత:

కథానకాలగురించి బాగా తెలిసి వ్రాసేవారు
తెనుగునాట చాలా అరుదు. ఈ పక్షమున ఇంగ్లీషు,
బంగాళీ చాలా ముందుకు పోయినవి. ఆ కథలు చదివి
కథానకరచనలోని మెళుకువను, కూర్పుతీర్పును అవగతం
చేసుకుంటే తెలుసువారు సరియయిన కథానకాలని
వ్రాసి మెప్పించగలుగుతారు.

ఇతని కథానకాలు అయిదు మాత్రమే. ఇందులో
కథానకపు లక్షణాలూ, అందం అమరికా ఉండి చదవ
దగ్గవి మూడు: 1 అడవి పువ్వులు, 2 కడుపుమంట,

3 దౌర్జన్యం అనేవి. * వీటిలో మొదటిదానిలో వేద కాలమునాటి యువతీయువకులస్నిగ్ధభావము, స్వేచ్ఛానుభవాలు రమణీయంగా చిత్రింపబడ్డాయి. ఇందులో కథ తక్కువ, శిల్పమెక్కువ. రెండవది సామ్యవాద కథ. చెప్పడం బాగుంది. సమత్వవాదం ప్రబలుతోన్న ఈ రోజుల్లో ఇట్టి విషయాలు కల రచనలు దేశానికీ, భాషకీకూడా ప్రయోజనదాయకంగా ఉంటాయి. మూడు:-ఇది స్త్రీలపట్ల పురుషులు చేసే దౌర్జన్యాల నుద్దేశించి వ్రాసినది. పూర్వాచారపరుల నిర్బంధవృత్తీ-ఆధునికుల స్వేచ్ఛానువృత్తీ ఇందులో చూపి హుషారుగా నడిపించారు.

నాలుగైదుకథలు 'బ్రతుకుచీకటి' ౧ 'కళాభాయి'. ఆ 'బ్రతుకుచీకటి'లో కథకంటె కవిత్వంజాస్తి. కథ ఊరికే సాగిపోతుంది.

'కళాభాయి' లో ఎత్తుకొన్న సమస్యలకు చాలినంత వైశాల్యం లేదు. కాని పెంకితనంగానూ, నవ్యతాలుగానూ ఉంది. కథావిషయం—ఉపాసిస్తున్న కళను దైనిక జీవితంలో ప్రవేశపెట్టువారివలన—భావకవులిట్లుచేయుదురని రచయిత ఊహ—సంఘమున నెట్టికల్లోలములు కలుగనవకాశమున్నదో చూపుట. నిర్వహణమున కొంచెం నేర్పుతక్కువయింది ఇందులో.

నవీనాంధ్రసారస్వతాన్ని కథానకరచన వలనశోభింపజేయాలని పూనుకొన్న యువకులు చాలాఅరుదు. ఉన్న ఆ కొద్దిమందిలోనూ 'హనుమచ్ఛాస్త్రి' ఒకడు. ఇట్టివారు ట్లాగోగుకథానకాలని మేలుబంతులుగ పెట్టుకొని కథానకరచనకి ప్రారంభిస్తే ఎంతైనా సారస్వతానికి మేలుచేసినవా రవుతారు. ఇట్టి ప్రయత్నంలో ఇంతవరకూ కృతార్థులయినది వ్రేలుమీద లెక్కపెట్ట తగినంతమందిమాత్రం ఉన్నారు. మంచి ఆదర్శాలతో సారస్వతసేవకై కథారచనకు పూనుకోడానికి నాయీవాక్యాలు యువకరచయితలను ప్రోత్సహిస్తాయనిఆశిస్తాను. వెలువడబోయే 'కథాశ్రేణి'లో ఈ ఆదర్శాల నందుకొన అర్రులుజాచే ఉత్తమకథానకాలు కనిపిస్తాయా ?

సింహావలోకనం:

అయిదారు సంవత్సరాలలో సారస్వతరంగానికి వచ్చిన వర్ధమానులలో ఇత డొకడు. సంస్కృతాంధ్ర సాహిత్యముల లోతులు తవ్వి రాయి-రత్నం అన్న భేదం లేకుండా జేబులో పోసుకొని రచ్చకెక్కాడు. మొదట మోజుపడి కొత్త అన్నదల్లా నెత్తిపెట్టుకుని ఏ సంస్కర్తలూ ఎక్కని నిచ్చెనలమీద చరచర పాకిపోయి ఒక విశిష్ట ప్రాపాన్ని అందుకొందా మనుకొన్నాడు. కాని రాను రాను 'స్వస్థాన వేషభాషాభిమతుడై' ఇదివరకు తన జాతి అందుకోని ఔన్నత్యంలేదని నిలకడమీద తెలుసుకొని 'కొత్తపాతల మేలికలయిక' కోసం మంచి సాధన చేస్తున్నాడు.

సమీక్ష ఇతని అభిమాన రచన. అయితే సంస్కృత విమర్శనలను లక్ష్యంగా పెట్టుకొని చెప్పేది సబవుగానూ, ఆకర్షణీయంగానూ చెబుతాడు. కాని ఇంగ్లీషు విమర్శలు చదివినట్టు తోచదు. విమర్శకు దొరికించుకున్నాడంటే మరుక్కుమీదగుద్దినట్లేగాని మృదువుకోసం చూడడు. ఇటీవల మృదు సమీక్షకు దిగి చాలా మార్పు తెచ్చుకున్నా నన్నాడు.

ఇతని వచనం మంచిహుందాగా పరువుకున్నట్టు పద్యం పక్వదశకు రాలేదేమో అనుకుంటాను. ఆపద్యాల్లోగూడ ప్రసిద్ధ రచయితల పోకడ — బుద్ధిపడడంవల్ల గడుసువాడు గేయాలు మొదలెట్టాడు. చురుకైన ఊహలూ, అనుభవాలూ ఇతనినిరేపెట్టి ఎంచక్కటిగేయాలు 'తెనుగువీణ' తీగలకు తగిలాయి.

కథల్లో 'ప్రథమపాదే—జంబూద్వీపే' అంటున్నా ఉండుండి కొత్త ఎత్తులు ఎత్తి పోకైన కథకుడూ కూడా అవుతాడేమో అనిపిస్తోంది.

సాహిత్యగోష్ఠిలో కొద్దిరోజుల్లో మంచిసిద్ధికి వచ్చి తెనుగుసారస్వతానికి సారవంతమైన పనిచేసి తీరుతాడు.

సోదరాంధ్రులు ప్రోత్సాహం, ఆలంబనం ఇచ్చిన కొద్దీ గొప్ప సాహిత్యదీపం వెలిగించి కృతార్థుడయ్యే వర్ధమాను డీ ఆంధ్రయువకుడు.

(రచన: నవంబరు ౪, ౧౯౩౫.)

---

* ఈ మూడింటిలోనూ మొదటిది "ఉషస్సు" ప్రథమ సంచికలోనూ, తక్కినవి 'భారతి'లోనూ ప్రకటితములైనవి. దే. వి. రావు

౧, ౨ ఈకథలు ప్రబుద్ధాంధ్రలో ప్రకటితములైనవి.

# తొలకరి

(మల్లవరపు విశ్వేశ్వరరావు)

కఠినమా నీ యెడంద, ఓకన్య !, నేడు
కరగి ఆమని జల్లుగా పరిణమించె !
ఎన్ని నాళ్లాయె నీలేత చిన్ని నవ్వు
చిరుమెరుపుసైగలో చిట్లి చిందులాడి !

నిరతప్రేమాపిపాసువై మరిగిమరిగి,
కనుమొరంగినప్రేయసికై తపించి
నేటి ఆమనిసంజ నీనాటి కేని
తొలకరించిన ప్రియురాలి చెలిమి గంటి !

ఘురఘురనినాదముల నింగి జలదపాళి
రెప్పపాటున చదలెల్ల గప్పివైచె—
పృథివికి తరించు నేదివ్యరథనినదము
నీలగగనాంతరాళాన నిధ్వనించె,

అమరనిత్యవసంతోత్సవముల వీడి
నా చిరంతనప్రేయసి నన్నె కోరి
జలదసోపానపంక్తుల జంచలించి
యవతరించె నీమర్త్యలోకాంచలముల !

చిరవిరహదహ్యమానమై శిథిలమయ్యె
నానిగళబద్ధజీవననౌక నేడు
నీ తొలకరిస్రవంతుల నిల్చి తేలు
నో?, సుఖాతిరేకాన మునుంగునేమొ ?

చిరనిరీక్షానలమ్మున గరగికరగి
నాసుతీక్ష్ణరక్తారుణ నయనయుగము
విద్యుదుజ్జ్వలతావక వీక్షణస్ఫు
లింగముల నైక్యము భజించి లీనమానో?

---

# ప్రాచీనాంధ్రకవులు

నిడుదవోలు వెంకటరావు

[పూర్వసంచికనుండి]

కడచిన భారతియందు పై శీర్షికతోనే వ్రాసిన దాని కుపష్టంభకముగా కొన్ని నూతన విషయముల నిట ముందు తెలిపి, పిదపఁ గ్రొత్త వారిని బేర్కొందును.

౫. భవదూరుఁడు : ఈతని పూర్ణనామము భాస్కరభవదూరమహీపతి యనియు, నీతఁడు విజయనగరము నేలిన మొదటి బుక్కరాయల కుమారుఁ డనియు, తండ్రికాలమున నుదయగిరి మొదలుగా తూర్పునాటిని పాలించె ననియు, పోరుమామిళ్ల తటాకమును నిర్మాణము గావించె ననియుఁ దెలియుచున్నది. పోరుమామిళ్లశాసనమున తటాక నిర్మాణవిధానముఁగూర్చిన శాస్త్రమే కొంత చెప్పఁబడినది. (చూడుఁడు శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారి 'ఆంధ్ర దేశము - తటాకములు.' అనువ్యాసము ఆంధ్రపరిశోధక మహామండలి పంచమవార్షికోత్సవ సంచిక ౧౯-౨౨) ఈభవదూరుఁడే కవిభవదూరుఁ డనునది పరిశీలనార్హమే.

లింగమకుంటతిమ్మన బాలబోధచ్ఛందస్సును వ్రాసినట్లు పాకనాటియందుఁ గల గౌలూరి యాంజనేయకవి తన సుకవికర్ణామృత మను లక్షణగ్రంథమున వ్రాసియున్నాఁడు.

సులక్షణసారముగాక బాలబోధచ్ఛందస్సుగూడ తిమ్మనకవి రచియించి యుండవచ్చును. ఇం దపూర్వగ్రంథములనుండి పద్యము లుద్ధరింపఁబడినవి. సకల నీతి సమ్మత గ్రంథపీఠికయందు శ్రీరామకృష్ణకవిగారు దీనికి బాలబోధ మనియుఁ, గవి సంజీవని యనియు సందిగ్ధనామములు గలవని వ్రాసి యున్నారు. ప్రభాకరశాస్త్రిలవారు క్రీడాభిరామ గ్రంథ పీఠికయం దీఛందస్సుఁ గూర్చి యిట్లు వ్రాసియున్నారు :

"బాలబోధచ్ఛందస్సుకర్తపే రెఱుఁగరాదు. అందు బహుప్రాచీనములైన గ్రంథము లుదాహృతము లయ్యెను. అప్పకవికంటెఁ దత్కర్త ప్రాచీనుఁడు గాఁదగును. అది ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోఁ గొంత గలదు. బ్రహ్మశ్రీ మా. రామకృష్ణకవిగారిదగ్గఱఁ గొంత గలదు. వారు దఱచుగా నక్కడక్కడ నుదాహరించుచు వచ్చిన ప్రాచీనపద్యరత్నములనేకము లందలివి. రత్నఖనియగు నాగ్రంథమునుఁగూర్చి వేఱుగా నొకవ్యాసమును వ్రాయుదును."

పైయుద్ధృతాంశములఁబట్టి ఈఛందస్సు ప్రాశస్త్య మెఱుఁగఁదగును. లింగమగుంట తిమ్మన యప్పకవికిఁ బూర్వుఁ డగుటచేతను, నాంజనేయకవి తిమ్మన దీనిని రచించినట్లు చెప్పియుండుటచేతను తిమ్మనయే యీగ్రంథము రచియించియుండవచ్చును.

* * *

౬. శరభాంకుఁడు

ఎడపాటియెఱ్ఱనకవి తన మల్హణచరిత్ర మున కవిస్తుతిలో శరభాంకుఁడను కవిని బేర్కొనినాఁడు.

"వినుతు లొనర్తు నాంధ్రసుక
విప్రభు నన్నయభట్టుఁ, దిక్కయ
జ్వను, శివదేవు, భాస్కరుని,
జక్కన, నాచనసోము, సర్వదే
వుని, భవదూరు, వేము, నల
పోతనఁ, బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి,
ధూర్జటిఁ గేతన భట్టబాణులన్."

పై పద్యమునుబట్టి శరభాంకుఁడను కవి ప్రాచీనకాలమున నున్నట్లు మనకు తెలియు చున్నది.—ఈతఁడు రచియించిన కృతులు మనకు నెఱుకపడలేదుగాని లింగమకుంట తిమ్మన తన సులక్షణసారమున నతని పద్య మీక్రిందిది యుదాహరించియున్నాఁడు:

"చాపముగా నహార్యమును,
జక్రిని బాణముగాఁగ, నారిగాఁ
బాపదొరం బొనర్చి తల
పం ద్రిపురంబులఁ గాల్పవే మహో
ద్దీపిత తీవ్రకోపమున
దేవతలెల్ల నుతింప నాటివిల్
పాపపుఢిల్లి మీఁదఁ దెగఁ
బాపఁగదే శరభాంకలింగమా!"

పై పద్యమున మొదల చకారమును, నారవచోట హకారమును, పదునొకొండవ చోట కకారము నుంచి ఢిల్లీపట్టణమును తిట్టి నట్లు మనకుఁ దెలియుచున్నది.

ఈతనికాలము నిర్ణయింప నాధారము లేదు. కాని ఎడపాటియెఱ్ఱన యీతని స్తుతిం చుటచే నీతఁడు పదునైదవశతాబ్దికి పూర్వుఁ డైయుండునని యూహింపవచ్చును. మఱియు నీతని తిట్టుపద్యమునుబట్టి చూడ తొలుతమహ మ్మదీయులు ఢిల్లీనుండి దక్షిణహిందూదేశ మునకు దండెత్తివచ్చుటచేతను, కాకతీయ చక్రవర్తియగు రెండవప్రతాపరుద్రుని ఢిల్లీకిఁ బై దీసుకొనిపోవుట సుప్రసిద్ధ చరిత్రాంశమగుట చేతను నీకవి క్రీ. శ. ౧300 సంవత్సరప్రాంత మువాఁడేమోయను సందియము గలుగుచు న్నది. *'తరిదివి ౧ కాడవౌదువు శరభలింగ' అను మకుటముతో కుమారసంభవటీకయం దుదాహరింపఁబడిన పద్యముగూడ యీతఁడు రచియించినది కావచ్చును.

౭. చంద్రమౌళికవి

ఈతఁడు హరిశ్చంద్రకథను పద్య కావ్య ముగరచియించినట్లు ప్రబంధరత్నావళివలనఁ దెలియుచున్నది. ప్రాచీనకవులలో తురగా రామన, అయ్యంకి బాలసరస్వతి యను జంట కవులు తమ నాగరఖండమున కవిస్తుతియం దీతని స్తుతించియున్నారు.

"నన్నపనుఁ దిక్కమఖిఁ బ్రబంధపరమేశు
సాధు నాథర్వణాచార్యుఁ జంద్రమౌళి
భాస్కరు ననంతు శ్రీనాథు, భట్టు భీము
సోము నమరేంద్రుఁ దలఁతు నుత్సుకత నాత్మ."

*కాకతీయ చక్రవర్తులలో కడపటివాఁడగు నీరెండవప్రతాపరుద్రుఁడు క్రీ. శ. 1295-1326 వఱకును పాలనము చేసియున్నాఁడని చరిత్రజ్ఞులు నిర్ణయించిరి.

పై జంటకవులు క్రీ. శ. ౧౫౪౦ సంవత్సర ప్రాంతమువా రగుటచే చంద్రమౌళికవి యంతకుఁబూర్వమువాఁడని మాత్రమే యూహించుట కవకాశము గలుగుచున్నది. ఇందుల కుపబలముగా నొక్క విషయము మాత్ర మిటఁ దెలుపుట యావశ్యకము. శంకర కవిరచిత హరిశ్చంద్రోపాఖ్యానము ముద్రితమై, ప్రసిద్ధమై ప్రచారములోనున్నది. ఇందుపంచమాశ్వాసమున చంద్రమతీవిచార ఘట్టమునఁ గల యీక్రిందిపద్య మంద జెఱం గినదియే.

"అకటా చేరెఁడునేఁకుం డగఁ డెస
ప్తాంభోధివేష్టిభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాం
చత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళనిర్గళత్కిరణకుం
భత్పాదుఁడైనట్టి రా
జకుమారుం డని యేడ్చె కన్నుఁగవ న
శ్రుల్ కాల్వలై పాఱఁగన్."

ఈపద్యము చంద్రమౌళికవి రచియించి నట్లు సుప్రసిద్ధలాక్షణికకవి గణపవరపు వేంకట కవి తన * యాంధ్రకౌముదియం దిట్లు చెప్పి యున్నాఁడు:

సరసపుమాటలఁ జంద్రమౌళికవి ర
చనఘటించిన హరిశ్చంద్రకథను
గోరణిగ "నకటా చేరెఁడు నేలకు"
నసెడి మత్తేభ నాలవపదమున
"రాజకుమారుఁ డు, న్నాజిల్లె జేతన
మనుపదమునకు మహార్థమునను
రహిగ నాదేశంబు రాక యీరీతులఁ
గృతులందుఁ జెల్లు నొక్కెడలఁ గనుక."

శంకరకవికి చంద్రమౌళికవి యని నామాంతర మున్నట్లు తెలియరాలేదు. లాక్షణికులు శంకరకవి గ్రంథము నాతనిపేరితో నుదాహరించిరి. ఒకవేళ పైపద్యము చంద్రమౌళి హరిశ్చంద్రకథనుండి శంకరకవి సంగ్రహించి నాఁడేమో? ప్రస్తుతము ముద్రితమైయున్న శంకరకవికృతహరిశ్చంద్రోపాఖ్యానము సప్రమాణము గాదు. ఇతరకవుల గ్రంథములలోఁ బద్యములు కొన్ని యిందుఁ గలవు. నైఘంటికు లీగ్రంథములోని వని యుదాహరించిన పద్యము లిందుఁ గానరావు. హరిశ్చంద్రోపాఖ్యానము పంచమాశ్వాసమున హరిశ్చంద్రచంద్రమతులు తమ మృతసుతునిం గూర్చి సంభాషించుఘట్టమునఁ గల యీ క్రిందిపద్యము రామరాజభూషణకవికృతహరిశ్చంద్రనళోపాఖ్యానములోఁ బంచమాశ్వాసమున నాసందర్భమున నే గానవచ్చుచున్నది:

"కుదురు మెఱుంగునిబ్బరపు
గుబ్బలపై నయనాంబుపూరముల్
చెదరఁగ నేల యేడ్చెదవు
చెల్వ! దురంతవిషాదవేదనా
విదళితమానసంబునను
వేమఱు, నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే, విధి వి
పాకము దాటఁ దరంబె యేరికిన్"

మఱియు

"ఓరోరి రాచవాఁడా
రారా నావెంటఁ దిరుగురా దాసుఁడవై
బారాది మాడలిచ్చెదఁ
గోరా నీయప్పుఁ దీర్చుకోరా యనుచున్."

---

* ఆంధ్రకౌముది ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితము. (౧౯౩౫)

అను నీపద్యము నీహరిశ్చంద్రోపాఖ్యానము నాలవయాశ్వాసమున నున్నట్లు "బారాది" యనుపదమున కుదాహరణముగ బ్రౌనుదొర వారు తమ నిఘంటువున వ్రాసియున్నారు. (బ్రౌణ్యనిఘంటువు (౧౮౫౨) పుట ౫౭౧ గ్రంథమున నీపద్యసంఖ్య ౨౩౩) శబ్దరత్నాకరమున పైపద్యము కొంచెముమార్పుతో "గోసఁగి" యనుపదమున కుదాహరణముగా నీయఁబడినది. సీతారామాచార్యులవా రీ పద్యములో దాసుఁడనుపదమునకు బదులు "గోసఁగి"యని పద్యము నుదాహరించిరి.

పై పద్యము వ్రాఁతప్రతులయందున్నది గాని ముద్రితప్రతులయం దీక్రిందిపద్య మగుపడుచున్నది:

> "ఓరి యోరంతప్రొద్దు నాయొద్దఁ గదల
> కుండి యుడిగంపుఁ బనులు సేయుచుఁ బ్రియంబు
> చెలఁగ మెలఁగెదవేని యీచిఱుతబాపఁ
> డడిగినంత ధనంబు నేఁ డడయ కిత్తు."

ఈగ్రంథము ముద్రించుటకుఁ బూర్వమే బ్రౌనుదొరవారు నిఘంటువునఁ జేర్చినపద్యము తరువాతివా రేల తీసివైచిరో క్రొత్తపద్య మెట్లు చేర్చిరో తెలియకున్నది.

పైదానిఁబట్టి చంద్రమౌళికవి తొలుత హరిశ్చంద్రచరిత్ర రచియించి యుండవచ్చుననియు, నావెనుక శంకరకవి రచియించి యుండవచ్చుననియు, లేఖకులు నొకగ్రంథములోని పద్యములు మఱియొకగ్రంథములో వ్రాసినా రేమోయనియు సందియము గలుగుచున్నది. చంద్రమౌళి యనుకవి యొకఁడు ప్రాచీనుఁ డున్నట్లు నిశ్చయము.



# సందిగ్ధము

తాడి నాగమ్మ

"Sin Aliuem infandum casum, Fortuna,
minaris; Nunc, o nunc liceat crudelem
abumpere ritam''

## ౧

"కలిమియు లేమియున్ భువిని
కాంతులు చీకటు లెల్లకాలమున్
కలిగెడి ధర్మమాయ కల
కాలమునుండియు కాంచుచుండగా
కలవలె భూమి చక్రమున
కాలము లెన్నో గతించిపోయెడిన్
తలపడి త్రవ్వి చూచినచో
తారసమయ్యెకు నెన్ని వింతలో!!"

కలిమి లేములకు కావడికుండల నెడు ధర్మసూత్రము మానవుల సంసారసాగరములందు మాత్రమేగాక మహాసామ్రాజ్యముల వ్యవహారవిషయములందును సతతము కాన్పించును. పేరుప్రతిష్ఠలు క్షణప్రభలు. కాలగర్భమున నెన్నియోజాతులు, వాని నాగరికతలు పూడిపోయినవి. మానవచారిత్రమునందు వ్రాయబడకయే నశించిపోయిన జాతులెన్నియో గలవు. భూగోళపటములందు గుర్తింపబడకయే ఎన్ని దేశములు సముద్రగర్భమున పూడిపోయినవి? ప్రపంచదృష్టికి రాకయే భూకంపములవలన అదృశ్యమైనదేశము లెన్ని? కాలచక్రములో కలుగువింతలకు అంతులేదు. చీనాదేశము మొదలు ఈజిప్టుదేశమువరకు నున్న నరజాతులను నిరంకుశముగ పాలించిన పారశీకసామ్రాజ్య మిపు డెచ్చటనున్నది? ఆసియాఖండరాజ్యములలో రారాజ్యమై దేదీప్యమానముగ ప్రకాశించిన బాబెలాని సామ్రాజ్య మిపు డేమూల దాగినది? "ప్రపంచమునంతయు జయించితిని జయించుటకు యిక ప్రపంచములు లేవే" యని చింతనొందిన అలెగ్జాండరుయొక్క గ్రీకుమహాసామ్రాజ్య మిపుడేమైపోయినది? యుగయుగములపర్యంతము పృథ్వీజాతులను గడగడలాడించి ప్రపంచజాతులకు నాగరికతయు, పరిపాలనవిధానము నేర్పితిమని గర్వపడిన రోమను మహాసామ్రాజ్యప్రతిభ గతి యేమైనది? సూర్యాస్తమయము గాని గొప్ప మహాసామ్రాజ్యమును స్థాపింపగలిగితిమని గర్వపడు బ్రిటిషువారి సామ్రాజ్యము కాలప్రవాహమునం దెన్ని కడగండ్లపాలగుచున్నదో ఎవ రెరుగరు?

వ్యక్తుల జీవితములందువలెనే జాతుల జీవితములందుకూడ నిమ్నోన్నతములు సహజములు. వ్యక్తులయందువలెనే జాతులయందును ప్రతిభ పరిస్థితులనుబట్టి రాణించుచుండును. మానవు లిట్టి సామాన్యధర్మములను తరచుగ మఱచుచుందురు. తెల్లజాతులు తేజరిల్లుటకును వర్ణజాతులు వంగి తిరుగుటకును (The White are to dominate while the coloured are to subordinate) సృష్టింపబడినవని నమ్మువా రెందరు లేరు? దేశమునుండి వెడలకొట్టబడి నిలువనీడయు, తిన తిండియు, కట్టబట్టయులేక అల్లలాడుచు విదేశములందు తిరిగితిరిగి తుదకు ఇటలీ రాజ్యచక్రమును హస్తగతము చేసికొనిన ముస్సొలోని తన జీవితపదమునందు గల్గిన నిమ్నోన్నతములను విస్మరించి రంగుజాతులను మిషపై అబిసీనియా దేశీయులమీదకు దాడివెడలుట కాలవిపరీతముగదా!! నికృష్టపు పరిస్థితులందు మునిగితేలు చిత్రలేఖనముల మూలమున భుక్తిని సంపాదించుకొనుచు కాలము గడుపుకొనుచుండు తనకు కాలమహిమవలన జర్మనుప్రభుత్వ కళ్లెములు వశముకాగానె హిట్లరు తన జీవిత సంఘట్టనములందు కలిగిన కలిమిలేములను మరచి అనార్యులను మిషపై యూదులను నాశముచేయ యత్నిం

చుట వింతగదా!! బోయరు యుద్ధమునందు పట్టువడి, ఖైదీయై, స్వేచ్ఛను గోల్పోయి దానిని సంపాదించుకొనుటకై బొగ్గుబుట్టలతో నింపబడిన రైలువాగను లందు దొంగతనముగ దాగి బయటపడి ప్రాణములు దక్కించుకొనిన విన్స్టనుచర్చిల్ తన వెనుకటి జీవిత విషమపరిస్థితులను కప్పిపుచ్చి ఇండియాబిల్లునం దేమాత్రము స్వేచ్ఛలేకుండునట్లు మంత్రులపై దాడిసలిపి దానిని మరింత సంకుచితముచేయ యత్నించుట ఆశ్చర్యము గదా!! అసలు తెల్లజాతిని రంగుజాతి జయించగలదా అనునది ఒక గొప్ప సందిగ్ధము.

## ౨

టోకియోనగరము జపానుదేశమునకు ముఖ్యపట్టణము. న్యూయార్కు, లండను పట్టణములందువలె నక్షత్రములనంటు సౌధరాజములు లేకున్నను భవననిర్మాణ కళాకౌశల్యమునం దాపట్టణరాజముల కేమాత్రమును తీసిపోదు. చిత్రాతిచిత్రమైన రంగురంగుల పుష్పవనములతో యలరారుచుండును. అందు ఓరియంటల్ హోటేలు (Oriental Hotel) చూడతగినభవనము. టోకియోనగరముచూడవచ్చిన దేశీయులేమి, విదేశీయులేమి దానిని చూడకుండగపోవుట యరుదు. అక్కడకు వచ్చిపోవు ప్రజాసమూహములను కాంచిన క్రొత్తవ్యక్తి కదియొక యాత్రాస్థానమేమోయని భ్రమించుటకూడ కలుగును.

ఒకదినమున కెయిన్‌లాంగ్ ఓరియంటల్ హోటేలునందు ఫలహారము చేయుచుండెను. అతడు యువకుడు, సుందరుడు. పాశ్చాత్యదేశముల కరిగి సైనిక విద్యల నభ్యసించిన వీరుడు. జపానుసైనికాధికారులలో నొకడు. జపానుజాతియొక్క ఆయువుపట్టని చెప్పతగిన బ్లేక్‌డ్రాగూన్సు (Black Dragoons) సంఘమున కుపాధ్యక్షుడు.

అత డట్లు ఫలహారము చేయుచుండగనే అతని కిసుమంత దూరముననున్న మరియొకబల్లప్రక్క నుండెడు కుర్చీపై సర్వాంగసుందరియైన యొక రమ్యాను యువతి వచ్చికూర్చుండెను. ఆమెయు ఫలహారము చేయుటకే వచ్చినది. అతనిదృష్టి ఆమెపై బడినది. వెంటనే అత డానందపరవశు డాయెను. ఆమె సాధారణ యువతి కాదు. తాను రోముపట్టణపు మ్యూజియము నందు జూచిన క్లియోపత్రాబొమ్మ ఆయువతిముందు దిగదుడుపునకైనా పనికిరాదని యతనికితట్టినది. ఏథెన్సు నగరమునందు తన కత్యంతామోదముగూర్చిన సర్వాంగ సుందరమైన డయానా ప్రతిమ యాకన్యతో పోల్చుటకైనను తగదు. ఆమెతో నొకసారి మాట్లాడినయెడల తనజన్మ తరించునని యాతడు భ్రమపడెను. కాని ఎట్లు మొదలుపెట్టి ప్రసంగములోని కామెను దింపవలెనో యాతనికి తట్టలేదు. ఆమెను పలుకరించుటకై రెండు మూడుసార్లు యత్నించ బోయి విరమించెను. ఆమె ఏమనుకొనునోయని యాతని భయము. ఐనను ఊరకుండుటకు మనసొప్పుట లేదు. పలుకరించుటకు ధైర్యము చాలుటలేదు. అత డట్లు తబ్బిబ్బుపడునంతలో యామె ఫలహారముముగించి పైకముచెల్లించి పోవుట కుద్యమించుచుండెను. వెంటనే "తమ చేతియందున్న పత్రిక యేమిటో దయతో సెలవిచ్చెదరా" అనెడు మాట అప్రయత్నముగ అతనినోటినుండి వెలువడెను. ఆమె చిరునవ్వుతో "క్రొత్తవారికి సులభముగ తెలియ రానిది" అని జవాబిచ్చెను.

అతడు—శ్రమయని మీరెంచకపోయినచో కష్టమైనను మీరు దానిని నాకు వివరించెదరా?

ఆమె— మీకంత శ్రద్ధయున్నచో అట్లే చెప్పగలను కాని కొంత వ్యవధి కావలెను.

అతడు—మరల మీరు ఇక్కడి కెపుడు వచ్చెదరు?

ఆమె—ప్రతిసాయంత్రమును వచ్చుచుందును.

అతడు— విదేశీయులగు మిమ్ముల నిట్లు పరిచయముగలవానివలె ప్రశ్నించినందుకు వేరుగ తలపకుందురుగాక!

ఆమె— వేరుగా తలచవలసినంత విషయ మిందేమున్నది?

అతడు— అట్లయిన సెలవు

ఆమె— సె...ల...వు

ఇట్లిద్దరును విడిపోయిరి. ప్రతిదినమును ఆ ఓరియంటల్ హూటేలునందు కలిసికొనుట వాడుకయై పోయినది వారికి.

ఎట్లయినను దినమునకొక సారిఆమెముఖబింబమును చూచుటయే అతని ముఖ్యాశయముగాని ఆపుస్తకమునందేమియున్నను అతనికి చింతలేదు. కాని కేవలము ఆమెను చూచుటకే వెళ్లినట్లుగ కాన్పించుట మంచిదికాదు. అందుచే నాతడు ప్రతిసాయంత్రము ఆపుస్తకముగురించి ప్రశ్నించుచుండును. ఆమె ఏదో మిషపై "రేపు" అని వాయిదావేయుచుండును. అట్టులా విషయమును వెలిబుచ్చక యామె వాయిదాలు వేయుటకు కారణమేమిటాయని పలుమారు తనలోతాను తర్కించుకొనును. ఆమెను ప్రతిదినమును చూచుటకు తన కెంతయభిలాష గలదో తనను చూచుటకు ఆమెకుకూడ అంతేకుతూహలముండియుండవలయును. లేనియెడల ఒకనాటితో విదల్చుకొనతగిన విషయమును "రేపు" అని యేల వాయిదా వేయుచుండవలెను? కనుక తన్నామె తప్పక ప్రేమించియుండునని యతడు సంతృప్తిపడుచుండును. ఐనను ఆమెమాటలయందుగాని, చర్యలయందుగాని ప్రణయమును వెలిబుచ్చుసూచన లేమాత్రమును కాన్పించనపుడు తానట్లుతలచుట పొరబాటేమోనని మొదటికి వచ్చుచుండును. స్త్రీలహృదయములు పసిఫిక్ మహాసముద్రాంతరంగములకంటె గంభీరమైనవిగదా ఎవ్వరెరుంగుదురని సంశయపడుచుండును. ఒకయువకుడు కేవలమేదో పత్రికలోని విషయములు తెలిసికొనుట కొకయువతి దగ్గరకు ఆమెమీద ప్రేమలేనిదే నిత్యము పోవుచుండునా? ఆవిషయము నామె అంతవరకు గ్రహించకుండునా యనెడి ఆశాకిరణము లాతని హృదయమునందు లేచుచుండును. తనప్రేమను శోధించుటకై తన్నట్లు ప్రతిదినము త్రిప్పుచున్నదని మరల భావించుచుండును. ఏదియెట్లున్నను తన్నామె ప్రేమించుచున్నదియు లేనిదియు ఆదినమున తప్పక తెలిసికొనవలెనని నిశ్చయించుకొని ఓరియంటల్ హూటేలునకు బయలుదేరినాడు కెయిన్‌లాంగ్. అలవాటుచొప్పున సిసీలియకూడ సకాలమునకే నిర్ణీతస్థలమునకు చేరినది. కెయిన్‌లాంగ్ సిసీలియ లిద్దరు ఎన్నియోవిషయములనుగురించిమాట్లాడుకొన్నారు. తుదకు

కెయిన్‌లాంగ్— సిసీలియా! ఈవేళ తప్పక ఆపుస్తకమునందున్న విషయమేమో నాకుచెప్పవలెను.

సిసీలియ—ఎందుచేత అంత పట్టుదల?

కెయిన్‌లాంగ్—ఆవిషయమును తెలిసికొనుటకే ఈదినమున నేను వచ్చితిని.

సిసీలియ—లేనియెడల......

కెయిన్‌లాంగ్—నేనురాను......

వాడిబాణము హృదయమునందు గ్రుచ్చుకొనినట్టులామె యామాటలు వినగానే చలించినదాయెను. అది కనిపెట్టిన కెయిన్‌లాంగ్ తనపై యామెకు ప్రేమ లేకున్నయెడల యేల యట్లదరిపడవలెను తాను రానన్నంతమాత్రముచేత అని తలపోయుచుండెను. ఇంతలో

సిసీలియ—అందున్న విషయములన్నియు నేను చెప్పెదను గాని మీరు వానిని నాయాజ్ఞలేనిదే పరుల కెవ్వరకు చెప్పకూడదు. అట్లు ప్రమాణముచేసినయెడల చెప్పుట కేయభ్యంతరమును లేదు.

అట్లేనని కెయిన్‌లాంగ్ తన జాతిమతధర్మముల ననుసరించి ప్రమాణములుచేసెను. అపుడు

సిసీలియ ఇట్లుచెప్పెను: "ఈపుస్తకము కార్ల్ మార్క్సుగారి శిష్యశ్రేష్ఠుడైన నికొలాయ్ లెనిన్‌గారిచే స్థాపింపబడిన రష్యన్ రహస్య విప్లవసంఘమువారిచే ప్రకటింపబడినది. ఇందు కార్ల్‌మార్క్సుగారి సిద్ధాంతములును, వాని నాచరణమునకుదెచ్చు విధానములును గలవు. నిరంతరము నిరంకుశత్వమునకు నిలయమైన జారుప్రభుత్వమును లయమొనరించి పరిపాలన పాటకజనముల హస్తగతముచేయుటయే మా యీ విప్లవసంఘముయొక్క ముఖ్యోద్దేశము. టోకియోనగరమునందున్న రష్యన్ ప్రభుత్వ రాయబారికుమార్తెనై యుండియు ఇట్టి విప్లవ సంఘమునందు చేరినందుకు మీరు ఆశ్చర్యపడనవసరము లేదు. మాపట్టణరాజములైన సెంట్ పీటర్సుబర్గు, మాస్కో మొదలగు నగరములందున్న రష్యన్ సైనికాధి

కార్మికులయొక్కయు, ఉన్నతోద్యోగుల యొక్కయు కుమారులు, కుమార్తెలు ఎందరో యీవిప్లవసంఘసభ్యులుగాచేరి దివారాత్రములు కృషిచేయుచున్నారు. కొరియాదేశమునందున్న రష్యావిప్లవసంఘశాఖకు నేనధ్యక్షురాలను.............

కెయిన్‌లాంగ్—కార్ల్‌మార్క్సు అనగా ఎవరు? అతని సిద్ధాంతములేమి?

సిసీలియా—కార్ల్‌మార్క్సు కార్మికుల పాలిటి కల్పతరువు. పెట్టుబడిదారులకు పెనుభూతము. కాలు సేతులు వంచి కలకాలము కార్మికుడు కష్టపడుచు తన రక్తమును స్వేదరూపమున కార్చుచుండగ పనిపాటలు చేయకుండగనే పెట్టుబడిదారుడు ఫలముల నపహరించుచున్నాడు. ఇట్లు అన్నిజాతులయందు కష్టపడు కార్మికుల నుద్ధరించుటకై కార్లుమార్క్సు 1864 సం. నందు అంతర్జాతీయ కార్మికసంస్థ నొకదానిని స్థాపించినాడు. దానినె యూరపుఖండమునందు "First Internationale"అందురు. అది చక్కగ పనిచేయుచుండు నంతలో Paris Commune పడిపోవుట తటస్థించెను. అందుచేత 1876 సం. నందు పూర్తిగ తుడిచిపెట్టబడినది. కాని 1889 సం. నందు పేరిసనగరములో Second Internationale స్థాపింపబడినది. 1900 సం నందు పేరిస్ నగరమునందు సమావేశమైన కాంగ్రెసువారు ప్రపంచమునంతట నీ సువార్త వ్యాపింపజేయుటకు సమకట్టిరి. తత్ఫలితముగ మాయీసంఘము లన్నియు యేర్పరుపబడినవి. మాఆశయములు నెరవేర్చుకొనుటకు మాకు పరదేశీయుల సహాయముకూడ కావలసియున్నది. మీసహాయమును కోరియే నే నిట్టి రహస్యమును వెలిబుచ్చితిని

కెయిన్‌లాంగ్—ఇందు నేను చేయగల దేమున్నది?

సిసీలియా—మీరు జపాను సైనికాధికారులలో నొకరని నే నెరుగుదును.

కెయిన్‌లాంగ్—ఆలోచించుటకు వ్యవధి కావలెను.

సిసీలియా కెయిన్‌లాంగ్‌ను ప్రేమించినదా? అంతయూ సందిగ్ధము.

## 3

ప్రణయముపై సిసీలియా దీర్ఘోపన్యాసము కావించునని ఆతురతతో వేచియున్న కెయిన్‌లాంగ్ ఆమెయొక్క విప్లవకరమైన మాటలు వినుటతోడనే హతాశుడైనాడు. ఐనను ఆమె తనను ప్రేమించినది లేనిది తెలిసికొనకుండగనే ఇంటికి తిరిగివచ్చినందుకు తనకు తానే నిందించుకున్నాడు. ఆమె తన సహాయము నర్థించినపుడు ప్రతిఫలముగ ఆమెప్రేమ నేల కోరకపోతినా యని పరితపించినాడు. చేజిక్కిన యట్టి చక్కని సమయమును జారవిడిచిన తనతెలివితేటలను దూషించినాడు. ఇంతకు తాను జపానుదేశీయుడు. ఆమె రష్యన్ స్త్రీ. తాను రాజరికము (Imperialism) ను పెంపొందచేయుటకై స్థాపింపబడిన బ్లేక్ డ్రాగూన్సు (Black Dragoons) సంఘమున కుపాధ్యక్షుడు. ఆమె ఇంపీరియలిజమును నాశనము చేసి కమ్యూనిజము (Communism) ను వ్యాపింపచేయ సమకట్టిన రహస్యవిప్లవసంఘముయొక్క కొరియాదేశపు శాఖకు అధ్యక్షురాలు. ఇట్లిద్దరిమధ్య ఎంతయో వ్యత్యాసము గలదు. అట్టివారికి స్నేహము కుదురుట కష్టతరము; అసమంజసముకూడాను. ఇట్టి కలత యాలోచనలతో కెయిన్‌లాంగ్ మరుసటి దినమున మామూలువేళకు నిర్ణీతస్థలమునకు చేరుకొన్నాడు. తనపై ఆమెకు ప్రేమయున్నది లేనిది ఆదినమున తప్పక తెలిసికొనవలెనని తీర్మానించుకున్నాడు. సకాలమునకు చిరునవ్వుతో సిసీలియకూడ చేరినది తల తోక లేని ప్రసంగములు వారిమధ్య యెన్నియో దొర్లిపోవుచున్నవి. కాని యేమిషపై ఆమెకు తనపైగల ప్రేమనుగురించి తెలిసికొనవలెనా యని కెయిన్‌లాంగ్ ఆలోచించుచునే యున్నాడు. అత డంతకుముం దాలోచించుకొని వచ్చిన పద్ధతులన్నియు నామెను చూచుటతోనే ఎగిరిపోయినవి. అతని కేమియు తట్టలేదు. ప్రేమనుగురించి యేమిమాట్లాడవలెను ? ఎట్లు మొదలు పెట్టవలెను ? అంతయు అగోచరము. తాను సైనికుడుగాన సైనికునివలె ముఖామోటములేకుండగ ప్రప్రథమములోనే ప్రేమనుగురించియెత్తుట మంచిదేమోనని తలచినాడు. యుద్ధపరీక్ష

ములు, వానిఉపయోగములు ప్రణయమునందుపనికిరావు గదాయని సిగ్గుపడినాడు. తనను పెండ్లిచేసికొమ్మని మొదటనే యడుగుట చేతగానిపని యనుకొన్నాడు. ఆదిలోనే బ్రతిమాలుట బుద్ధితక్కువ యనుకొన్నాడు. కాని అప్రయత్నముగా కెయిన్‌లాంగ్—"సిసీలియా! నన్ను ప్రేమించుచుంటివా?"

సిసీలియ—మానవజీవులందరిని ప్రేమించు విప్లవసంఘ సభ్యురాలు నిన్ను విడిచిపెట్టునా?

కెయిన్‌లాంగ్—అందరిని ప్రేమించుచున్నట్లుగనే నన్నును ప్రేమించుచుంటి వన్నమాట.

సిసీలియ—లేదు. వారందరికంటె నిన్ను ఎక్కువగనే ప్రేమించుచుంటిని.

కెయిన్‌లాంగ్—ఎందుచేత నన్నెక్కువగ ప్రేమించుచుంటివి?

సిసీ—నాయొక్క ఆశయము నెరవేరుటకు

కెయిన్—నీ ఆశయ మేమి?

సిసి—రష్యన్ విప్లవము.

సింహపురంకె వినిన లేడివలె అదరిపడినాడు కెయిన్‌లాంగ్. ఆమెమన సాతని కేమియు అర్థముగాలేదు. ప్రేమ, ప్రణయము, విరహము మొదలగు మోహపుమాటల వర్షము కురియునని ఆశపడిన కెయిన్‌లాంగ్ నిర్విణ్ణుడైనాడు. విప్లవమును సాధించుటకై విదేశీయుని ప్రేమించుటయా! అది నెరవేరునా? అంతయు సందిగ్ధము

౪

మానవాశయము లెప్పుడు ఒకేతీరున నుండవు. కాలమానపరిస్థితులనుబట్టి మానవుని దృక్పథము మారుచుండును. బాల్యమునందుండు భావములు యౌవనమునం దుండవు. యౌవనమునందుండు ఆవేశములు కౌమారమునం దుండవు. కౌమారమునందుండు సహనము వృద్ధాప్యమునం దుండదు. కనుకనే మానవులు చీటికి మాటికి ఒకపార్టీనుండి మరియొక పార్టీలోనికి పల్లిటీలు కొట్టుటయు, ఒకమతములోనుండి మరియొకమతములోనికి మారుటయు గల్గుచున్నది. రాంసే మాక్డొనాల్డుగారి జీవితమును తిలకింపుడు. యుద్ధమునకు తాను కేవలము విముఖుడనని ప్రగల్భములు కొట్టి యూరప్ మహాసంగ్రామకాలమున సత్యాగ్రహియై ఖైదుకేగినాడు. ప్రధానమంత్రికాగానే భారతదేశమునందున్న సత్యాగ్రహులను చావగొట్టించి ఖైదులందు బెట్టించినాడు. లేబరైటులను రక్షించుమహాదాతనని చెప్పి లేబరుపార్టీని హస్తగత మొనరించుకొని తుదకు స్వస్థానమును రక్షించుకొనుటకై స్వపక్షమును నీటగలిపి సనాతనులైన కన్సర్వేటివులచేతిలో కీలుబొమ్మయైనాడు. వ్యక్తుల జీవితములవలెనే జాతులయొక్క ఆశయములుకూడ మారుచుండును.

చట్టబద్ధుడైన రాజు (Constitutional King) కావలెనను ఆందోళనతో బయలుదేరిన ఫ్రెంచివిప్లవకారులు రాజును, రాణిని వధచేయుదురని ఎవరైనను మొదట నమ్మిరా? అట్లు రాజును, రాణిని, వారియనుచరవర్గములైన ప్రభువులను చిత్రవధచేసి వారి కవోష్ణరక్తప్రవంతులతో మానవ సంఘమునందు విప్లవ పునాదులను స్థాపించిన యాఫ్రాన్సు దేశీయులు తుదకు నెపోలియనును తమ చక్రవర్తిగ నంగీకరింతురని ఒకరైనను యూహించిరా? ఇట్లు కాసటబీసట ఒడిదుడుకుల తబ్బిబ్బులతో పల్లిటీలపై పల్లిటీలు కొట్టుచు తుదకు మూడవ ప్రజాప్రభుత్వమును ఫ్రాన్సు స్థాపింపగలుగునని ఎవరైనను తలంచిరా?

భారతజాతీయ సంస్థ నించుక తిలకింపుడు. హ్యూమ్‌గారిచే స్థాపింపబడి నౌరోజీగారిచే పెంచబడునంతకాలము గవర్నమెంటుతో సహాయపద్ధతి నవలంబించినది. తిలకుగారిచే నాటబడిన సహాయనిరాకరణవిత్తనము గాంధీగారి కాలమున తేజరిల్లి ప్రపంచవిఖ్యాతిని బడసినం. విదేశవస్తువులతోపాటు స్వదేశమందున్న గవర్నమెంటు సంస్థలను బహిష్కరించినవారె ఆసనములందు నీతిమంతులుగ నెంచబడిరి కాని కాలక్రమమున బహిష్కరింపబడిన కౌన్సిల్లు ఆలింగనమునకు తగినవైనవి. ఇట్టి పరిణామము నెవరు ముందు గ్రహించిరి?

ఓరియంటల్ హోటేలునందు ఆదినమున నా రీతిగ తటస్థపడిన కెయిన్‌లాంగ్ సిసీలియాల మధ్య కాలప్రవాహమునం దెన్నిమార్పులు రానున్నవో ఎవరి కెఱుక? అనుదినము వారట్లు కలిసికొని సరససల్లాపము లాడుట యలవాటైనది. దినములు గతించుకొలది వారి యనురాగము ప్రవర్ధమానము కాసాగెను. పరిచయ మెక్కువగుకొలది ప్రేమవృద్ధియగుట సుగుణులయొక్క లక్షణము. కెయిన్‌లాంగ్ సిసీలియాలమధ్య ప్రేమ పెంపొందసాగెను. ప్రేమ శ్రుతిమించి రాగమున బడినపుడు మోహమని పిలువబడును. యువతీయువకుల మధ్య మోహము ఘనీభవించుకొలది ఆశయములు ఆవిరియై పోవుచుండును. విప్లవమును సాధించుటకై విదేశయువకుని చేరదీసిన సిసీలియ యాతని ప్రేమలో నోలలాడుచుండెను. ఇంపీరియలిజమును వ్యాపింపజేయ సమకట్టిన సంఘోపాధ్యక్షుడు విప్లవకన్యచేతిలో కీలుబొమ్మయై మరియుస్థితికి రాదొడగెను. విప్లవసంఘ సభ్యత్వమునకు రాజీనామానిచ్చి కెయిన్‌లాంగ్‌ను పెండ్లాడి సిసీలియా సుఖింపదలపెట్టునా? బ్లేక్ డ్రాగూన్సు సంఘమునకు నీళ్లువదలి, సైనికోద్యోగమున కుద్వాసముచెప్పి సిసీలియాను పెండ్లాడి సుఖపడ కెయిన్‌లాంగ్ తలచునా? అంతయు సందిగ్ధము.

౫

తెల్లజాతులు తెల్లచెదపురుగులవలె వెళ్లినచో తెల్ల నాశనముచేయుట సహజము. తెల్లచెదపురుగులు తమకు కాన్పించిన పుస్తకములు, బట్టలు, పెట్టెలు మొదలగు వస్తువుల నన్నిటిని నాశనము చేయును. తెల్లజాతులు తమకు కాన్పించిన ఖండములను, దేశములను, దీవులను మొదలగుస్థలము లన్నిటిని ఆక్రమించి యచటిమనుష్యులను జీవులను, నాశముచేసిరి, చేయుచున్నారు. ఇట్లు ఆస్ట్రేలియాయందలి ఆదిమనివాసులు నాశము చేయబడిరి. అమెరికా ఖండములోని రెడ్ ఇండియనులు రూపుమాపబడిరి. పసిఫిక్ మహాసముద్రద్వీపములందుండు నరజాతు లెన్నియో హత మొనర్పబడినవి. ఇట్టి ఘన కార్యములు చేసిన తెల్లజాతులన్నియు చీనారాజ్యమునందు చీడపురుగులవలె చేరినవి. వారందరికి జపాను యొక్క సత్వరాభివృద్ధి కంటకమువలె కాన్పించుట వింతగాదు.

1894 సం. లో చీనా జపానుదేశముల మధ్య గొప్పయుద్ధము జరిగినది. అందు చీనా ఓడిపోవుటయే గాక సంధి షరతుల చొప్పున కొరియాదేశముపై అధిక పెత్తనము, ఆర్థరు రేవుపట్టణముపై సైనికపెత్తనము జపాను కొప్పగించినది. వెంటనే తెల్లజాతు లన్నియు నొక్కుమ్మడిని దలపడి జపానును నిర్బంధించి తిరిగి వానిని చీనాకు ముట్టచెప్పినవి. జపాను దానిని మఱువలేదు. సమయమునకై వేచియున్నది. క్రమముగ రష్యనులు కుయుక్తులతో ఆర్థరు రేవుపట్టణముపై పెత్తనము సంపాదించి దానిని రష్యన్ సైన్యములతో నింపజొచ్చినవి. పగదీర్చుకొనుటకై బుసలుకొట్టుచు వేచియున్న జపాను అట్టిపని వలదని వారించినది. సంప్రదింపులపై సంప్రదింపులెన్నియో జరిగినవి. తుదకు లాభము లేక పోయినది. పరిస్థితులు విషమింప జొచ్చినవి. సంప్రదింపులు సన్నగిల్లుకొలది సైన్యముల సంఖ్య వృద్ధి కాదొడగినది. కడకు ౧౯౦౪ సం. ఫిబ్రవరి ౫ వ తారీఖున రష్యా జపాన్ రణదుందుభులు మ్రోగినవి.

ఒక ఉద్యానవనమునందు సిసీలియ కెయిన్‌లాంగులు రష్యా జపానులమధ్య కలిగిన విషమపరిస్థితులను గుఱించి ముచ్చటించుకొనుచుండిరి. సిసీలియ కెయిన్‌లాంగ్ కౌగిలిలోనున్నది. కెయిన్‌లాంగ్ జీవితమునం దెన్నికష్టములు కలిగినను తనను విడువనని శపథముచేయ వలసినదని సిసీలియ అతనిని కోరినది అత డామెచేయి పట్టుకొని "సిసీలియా! నాకంఠమునందు ప్రాణము లుండునంతవరకు నేను నిన్ను...వి...డు...వ..." అనునంతలో ఒక సైనికుడు రోజుచు పరుగెత్తుకొనివచ్చి ఒక ఉత్తర మాతనిచేతిలో బెట్టెను. అం దిట్లున్నది:

" కెయిన్‌లాంగ్ !

రష్యాజపాను సంధిసంప్రదింపులు విఫలమైనవి. మూడుదినములలో రష్యన్లకును మనకును ఆర్థరు రేవు పట్టణమునందు యుద్ధముజరుగనున్నది. కనుక నీవు వెం

టనే నీసైన్యమును తీసికొని అడ్మిరల్ టోగోగారి నాయకత్వముక్రింద బయలుదేరి పోవలెను. తప్పదు. వెంటనే.

ఇట్లు

.....................

ప్రధానసేనాని."

చదువుట ముగించినవెంటనే కెయిన్‌లాంగ్ పెద్ద నిట్టూర్పు విడిచినాడు; వెలవెలబోయినాడు. అంతయు కనిపెట్టుచున్న సిసీలియ ఉత్తరమునందున్న విషయమును గురించి ప్రశ్నించినది. గద్గదకంఠముతో ఆతడు చెప్పటకు మొదలుపెట్టుసరికి రష్యన్‌భటు డొకడు శరవేగమున వచ్చి లేఖ నొకదానిని సిసీలియ కందిచ్చెను. అందిట్లున్నది:

"ప్రియపుత్రికకు!

రష్యాజపానులమధ్య సంధిసంప్రదింపులు విఫలమైనవి. రష్యాజపానుయుద్ధము జరుగనుండుటచే నన్ను సకుటుంబముగ జపానుదేశమునువిడిచి ౪౮ గంటలలోగా పోవలెనని జపానుప్రభుత్వమువారి ఆజ్ఞయైనది. అటుపైని మనప్రాణమానధనములకు వారు బాధ్యులుగారు. ఆర్థరురేవుపట్టణమునకు పోవు స్టీమరు సిద్ధముగానున్నది. కావున నీవు వెంటనే రావలెను.

ఇట్లు, తండ్రి

....................."

లేఖచదువుట ముగిసినది. సిసీలియ ప్రతిమవలె స్తంభించిపోయినది. కెయిన్ స్థితియు నట్లేయున్నది. ఓరియంటల్ హోటేలునందు నాడు తాను కలిసికొనిన విచిత్రసంఘట్టనము మొదలు అప్పటివరకు వారికి గలిగిన జీవితానుభవములను జ్ఞప్తికి దెచ్చుకొనుచుండిరి. ఒకప్పుడు విప్లవవిషజ్వాలల కాటపట్టయిన సిసీలియ హృదయము క్రమముగ విచిత్రప్రేమ కాలయమైనది. పూర్వము ఇంపీరియలిజమును వ్యాప్తముచేయ సమకట్టిన బ్లేక్ డ్రాగూన్సు (Black Dragoons) సంఘమునకు నునైన ప్రదేశముగనున్న కెయిన్‌లాంగ్ హృదయము రానురాను విప్లవకన్య కనువగు స్థలముగా మారినది. కాని కాలమునం దెన్నియో చిత్రవిచిత్రములైనమార్పులు జరుగుచుండును. మానవుడు సంకల్పించును; భగవంతుడు వికల్పించును. మానవజీవితమున కిట్టివి క్రొత్తకాదు. ఐనను అట్టివానివలన నాత డలజడి చెందుచుండును. కంగారుపడుటవలన గలుగు ఫలితము కష్టములు వృద్ధియగుటయె. కెయిన్‌లాంగ్, సిసీలియా లిపు డేమిచేయుదురు? కేవల మొకస్త్రీప్రేమకొరకై తనదేశమును, చక్రవర్తిని, బ్లేక్ డ్రాగూన్సు సంఘమును ధిక్కరించి తనపదవికి రాజీనామానిచ్చి కెయిన్‌లాంగ్ ఆమెతో బోవునా? పరదేశీయుని ప్రేమకై తనదేశీయులను రక్షింప సమకట్టిన విప్లవసంఘమును, తండ్రిని ధిక్కరించి సిసీలియ అతనితో జపానునందే యుండునా? అంతయు సందిగ్ధము.

## ౬

రష్యా జపాను యుద్ధము ప్రారంభమైనది. రష్యాను యుద్ధములో గెలుచుట మహాకష్టతరమైన పని. ప్రపంచజాతులలో రష్యా ఒకవింతస్థానము నాక్రమించి యున్నది. అది కేవలముయూరపుజాతికాదు. పూర్తిగఆసియాజాతియు గాదు. కనుకనే యూరేషియనుజాతియని పిలుచుట సాధారణమైనది. రష్యన్‌జాతియొక్క బలము అది ఆక్రమించియుండిన స్థానముపై నున్నది. మానవజాతులన్నియు నొకానొకప్పుడు మరియొకజాతికి దాసానుదాసులై యూడిగము చేసినవి. భారతజాతి యుగయుగములనుండియు దాస్యము ననుభవించుట జగద్విదితము. పర్షియన్, బాబెలూనియ, అస్సీరియ మొదలగు రాజ్యములన్నియు నొకప్పుడు గ్రీసు సామ్రాజ్యమునకు దాసులైయున్నవి. గ్రీసు, ఈజిప్టు రాజ్యములేగాక యూరపునందుండు దేశము లన్నియు పూర్వము రోమను మహాసామ్రాజ్యమునకు కప్పములు చెల్లించినవి. రోము, ఆస్ట్రియా మొదలగు యూరపుజాతు లన్నియు నెపోలియన్ మహాచక్రవర్తికి దాసోహమని కేలుమోడ్చినవి. పృథ్వీరంగముపై నుండు పెద్దజాతులలో ఒక్క రష్యామాత్ర మెవరికిని ఎప్పుడును దాసోహమని యూడిగము చేయలేదు. దానిని దండింప సమకట్టిన యోధానుయోధు లందరు పతనమైరి. పదునెనిమిదవ

శతాబ్ద ప్రారంభమున యూరపు రాజకీయ తుపానుల యందు పిడుగువలె తళతళలాడిన స్వీడనుదేశపు రాజైన పండ్రెండవ చార్లెస్ రష్యాపై దండెత్తుటతోనే తన నాశనమును కొనితెచ్చికొనినాడు. యూరపు ఖండము నంతను రాజకీయభూకంపములతో యల్లోలకల్లోలమొనర్చి నరజాతులను చిందరవందర చేసినైచి గడగడ లాడించిన నెపోలియనుమహాచక్రవర్తి రష్యాపై దండెత్తుటతోనే పతితుడైనాడు. ఇట్లు మహాయుద్ధనిపుణులైన తెల్లజాతులనే గర్వభంగ మొనరించిన తెల్లజాతియగు రష్యా యెక్కడ ! మొన్ననే కండ్లుతెరచిన రంగుజాతియగు జపానుయెక్కడ! జపాను గెలువగలదా? ఎక్కడిమాట! ఇది అందరకుండు సందిగ్ధము.

జపాను సేనలు ఆర్థరు రేవుపట్టణమును ముట్టడించినవి. జపాను విఖ్యాతనావికుడగు టోగో ఆర్థరుపట్టణ నౌకాశ్రయమును స్వాధీనముచేసికొన తీవ్రయత్నములు సలిపెను. ఎన్నియో రష్యన్ జపాను సేనలు మడిసినవి. ఎన్నియో రష్యన్ ఓడలు ముంచివేయబడినవి. హార్బరు నందుండు నీరంతయు రక్తమయమైనది. తుదకు నౌకా యుద్ధమునందు రష్యా పరాజితయైనది. జపానుఓడలు హార్బరులోనికి ప్రవేశింపలేనంత దట్టముగ అందు శవములు తేలినవి.

మెట్టపై జరుగు యుద్ధము మరింత భయంకరముగ నుండెను. ఆర్థరుకోటను పట్టుకొనుటకై పంపబడిన సైన్యము లెన్నియో మడిసినవి. వెళ్లిన సైన్యము తిరిగి వచ్చుటలేదు. జపాను తనపట్టును విడవాడుటలేదు. తుదకు కెయిన్‌లాంగ్ అధిపత్యమున మరియొక సైన్యమంపబడినది. దారిపొడుగునను శవములు పడియున్నవి. కుళ్లిపోయినట్టియు, కుళ్లనున్నట్టియు, రక్తము స్రవించుచున్నట్టియు జపానీయుల శవములపైననే జపాను సేనలు నడిచిపోవలసివచ్చెను. కొనయూపిరితో పడియున్న సైనికులు కాళ్లక్రిందపడి కెవ్వున నరచి ప్రాణములు విడిచిరి. జపాను సేనలు కోటను సమీపించగనే రష్యనులు మరఫిరంగులను ప్రయోగించిరి. చావగ మిగిలినవారు వెనుకకు తగ్గిరి. ఇట్లు జపాను సేనలు పౌరుషముతో కోటను సమీపించుటయు రష్యన్ యుద్ధఫిరంగులదాడికి తాళలేక వెనుకకు మరలుటయు అనేకసార్లు జరిగినది. తుదకు కెయిన్‌లాంగ్ తనసైనికులను ఆవేశపూరితములైన మాటలతో హెచ్చరించెను. వెళ్లినసైనికుడు వెనుకకు మరలుట జపానుజాతికే సిగ్గు ! నాటితో జపానుజాతి పృథ్వీరంగముపై నుండి నాశనమైనను గావలె ! లేదా ఆర్థరుకోటను వశపరుచుకొనవలె ! సైనికులయొక్క ఆవేశమునకు హద్దులేకుండెను. ఇంతలో కొరియా దేశమునందు సైన్యాధిపతియైన కురోకి రష్యనుల నోడించె నను విజయవార్త చేరెను. ద్విగుణోత్సాహముతో జపానుసైనికులు కోటను ముట్టడింప నొక్కుమ్మడిని దలపడిరి. చచ్చినట్టియు, సగము చచ్చినట్టియు, కొనయూపిరి గలిగినట్టియు మనుష్యుల దేహములను కోటగోడలకు మెట్లుగా పేర్చిరి. వ ని నాధారముగగొని కోటగోడల నెగ్రబాకజొచ్చిరి. పైనుండి తమపై గురిపింపబడు రష్యనుఫిరంగిగుండ్లకు మరికొన్ని శవముల నడ్డుపెట్టుచుండిరి. ముందున్న సైనికుడు మరణించగానే వెనుకనున్న సైనికుడు వానిశవమును మెట్టుగా పేర్చిపై కెగ్రబాకుచుండెను. వాడు మరణించగనే వానివెనుకనున్నవాడు వానిశవమును రష్యన్ ఫిరంగిగుండ్ల కడ్డుపెట్టుచుండెను. ఇట్లు సాయంత్రమగుసరికి జపాను సేనలు కోటగోడల నెగ్రబాకి రష్యన్ యుద్ధవీరులనుండి ఫిరంగులను వశపరుచుకొనిరి. వెంటనే వానిని రష్యన్ సేనలపై ప్రయోగింపసాగిరి. జపాను సైనికులదాడికి తాళజాలక రష్యన్ సేనలు పలాయనమైనవి. ఇంతలోనే రష్యన్ సేనానియైన క్రొపాట్కిన్ ముక్డెన్ ప్రాంతమునందు పూర్తిగ ఓడిపోయె నను వార్తలు చేరినవి. ఇట్లు జపానుకే పూర్తివిజయము చేకూరినది. ఈరంగుజాతి విజయము పశ్చిమజాతుల నొక భూకంపమువలెను, ప్రాగ్జాతుల నొక మెఱపువలెను కదల్చివైచినది. కాని కెయిన్‌లాంగ్ మరణించెనను దుర్వార్త యొకటి వ్యాపించినది. యుద్ధగాయముచే మరణించెనని ప్రజలు చెప్పుకొనుచుండిరి. ముందేమికానున్నదో ! సందిగ్ధము.

౭

స్త్రీయొక్క ప్రేమ ఈశ్వరునియొక్క విశ్వాసముకంటె వింతైనది. అందును యువతీయువకుల మధ్య

నుండు ప్రేమను వర్ణింప యత్నించుట వెఱ్ఱిపని. స్త్రీ యొక్క ప్రేమ స్వార్థరహితమైన దను సంగతి జగద్విదితము. బిడ్డకు శ్రేయముకూర్చుటకై తల్లి యత్నించును. భర్తకు సుఖములు కూర్చుటకై భార్య తలపెట్టుచుండును. ప్రేమను సంరక్షించుకొనుటకై స్త్రీ చేయజాలని సాహసకార్య ముండదు. తాను ప్రేమించినవానిని పొందుటలో పూజనీయుడైన తండ్రియొక్కయు, ముని శ్రేష్ఠుడైన నారదునియొక్కయు ఉపన్యాసపరంపరలకు స్వస్తిచెప్పినది సావిత్రి. అకస్మాత్తుగ తటస్థపడిన రాజును నిష్కళంకముగ ప్రేమించి గాంధర్వమున పెండ్లియాడుటలో పరమమానీంద్రుడైన పెంపుడు తండ్రిని తలచినదియేగాదు శకుంతల. తన ప్రియునే పెండ్లియాడుటలో దగ్గరకువచ్చిన దిక్పాలకులను ధిక్కరించగలిగినది దమయంతి. తన ప్రేమపాత్రుడైన ఢిల్లీ రాజును పాణిగ్రహణము చేసికొనుటలో జనకుడు పెట్టు బాధలను పరిగణించినది కాదు రాణీసంయుక్త. కెయిన్ లాంగ్ మరణించె నను గాలివార్త విని సిసీలియ యేమి చేయునో!

అది నిశీథరాత్రి. దట్టమగు మహాంధకారము బ్రహ్మాండమునంతయు నాక్రమించియున్నది. విశ్వమంతయు నల్లనిముద్దవలె తోచుచున్నది. ఉత్తరధ్రువపు దిక్కున మాత్ర మొకనక్షత్రము పృథ్వీరంగముపై నరజాతులకు గలుగు గర్వభంగములను దిలకించుచున్నదోయన మినుకు మినుకు మని మెఱయుచున్నది. తెల్లవారిన తరువాత రష్యా జపానుల మధ్య సంధి జరుగనున్నది. కోటకు దూరముగ జపానుసేనల గుడారము లున్నవి. అందున్న దీపములు కోటగోడపై నుండు వ్యక్తికి మెఱుగుడు పురుగులవలె కాన్పించును. కోటగోడలపై నొకవ్యక్తి తప్ప మరెవ్వరును లేరు. కోటచుట్టును చచ్చి రక్తమున దేలు శవము లెన్నియో గలవు. ముందుగనే మరణించిన శవములు క్రుళ్లుట కారంభించినవి. ఇంకను రక్తము స్రవించుచు పడియున్న దేహములు చాలగలవు. ఆశవనివహముల నుండియు, మాంసపురాసులనుండియు, రక్తపు తటాకములనుండియు వేడి దుర్గంధపువాయువులు పైకి లేచుచున్నవి. మందలు మందలుగాచేరిన జంబూకములనుండి ఆరవములు వినబడుచున్నవి. క్రిందనున్న పొదలలోనుండి గుడ్లగూబలు కూయుచున్నవి. ప్రక్కనున్న చెట్టుపై నుండి శకునపక్షి తన శోకధ్వనులతో మానవసంఘమును హెచ్చరించుచున్నది. అట్టి మహాభయంకర సమయమున నాకోటగోడలపై దిరుగు వ్యక్తి యెవరు? ఏమి సిసీలియా! ఏమి నీవెఱ్ఱి!! ఇట్టి నిశీథరాత్రి, ఇన్నివేలశవములందు నీప్రియునిశవము నెట్లు గుర్తించగలవు? ఔనులే. ప్రేమ దట్టమగుకొలది విచక్షణాజ్ఞానము పలుచబడుచుండును. అందు యువతీ యువకుల ప్రేమను గుఱించి అసలే చెప్పలేము.

జపాను సైనికగుడారములందు కెయిన్ లాంగ్ ఆలోచనానిమగ్నుడై తిరుగుచుండెను. తెల్లవారిన వెంటనే జపానీయులు విధించిన సంధిషరతులు రష్యను లంగీకరింపకున్నచో జపాను సైనికులు ఆవేశపూరితులై ఆర్థరుపట్టణమునందున్న రష్యనుల ఆస్తులను దోచుకొని పురుషులను జంపి స్త్రీలనుచెరచి నానాబీభత్సముగావింతురు. అపుడు తన ప్రేయసియైన సిసీలియను రక్షించుకొనుట ఎట్లు? ఎట్లయినను ఆమెను రక్షింపవలెను. ఇది కెయిన్ లాంగ్ తుదినిశ్చయము.

ఇంతలోనే సమరభూమిని కావలికాయు భటులిద్దరు ఒకస్త్రీని పట్టితెచ్చి కెయిన్ లాంగ్ ముందు నిలబెట్టిరి. ఆమెను చూచుటతోనే కెయిన్ లాంగ్ విభ్రమము జెందెను. కాంక్షించువస్త్రము కాళ్లపైబడినది. మరియొక పరిస్థితియందైనచో వెంటనే యామెను కౌగిలించుకొని ముద్దుపెట్టుకొనియుండెడివాడు. ఇప్పటి పరిస్థితులు వేరు. ఎవరును కాలుపెట్టగూడని సమరభూమియందామె తిరుగాడుచున్నది. సైనికశాసనము ననుసరించి యామెను ఫిరంగితో కాల్చి చంపవలెను. వారిపుడు కామినీకాముకులు గారు. ఆమె నేరస్థురాలు. అతడు న్యాయాధికారి. కెయిన్ లాంగ్ యేమిచేయునో!!! ఏమానవుడైనను అట్టిస్థితిలో నేమి చేయగలడు? కెయిన్ లాంగ్ ఎటువంటివ్యక్తి? అన్యాయముగ తనను పట్టి తిట్టి కొట్టి శిలువవేసిన ఘోరపాపులను కూడ రక్షించవలసినదని దేవుని ప్రార్థించిన క్రీస్తుప్రభువు వంటి సహనశాలిగాడు. నిరాయుధులు, నిరపరాధులు

నగు ప్రజలు ఘోరముగ చిల్చి చెండాడబడిన హృదయ భేద్యమగు పంజాబురక్తస్రవంతులను కనులార గాంధియు హృదయమును చిక్కబట్టి సత్యాగ్రహముగుటించి ఉపన్యసించిన మహాత్మునిబోటి విచిత్రవ్యక్తిగాదు. తమ హస్తగతముకానున్న పరాసుసింహాసనమును రక్షించి తమసైన్యములను చీల్చి చెండాడినదనుకోపముచే ప్రమాద వశమున పట్టువడిన జోన్ ఆఫ్ ఆర్కుకన్యను ప్రాణములతోనే కాల్చివేసిన ఆంగ్లేయ సైనికునివంటి కఠిన చిత్తుడుగాడు. ఆసియా అనాగరికజాతినుండి యూరప్ నవనాగరికతను రష్యన్‌జాతి నంతను అవలీలగ మార్పు సమకట్టినపుడు అడ్డుతగిలిన తనభార్యను పుత్రుని పృథ్వీరంగమునుండితుడిచిపెట్టుటకు యత్నించిన పీటరుమహా చక్రవర్తివంటి ప్రేమరహితుడుగాడు. ఒక స్త్రీయందు కలిగిన మోహమును పోగొట్టుకొనలేక బలాత్కారముగ నామెను పొందుటకై సతతము సస్యఫలసంపదలతో నలరారుచుండు చిత్తూరురాజ్యమును శ్మశానవాటికగ మార్చిన అల్లాయుద్దీనువంటి క్రూరరాక్షసుడుగాడు. తన సైనికధర్మమును విస్మరించి విజయయాత్రయందు గాన్పించిన విలాసవతియగు స్త్రీయందు విషయలంపటుడై హస్తగతమైన రోమనుసామ్రాజ్యమును పోగొట్టుకొనిన మార్కస్ ఆంటోనియోవంటి భోగపరాయణుడు గాడు. తనధర్మమును విడిచిపెట్టి పరజాతియువతిని ప్రేమించి తన ఆయువుపట్టు నామెకు వెలిబుచ్చి ఆమెద్వారా తుదకు తన నాశనమును తానే కొనితెచ్చుకొనిన సేమ్సన్‌వంటి స్త్రీలోలుడు గాడు.

కెయిన్‌లాంగ్ ఇపుడు క్లిష్టపరిస్థితులయందున్నాడు. ముందు నుయ్యి, వెనుక గొయ్యి. మానవజాతులలో జపానుజాతియొక్క ప్రతిష్ఠను నిలబెట్టుటకై వేలకొలది రష్యన్లను చంపిన మేటివీరుడైనతాను కేవలమొక స్త్రీనిమిత్తమై యుగయుగములనుండియు అక్షరాల ననుసరింపబడుచున్న సైనికన్యాయస్థాన ధర్మమును వదలివేయునా? పరదేశీయుడగు తనను నమ్మి హృదయపూర్తిగ ప్రేమించి తనశవముకొరకై సమరభూమియందు తిరుగాడుచున్న యా నిష్కళంకచరితను, పరమపవిత్రురాలిని మానవకల్పితమైన "మార్షల్‌లా" శిక్షకాహుతిచేయునా? ఆమెను మరణశిక్ష విధించుట జపానుజాతీయధర్మము. ఆమెను రక్షించుట మానవ మహనీయ ధర్మము. జపానుపరువు నిలుపుటయా? మానవకీర్తి నిలుపుటయా? కెయిన్‌లాంగ్ దేని ననుసరించును? అంతయు సందిగ్ధము.

౮

తెల్లవారినది. తెల్లజాతులకుగలఅహంభావపు చీకటులను పారద్రోల జపానుసూర్యు డుదయించినాడు. బాలభానుని పసిడికిరణములు పసిఫిక్‌సముద్రతరంగములతో చెలగాటము లాడుచున్నవి. సృష్టిఅంతయు గంభీరమగు మౌనమును దాల్చియున్నది. అట్టిసమయమందు జపాను సైనికగుడారములయందు జనులు గుంపులుగుంపులుగ గుమిగూడియుండిరి. దూరమున మూడు ఫిరంగులు వరుసను పేర్చబడియున్నవి. గంటకొట్టిన వెంటనే వానిని కాల్చుటకు సిద్ధముగ ముగ్గురుభటులు వానివెనుక నిలువబడియున్నారు. ఫిరంగుల కెదురుగ కొంచెము దూరమున రష్యన్‌యువతి ముకుళితహస్తయై నిలువబడియున్నది. సైనికదుస్తులతో కెయిన్‌లాంగ్ ఆమెను సమీపించి,

"సిసిలీయా! నీ పవిత్రహృదయమునందు నాకు స్థానమిచ్చి తుదకిట్టి క్లిష్టపరిస్థితులలోనికి వచ్చితివి. ఇంతకును మానవజీవిత మొకనాటకము. జీవితము కర్మబద్ధమైనది. స్వేచ్ఛగా పుట్టిన మానవునిపై సంఘము మన్ని శాసనములను ప్రయోగించి యాతని స్వాతంత్ర్యము నరికట్టి జీవితమునుదుర్భరముచేయుచున్నదని రూసో పండితుడు పరాసువిప్లవమునకు పూర్వము చెప్పినాడట. మానవుడు సాంఘికసంకెళ్ల మధ్య పుట్టుచున్నాడు. పుట్టినదిమొదలు గిట్టువరకు దానిని విదల్చుకొనయత్నించుచున్నాడు. సంఘములు, సమాజములు, కూటములు, విప్లవములు అందుకొరకే.

సైనికశాసనము ననుసరించి నిన్ను ఫిరంగితో కాల్చవలెను. మానవప్రేమధర్మము ననుసరించి నిన్ను రక్షింపవలెను. నీవులేని ప్రపంచము నాకేల!......" అని చెప్పుచు ఫిరంగులను కాల్చుటకు సర్తుగ చేయి నెత్తి ఆమెను కౌగిలించుకొనెను. వెంటనే గంట మ్రోగెను. ఢాం ఢాం ఢాం శబ్దములతో కెయిన్‌లాంగ్ సిసిలీయాల శరీరములు పృథ్వీరంగమునుండియదృశ్యమైనవి.

తీరినది సందిగ్ధము.

---




డ్రాయింగురూములో కూర్చుని శాంతమ్మ గారు అప్పుడే పోస్టుజవాను తెచ్చియిచ్చిన ఉత్తరాన్ని చదువుతున్నది.

శాంతమ్మగారి భర్త శామ్యుయల్ గారు ముప్పై యేళ్లు రెవెన్యూ డిపార్టుమెంటులో ఉద్యోగముచేసి, డెప్యూటీకలెక్టరుగా రిటైరు అయి, పదిహేనేళ్లకు పైగా పింఛను తీసుకుంటూ అరవైయెనిమిదవ ఏట యిహలోకాన్ని, సంపాదించిన యావదాస్తిని, భార్య అయిన శాంతమ్మను విడిచిపెట్టి పరలోకం జేరారు. శాంతమ్మగారికి సంతానం లేదు. ఆమె వయస్సు అరవై యేళ్లపైన ఉంటుంది.

'పాపం, దాసుదగ్గరనుండి ఎప్పుడు ఉత్తరం వచ్చినా నాకు చాలా ఆనందంగా ఉంటుంది' అనుకుంటూ కళ్లకు పెట్టుకున్న సులోచనాలను తీసి చీర కొంగుతో తుడుచుకొని మళ్లీ పెట్టుకుని, రంగంనుండి ఆవిడతమ్ముడు ఏసుదాసు వ్రాసిన ఉత్తరం మళ్లీ చదవడం ప్రారంభించింది.

“సుసీ యిప్పుడు జాగ్రత్తగా ఉంటున్నదనుకుంటాను, చదువుమానినతరువాత. నీవప్పుడూ అంటూ ఉండేదానవి- సుసీ పెంకెపిల్ల అని. ఇప్పుడు బాగా మారిపోయిం దనుకుంటాను. ఏమైతేనేం, నీచేతుల్లో పెట్టాను. దానితండ్రికంటె జాగ్రత్తగా పెంచుతావని నాకు తెలుసు అదే నాకు ఆనందం.”

'కాని పాపం దాసుకుమటుకు ఏం తెలుసు పిల్లల్ని పెంచడం!' అనుకున్నది శాంతమ్మగారు.

“ఈమధ్య నా పాతస్నేహితుణ్ని ఒకాయిన్ని కలుసుకొన్నాను యిక్కడ. వాళ్లది బెజవాడ. బాగా ధనవంతుడు. ప్రస్తుతం యిక్కడ కలపవర్తకం చేస్తున్నాట్ట. ఆయన ఈవారంలో దేశానికి వస్తున్నాడు. నీకు, సుసీకి కొన్ని క్రిస్మస్ ప్రెజంటుస్ పంపుతున్నాను ఆయనద్వారా. ఆంతోనీ చాలామంచివాడు. మన యింటికొస్తే ఆయనను మర్యాదచేయడంలో యేమీ లోపం లేకుండా చూస్తావని నానమ్మకం.”

చదవడం ఆపింది శాంతమ్మగారు. మళ్లీ సులోచనాలు తీసి తుడవడం మొదలుపెట్టింది.

'ఎవరీ ఆంతోనీ చెప్మా! పేరు ఎప్పుడూ వినలేదే! పడుచువాడు కాడు గదా! కాకుంటే బ్రతికి పోతాం. అయ్యాడా మళ్లీ యింకో అల్లరికి తయారు' అనుకున్నది తనలో తాను. ఉత్తరం చివరిదాకా చదివి మడతపెట్టి కవరులో మళ్లీ పెట్టింది దీర్ఘనిశ్వాసం విడుస్తూ.

తన తమ్ముడు ఏసుదాసు అంటే శాంతమ్మగారికి అమితమైన ఆపేక్ష. ఏసుదాసు బర్మాలో ఒక క్రిష్టియన్ కళాశాలలో యింగ్లీషు ప్రొఫెసర్. ఆయన భార్యపోయి పదిహేను సంవత్సరాలపైన అవుతుంది. ఒక్కతే కూతురు. వెతికి వెతికి పెట్టాడు పేరు 'సూసన్నా' అని. ఇంట్లో ముద్దుగా పిలుస్తారు 'సుసీ' అని. సుసీ చిన్నప్పటినుంచి చాలా అల్లరిపిల్ల. భార్యపోవటం, తనకేమో పరదేశంలో ఉద్యోగం అవడం, అక్కగారికి సంతానం లేకపోవడం ఈకారణాలచేత ప్రొఫెసర్ ఏసుదాసు సుసీని బందరులో శాంతమ్మగారివద్ద నుంచి చదువు చెప్పించవలసివచ్చింది.

సుసీ ఎంత అల్లరిపిల్లో అంత తెలివైంది. కాని ఆ తెలివి పరీక్షలు ప్యాసవటానికి పనికివచ్చిందికాదు. వరుసగా మూడేళ్లు దండయాత్ర చేసింది స్కూలు ఫైనల్లో. శాంతమ్మగారు పూర్వకాలపు మనిషి. కట్టుబాట్లల్లో పెరిగింది. సుసీపద్ధతులు ఆవిడకు నచ్చవు. క్షణక్షణమూ మారిపోతున్న నవనాగరికత, కొత్త పోకడలు, ఊహలు సుసీమస్తిష్కంలో తాండవం చేస్తూ ఉంటాయి. 'దాంతో చనువుగాఉంటే లాభం లేదు. నిరోధ్మహమోటంగా ఉండాలి. బాగా కాఠిన్యం వహించాలి' అనుకుంటున్నది శాంతమ్మగారు.

అప్పుడే డ్రాయింగురూము తలుపు గర్ర్ర్ అని నెట్టి లోపలికివచ్చింది సుసీ.

'టైముచూడడానికి వచ్చాను.'

'ఏమంత గాభరాగా రావాలా ఏమిటి! పావు తక్కువ మూడైంది. నాలుగుగంటలకు రేవరెండు కాంతయ్యగారి యింటికి వెళ్లుతున్నాను—'

'నేను రాను.'

'నేను వెళ్లుతున్నాను. నావెంట నీవుకూడా రావలసి ఉంటుంది.'

'కాని యివాళ నాకు వీలులేదు అత్తా. నాకు బోలెడంత పని ఉన్నది.'

'ఆహా' అంది వెక్కిరిస్తూ శాంతమ్మగారు. 'అయితే యివాళ యిల్లువదలి ఎక్కడికీవెళ్లవని అనుకోవలసిందేనా?'

సుసీకి కొంచెం వింతగా ఉంది. ఇరుసపారుసు ముసలిముండలు శాంతమ్మచెవులో యేమైనా ఊదారా ఏమిటి!

'వెళ్లితే గోకిలతోటదాకా షికారుగా వెళ్లుతానేమో' అంది నెమ్మదిగా.

'సుసీ! నీవొక్కదానివే తోటలకీ, గీటలకీ షికారువెళ్లడం బాగుండలేదు. షికారువెళ్లాలనిఉంటే నాతో రా. అంతేకాని నీవు నాయింట్లో, నా అదుపులో ఉన్నప్పుడు చాలా జాగ్రత్తగా ప్రవర్తించాలి సుమా!'

'ఆహా' అంది సుసీ. 'నీమాటలు నాకేం అర్థం కావడంలే అత్తా'

శాంతమ్మగారికి కోపం బాగా వచ్చింది. 'చెప్తా విను. నీవిట్లా ఒంటరిగా తోటల్లోకి షికారువెళ్లడం, కనబడ్డ ప్రతికుర్ర వెధవతో మాట్లాడడం, ఆవెధవల్లో కొందరునాయింటికివచ్చి కూర్చోడం, టీతాగడం, సిగరెట్ల పొగతో నా డ్రాయింగురూమునంతా నింపడం, వెధవ బాతాఖానీ కొట్టడం ఏమిటీ న్యూసెన్సు నాకు? ఇటువంటిపనులు నా కేమాత్రం యిష్టంలేదు. తెలిసిందా? నాతో రేవరెండు కాంతయ్యగారింటికి రావడానికి యిష్టంగా లేకపోతే యింట్లో నేఉండు. పొద్దున్నేమో రిబ్బన్లు కొనుక్కోటానికని మూడు గంటలు బజారంతా తిరిగి యింటికివచ్చావు. నీవెక్కడెక్కడికి వెళ్లింది బండీవాడు నాకు చెప్పలేదనుకోకు. మళ్లీ సాయంకాల మయ్యేసరికి తయారు షికారుకు. వెళ్లటానికి వీల్లేదు. వింటున్నావా?

సుసీకి పట్టరానికోపం వచ్చింది. మొహం కందబారింది. కాని పైకిమాత్రం నిర్మలంగా

'సరిలే అత్తా, యివాళ సాయంత్రం బహుశః షికారు వెళ్లవలసిన అవసరం లేదనుకుంటాను.' అంటూ పక్కన టేబిల్‌మీద ఉన్న 'సండేటైమ్సు' పత్రికతీసి సీరియస్‌గా చదవడం మొదలుపెట్టింది.

'నీవు జాగ్రత్తగా ప్రవర్తించకపోతే మీనాన్నకు నీవిషయమంతా వ్రాయాలిసి వస్తుంది సుమా! ఇల్లు జాగ్రత్త' అని శాంతమ్మగారు డ్రాయింగు రూములోనుంచి వెళ్లింది రెవరెండు కాంతయ్యగారింటికి ప్రయాణమై.

శాంతమ్మగారు బయటకు వెళ్లడం తరువాయి సుసీ చదువుతున్న పేపర్ని విసిరి నేలమీద కొట్టింది. మహాకోపం వచ్చింది. ముసలివాళ్లు ప్రపంచానికి పెద్ద న్యూసెన్సు. వాళ్లనాన్న అంటూ ఉండేవాడు ఆమె చిన్నప్పుడు - నీలాకాశాన్ని, పక్షుల్ని, వింతరంగుల మేఘాల్ని, మిణుమిణుకుమనే నక్షత్రాల్ని సృష్టించిన దేవుడే మండ్రగబ్బల్ని, బల్లుల్ని, తొండల్ని, తేళ్లు మొదలయినవాటిని సృష్టించలేదని! 'ఈ ముసలావిడ గోల యెక్కువై పోతున్నది. ఎక్కడికీపీడ నాకు. ఇవాళ్లల్లా ఇంట్లో యేడుస్తూ కూర్చోవాలి కాబోలు. పాపం రాజా తోటదగ్గిర కనిపెట్టుకు కూర్చుంటాడు నాకోసం. ఏలా చెప్మా' అనుకున్నది.

సూసన్న చాలా అందమైనపిల్ల. మంచి తెలివిగలది. దానికితోడు అతి గారాబంగా పెరిగింది. ఇంగ్లీషుభాషలో నవకవుల, నవలారచయితల ఊహలతో ఆమెతల నిండిపోయింది. తెలుగుకవులలో ఆమెను ఎక్కువ ఆకర్షించింది వెంకటచలం. ఎంకిపాటలు బాగాపాడేది. దీనికితోడు ఆమె నాలుగైదు సంవత్సరాలలోపల తయారై, ప్రపంచమంతట అనేకయవ్వనుల నుప్పొంగించిన పాశ్చాత్యఫిల్ములను చూచింది. ఆ భావాలే తన జీవితాన్ని నడుపుతూన్నవి. ఆమె లేత హృదయం యెప్పుడూ నవనవోన్మేషమైన 'రోమాన్సు'ను కోరుతూ ఉంటుంది. ఎప్పుడూ ఎవరో ఒక అందమైన కుర్రవాణ్ణి ప్రేమించడం, అది కొంచెం మాసిపోగానే మళ్లీ యింకొకణ్ణి. ఈవిధంగా సుసీ యిప్పటికి ఐదారుగురు యువకుల్ని ప్రేమించింది, మరిచిపోయింది కూడాను. అవి వింతరంగుల స్వప్నాలు. వార్ధక్యం తన నీలినీడలతో జీవనపథాన్ని కమ్మివేస్తూఉంటే ఈయవ్వన స్వప్నాల స్మృతే ప్రతివ్యక్తికి ఒకింత ఆనందాన్ని యిచ్చేది.

ప్రస్తుతం ఆవిడప్రియుడు పూరా అందగాడు. పేరు రాజారావు. మొదటిసారి కలుసుకున్నప్పుడే ఒకరిమీద ఒకరికి ప్రేమకలిగింది. కొన్నిరోజులనుంచి అతడు సుసీయింటి కెదురుగానున్న ఎలక్ట్రిక్ స్తంభాన్ని ఆనుకొని సుసీగదికిటికీవైపు తదేకదృష్టితో చూస్తూఉండేవాడు. ఒకరోజు సుసీ, ఆమెకుక్కపిల్ల లిల్లీ షికారు వెళ్లుతుంటే, ఒక పెద్దకుక్క లిల్లీమీదికి దూకింది, అమెరికాలో అందమైన తెల్లదొరసానిపిల్ల మీదికి నల్లనీగ్రోయువకుడు దూకేటట్లు. అప్పుడాతోవను వెళ్లుతున్న రాజారావు తనచేతికర్రతో ఆపెద్దకుక్కను తరిమాడు. ఈకుక్కల హడావిడిలో వీరిద్దరికి ప్రథమ పరిచయం కలిగింది. అంతా సినిమాలోవలె, నాటకాలు, నవలలోవలెనే ఉంది సందర్భం. ఇటువంటి అవస్థలో సుసీహృదయాన్ని రాజారావు ఎందుకు ఆకర్షించడు?

ఆరోజునుంచి యిద్దరూకలిసి తోటలోకి షికారు వెళ్లుతూ ఉండేవారు. ఒకరోజు అతడు చెప్పేశాడు సుసీ అసమానసౌందర్యం తన్ని యెట్లా పిచ్చివాడినిచేసిందో. సుసీహృదయం పొంగిపోయింది. రాజారావు నడివయస్సులో ఉన్నాడు. తన పాతప్రియుల్లాగా నూక్కలుకుర్రవాడుకాదు. బాగా ఆరితేరినచెయ్యి. అటువంటివాడుకూడా తన అందానికి ముగ్ధుడయ్యాడంటే సుసీకి గర్వంకాదూ!

ఇక మిగిలిందేముంది? ఇప్పటికి అరడజన్ మందికి పైగా అర్పించి మళ్లీతీసుకున్న ఆమెహృదయాన్ని సుసీ రాజారావుకు అర్పించింది.

ఇవాళ సాయంత్రం సముద్రపొడ్డుకు షికారు వెళ్దామనుకున్నారు యిద్దరు. శాంతమ్మగారి పుణ్యమా అంటూ దానికి ఆటంకం వచ్చింది. రాజారావు తోటలో కనిపెట్టుకుఉంటాడు.

ఇంతలోనే వీథితలుపు వేయబడ్డచప్పుడు అయింది. శాంతమ్మగారు బయటకు వెళ్లారన్నమాట దాని అర్థం.

'ఆహా' అంటూ ఒక్కదూకుదూకింది సుసీ కుర్చీలోంచి. 'అరే, రాజారావు తోటదగ్గర నుంచుంటే అత్త చూడదుగదా!'

చెంగునవెళ్లి డ్రాయింగురూము ఎడమప్రక్కన ఉన్న కిటికీలోంచి చూడడం మొదలుపెట్టింది సుసీ. దూరాన్న ఎలక్ట్రిక్ స్తంభాన్ని ఆనుకుని నుంచున్నాడు రాజారావు శాంతమ్మగారి యింటివైపు చూస్తూ. సుసీ చూచింది. వాళ్ల అత్త రెవరెండు కాంతయ్యగారి యింటివైపు చాలాదూరం వెళ్లిపోయింది. రోడ్డుమీద మనుష్యులు ఎవరూ లేరు. సంధ్యచీకట్లు కమ్ముతున్నవి. నెమ్మదిగా రాజారావుకు సైగచేసింది. సరే తయారు కథానాయకుడు యెడమప్రక్క గేటులోనుండి ఆమె కిటికీదగ్గరకు.

'మై జ్యూలియట్!'

'ఇవ్వాళ షికారురావడానికి వీల్లేదు.'

'ఛా! మన అదృష్టం బాగాలేదు. ముసలావిడ వెళ్లిపోయినట్టుందిగా.'

'వెళ్లింది. కాని నన్ను బయటకువెళ్లవద్దనిచెప్పి మరీవెళ్లింది. ఆవిడ దేవాంతకురాలని చెప్పలేదూ.'

'మై గాడ్. పోనీ అట్లా దొడ్లోకి రాకూడదూ, మాట్లాడుకుందాం' అన్నాడు రాజారావు జేబులో నుంచి సిగరట్టుపెట్టి తీసి, ముట్టిస్తూ. నాలుగునిమిషాలు నిశ్శబ్దంగా గడచిపోయినవి.

'ఉండు బలేఊహ తట్టింది!' అంది సుసీ ఆలోచనాపూర్వకంగా.

'చూడు. నీవు దర్జాగా లోపలకు రావడానికి ఆలోచన చెప్తాను. వీధి గుమ్మందగ్గరకు వచ్చేయి. శాంతమ్మగారున్నారా అని అడుగు. లేరంటారు నౌకర్లు. మిస్ సూసన్నా ఏసుదాసుగారున్నారా? అని అడుగు. ఉన్నారంటారు. లోపలికి తీసుకొస్తారు నిన్ను డ్రాయింగురూములో కూర్చుని మనమిద్దరం ఏకాంతంగా టీ పుచ్చుకోవచ్చు. ఏం!'

'కొంప మునగదుకదా. మీనౌకర్లు ఫలానా వాడు వచ్చాడని నాపేరు ఆవిడతో చెప్తే తరువాత'

'ఉండు! ఉండు'

మళ్లీ నాలుగునిమిషాలు ఆలోచనలో గడచిపోయినాయి.

'నీ అసలుపేరు చెప్పవద్దు. ఆ, జ్ఞాపకం వచ్చింది. ఆంతోనీగారు. మా నాన్న ముఖ్యస్నేహితులు ఇందాక మా నాన్న ఉత్తరంలో ఉంది. ఆయన్ని ఎప్పుడు మా అత్త చూడలేదు. అదిగాక నాన్నస్నేహితుడంటే చాలాగౌరవం మాఅత్తయ్యకు. నీవాపేరుపెట్టుకుని...'

బిగ్గరగా నవ్వడం మొదలెట్టాడు రాజారావు.

'అసామాన్యురాలవు సుసీ నీవు. ఏమిటా పేరు?'

'ఆంతోనీ. యస్. ఆంతోనీగారు. రంగూనులో కలపవర్తకులు. కాపురస్థలం బెజవాడ. ఈవారంలోనే బర్మానుండి దేశానికి వచ్చారు.'

సినిమానటులలో రాజారావుకు బాగా నచ్చింది చార్లీచాప్లిన్, హారాల్డులాయిడ్, రామన్‌నవారో. ఛాయారూపమున చూచిన వారి విచిత్రలీలలు అతని జీవితమునకు ఆదర్శప్రాయము. ఆఛాయానాటక కథలే అతని జీవనాటకముగ పరిణామము పొందినవి.

రాజారావు నెమ్మదిగా బయటకు జారాడు. సుసీ కిటికీతలుపువేసి లోపలికివెళ్లింది. ఆమెకు బలే హుషారుగా ఉంది. గదంతా గంతులువేసింది. ఎదురుగుండా ఉన్న నిలువుటద్దంలో ఒకసారి తనమూర్తిని చూచుకున్నది. ఆమెసౌందర్యం ఆమెనే సమ్మోహపరిచింది. రాజారావును అచ్చెరువొందించిందంటే అబ్బురమేమిటి.

చెదిరిన ముంగురులను సవరించుకున్నది సుసీ. తనగదిలోకివెళ్లి తెల్లని జరీ అంచు చీర కట్టుకున్నది. అలంకరించుకుంటూ అనుకున్నది - బలే ఎత్తు. సిన్‌క్లయిర్ లూయీనవలలో ఇటువంటి సందర్భం ఒకటి ఉంది. భావుకుల ఊహలేగదా జీవితాలను నడిపేవి. అందుకనే అన్నాడు ఆస్కార్‌వైల్డు ప్రకృతి కళను అనుకరిస్తుందని.'

ఆమె తనలో తాను నవ్వుకుంటున్నది.

వీధి తలుపు తట్టినచప్పుడు. రెండునిమిషాలు తరువాత పనిమనిషి లచ్చి వచ్చింది.

'అమ్మగారండి, ఎవరో ఆంతోనీగారంట. అయ్యగారి స్నేహితులంట. పెద్దమ్మగారున్నారా అని అడిగితే లేరన్నాను. మీరున్నారా అని అడిగారు. ఉన్నారన్నాను. మీతో ఏంటో మాట్లాడాలంట. వచ్చి డ్రాయింగురూములో కూర్చున్నారండి.' అంది.

'ఆంతోనీగారా? ఎప్పుడువచ్చారు? తీసుకురా యిక్కడికి' అంది సుసీ విపరీతమైన ఆశ్చర్యం కనబరుస్తూ.

లచ్చి వెళ్లింది.

సుసీగుండెలు దడదడ కొట్టుకోడం ఆరంభించింది. నిశ్శబ్దంగా కుర్చీలో కూర్చుంది.

ఇంతలోనే మళ్లీ లచ్చి వచ్చింది. 'అమ్మగారూ, యిదుగో వారు వచ్చారు' అంటూ చెప్పివెళ్లిపోయింది.

'దయచేయండి' అంది సుసీ బిగ్గరగా లచ్చికి వినబడేటట్లు.

తరువాత గొంతుమార్చింది.

'నా ప్రియమైన సుసీ' అంటూ రాజారావు ఆమెను కౌగలించుకొని ముద్దుపెట్టుకున్నాడు. సుసీ చెక్కిళ్లు ఎర్రబారినవి. రవ్వంత సిగ్గుకూడా వచ్చింది. జ్యూలియట్, శకుంతల భిన్నతత్వాలు ఆమెమూర్తిలో మిళితమైనవి ఆనిమిషంలో.

రాజారావు అటూఇటూచూచాడు. 'ఎంతఅందమైన డ్రాయింగురూము' అన్నాడు.

'ఏదో మోస్తరు. ఆపక్కదే నా పడకగది. ఒంటిగానున్నప్పుడు అక్కడకూర్చుని టీ తాగుతాను.'

గదిఅంతా కలయబారచూచి 'చాలాబాగుంది' అన్నాడు రాజారావు. అతని చూపులని యెక్కువ ఆకర్షించినది సుసీకంటె ఆగది,ఆగదిలోని విలువగల సామాన్లు. కాని సుసీని మంచి హుషారులోఉంచాడు రాజారావు. ఆమె ఆనిమిషాన్ని తాను ఇమోజన్‌గా భావిస్తున్నది.

ఇద్దరు ఒకరికౌగలిలో ఒకరు కూర్చున్నారు ఇంతసేపు. చటుక్కున అందిసుసీ: 'దూరంగా కూర్చోండి, టీపట్టుకొని లచ్చి వస్తుందేమో!'

'ఆహాహా! ఆమాటే మర్చిపోయాను. అయితే సుసీ, చూడకూడదు లచ్చివస్తున్నదేమో!

సుసీ కొంచెం చమకిత అయింది. 'బాగుంది. నేనిప్పుడేపోయి వెంటనే టీ తీసుకరమ్మని లచ్చితో చెప్పి వస్తాను. టీ తెచ్చి అది వెళ్లిపోతుంది. తరువాత మనమిద్దరం ఏకాంతంగా కూర్చుని టీతాగుతూ హాయిగా కబుర్లు చెప్పుకోవచ్చును' అంది.

'గుడ్ గర్ల్' అన్నాడు రాజారావు. సుసీ నవ్వుతూ వెళ్లింది.

సుసీ వెళ్లడంతరువాయి రాజారావు నెమ్మదిగా లేచాడు. టేబిల్ దగ్గరకు వెళ్లాడు. డ్రాయిర్లు అన్ని తెరిచి చూచాడు. శాంతమ్మగారి పర్సు ఉంది ఒక దాంట్లో. తెరిచిచూచాడు. మూడు పదిరూపాయిల నోట్లు, రెండు రూపాయిలు, కొంత చిల్లర ఉంది అందులో. ఇంతేనా అనుకుంటూ తనకోటుజేబులో పెట్టుకున్నాడాపర్సును. టేబుల్ మీద ఒక బంగారపు గడియారం, గొలుసు ఉన్నవి. వాటినికూడ నెమ్మదిగా కోటుపక్కజేబులోకి జారవిడిచాడు. అదృష్టం కలిసి వచ్చింది. శాంతమ్మగారి యింట్లోకి రావడం, వాళ్ల డ్రాయింగురూములో కూర్చుని టీతాగడం, ఈలా జరుగుతుందని ఎన్నడన్నా అనుకున్నాడా రాజారావు. కాని అదృష్టవంతుణ్ణి ఎవరు చెరుపగలరు? సుసీ అతని పాలిటి అదృష్టదేవత అయింది అనాడు. 'కాని మనవేషం, డాబు, దర్జా, డ్రెస్సు విలువే ఉంటుంది ఒక వెయ్యిరూపాయిలు' అని అనుకున్నాడు తనలో తాను నవ్వుకుంటూ. పక్కటేబిల్ దగ్గరకు వెళ్లాడు. అక్కడఉన్న ఒకటి రెండు చిన్న ఫ్యాన్సీసామాన్లను కూడ భద్రపరిచాడు. అందులో శాంతమ్మగారి బ్రాచి ఒకటి. ఖరీదుగలది. అది ఆమె తమ్ముడు ఆమె పుట్టిన రోజునాడు (క్రిందటిసంవత్సరం) రంగంనుండి బహుమతిగా పంపాడు.

రాజారావు ఎదురుగుండాఉన్న నిలువుటద్దంలో తన విగ్రహాన్ని చూచుకున్నాడు. మీసందిద్దాడు. నేడు ఆంధ్రదేశంలో భావకవులవిధాన పెంచిన బాబ్‌జుట్టును

సర్దాడు. కళ్లజోడు తీసి తుడిచి మళ్లీ పెట్టుకున్నాడు. మళ్లీ టేబుల్ దగ్గరకు వెళ్లి జాగ్రత్తగా చూచాడుల అక్కడనుండి తీసిన వస్తువులు లేనట్లు తెలియకుండా పక్కనవున్న పేముకుర్చీ టేబుల్‌కు అడ్డంగా పెట్టాడు. కాగితాలు అన్ని సర్దాడు. మళ్లీ అద్దందగ్గరనుంచుని నెక్‌టై సర్దడం ప్రారంభించాడు. అతని అద్భుత జీవితం అతనికే ఆశ్చర్యం కలుగజేస్తున్నది. వారంరోజుం యత్నము నేడు ఫలించింది. తనలోతాను నవ్వుకుటున్నాడు. ఇంతలో సుసీ వచ్చింది.

‘లచ్చి ఇప్పుడే టీ తీసుకుని వస్తున్నది. మరచి పోకుసుమా, రాజా, నీవు రంగూన్‌లో కలపవర్తకం చేస్తూన్న మా నాన్న స్నేహితులు అంతోనీగారివి. జాగ్రత్త. సర్దాగా లేదు నీకు ‘రాజా’ అంది నవ్వుతూ.

‘బలే హుషారుగా ఉందిలే’ అన్నాడు రాజారావు.

ఇంతలో లచ్చి టీ ట్రే పట్టుకువచ్చి టేబుల్ మీద పెట్టి వెళ్లిపోయింది. ఇద్దరు కూచుని టీ తాగుతున్నారు.

వీధితలుపుచప్పుడైంది.

‘అత్త’.

‘రెడీ టు మీట్ ది డెవిల్’



శాంతమ్మగారు లోపలికి వచ్చింది — ‘రెవరెండు కాంతయ్యగారు, భార్య, ల్లలు, ఫెర్నాండిజ్ దొరగారింటికి వెళ్లారట. ఇంట్లో ఎవ్వరులేరు. సుసీ’ అంటూ.

‘ఈయన ఎవరు?’

‘ఈయన నాన్న స్నేహితులు ఆంతోనీగారు. బెజవాడకాపురస్థులు. రంగూన్‌లో కలపవర్తకం చేస్తూంటారు. నిన్ననే వచ్చారట దేశంలోకి. మనల్ని చూడటానికి వచ్చా’రంటూ పరిచయంచేసింది సుసీ.

‘నమస్కారమండీ, శాంతమ్మ గారూ! మీ తమ్ముడు ఏసుదాసుకి నాకు చాలాస్నేహం. తప్పకుండా మా అక్కయ్యగారింటికి వెళ్లమని ఆయన మరీ మరీ చెప్పాడు. ‘సుసీ చాలా కొంటెపిల్ల. మాఅక్కయ్య చాలా జాగ్రత్తగా పెంచుతున్నది’ అని అంటూ ఉండేవాడు. ఇవాళ మీదర్శనంచెయ్యడం నాకు చాలా ఆనందంగా ఉన్నది. సుసీ చాలా అల్లరి పిల్ల. ఆ అమ్మాయిని జాగ్రత్తగా, మంచిప్రవర్తనకలిగి ఉండమన్నాడు కూడా’ అని అన్నాడు అంతోనీ.

‘వింటున్నావా సుసీ’ అన్నది శాంతమ్మగారు విప్పారుతున్న ముఖంతో.

శాంతమ్మగారు అల్పసంతోషి. కాస్తపొగుడుతే ఆమెఅంత మంచిమనిషి లేదు. సుసీ విషయంలో ఆమె ‘ఈయన నాన్న స్నేహితులు అంతోనీగారు’ అభిప్రాయాలతో ఇంకొకరు ఏకీభవిస్తున్నారంటే వారు ఆమెకు ఆప్తమిత్రులు. ఆమెకు కులాసాగా ఉన్నది. ఆంతోనీనె పుతిరిగి

‘ఈకాలంలో పడుచుపిల్లల్ని అదుపులో ఉంచడం మహాకష్టమండి, అంతోనీగారూ!’ అన్నది.

సుసీకి వొళ్లుమండిపోతున్నది.

# తెల్లకుష్టము, పొడలు

కొద్దిరోజులు యీమందును వాడినచో తెల్లకుష్టము, పొడలు అత్యద్భుతముగా మటుమాయ మగును. హకీములు, డాక్టర్లు, కుదుర్చలేని వ్యాధులన్నియు దీనిచే నిమ్మళించును. గుణమియ్యనట్లు రుజువుచేసినచో రు 500 లు బహుమతి యివ్వబడును. ఖరీదు రు. 2 లు. జాబులు యింగ్లీషులో వ్రాయుడు.

**Vaidyaraj**
**Akhil Kishore Ram**
**No. 15/2 P. O. Katrisarai (Gaya)**

# లోధ్ర

గర్భాశయరోగనివారిణి

లోధ్ర వాడినవారు వరప్రసాదమని, రసాయనములకు రాణియని, కల్పవృక్షమని, కొంగుబంగారమని మరియు ననేక విధములుగ స్తోత్రము సేయుట యెల్లరకు తెలిసినవిషయము. పెక్కులు ఉపయోగించి ఆరోగ్యవంతులై సుఖించుచున్నారు.

కేసరి కుటీరం
ఎగ్మూరు : : మద్రాసు

# రాజమోహన హేరాయిలు



శ్రేష్ఠమయిన సువాసనగల తలనూనె. మెదడుకు చల్లదనమును గలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, కూడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఎం. అండు కంపెని,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

**ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని, కవిరాజ**
**కందుకూరి వేంకటసుబ్బారావుగారి**

# कामामृतम्

**కామామృతము:**—దేశదేశములలోఁ బ్రఖ్యాతిఁబొందినది. రాత్రి 1 మాత్ర సేవించిన 1 గంటకే ఎంత నిస్సారమైనశుక్లమైనను సంసారసౌఖ్యము నీయఁగలదు. ఏవిధముగా నష్టమగుచున్న శుక్లమునైనను 5 దినములలో నిలిపివేయును. మధ్యనపుంసకులు, నరములశక్తితగ్గినవారు ఈ మందునే పైకి పూతగాఁగూడ నుపయోగించుకొన వలెను. 20 మాత్రల సీసా 1-కి రు. 2-0-0.

**తేజామృతము:**—సెగరోగము (గనోరియా) ఎట్టిరంగుతో, ఎంతటిబాధతో, ఎన్నిసంవత్సరముల నుండియున్నను మొదటిమోతాదునుండియే సుగుణమును జూపించి పూర్తిగ నివారించును. 1 సీసా రు. 4-0-0

**వృద్ధామృతము:**—ఒక్క సీసా చాలును. నల్లమందువేసికొనుదురభ్యాసమునువొలఁగించి ఆదాయమును బలమును వృద్ధిచేయును. 1 సీసా రు. 5-0-0

విలాసము:—**అమృతాశ్రమము,**
నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.

# టానిక్ గ్లిసరో ఫాస్ఫేట్సు

## నరములకు పటుత్వము గలిగించు దివ్యౌషధము.

దీనిలో కాల్షియం, క్షారము, సోడియం, మాంగనీస్, లోహము, స్ట్రిక్నైన్ వగైరాల గ్లిసరో ఫాస్ఫేట్సు కలిగియున్నవి.

నాడీ క్షయము, బుద్ధిమాంద్యము, అజీర్ణము, రికెట్సు వ్యాధి వగైరాలకు అమోఘముగా పనిచేయును.

జబ్బుపడిన తరువాత కోలుకొనుటకును, మనోవ్యాకులత కలిగినప్పుడు యిది బాగుగా నుపకరించును.

**BENGAL CHEMICAL * * CALCUTTA**

మద్రాస్ ఏజంట్లు : యన్. దేశాయ్ గౌండర్ అండ్ కో., 41, బందరువీధి.



నెరసిన వెండ్రుకలు నల్లబడుటకు



వివర్లైన్ తలనూనెను వాడుము. నెరసిన వెండ్రుకలు తిరిగి నల్లబడి గుబురుగా పెరుగును. వెండ్రుకలకు రంగువేయకుడు. ఈనూనెను వాడుము. బాగుగా నెరసిన వెండ్రుకలకు పెద్ద సీసా రు. 3/-లు. కొద్దిగా తెల్లబడిన వెండ్రుకలకు చిన్న సీసా రు 1-12-0 లు. 3 సీసాలు (పూర్తిగా చాలును) కొన్నచో పోస్టేజి ఉచితము.

*Sole Distributors:-*

**SCIENTIFIC PUBLISHING Co.,**

(Medical Dept.) BHOWANIPORE, Cal cutta.

మద్రాస్ స్టాకిస్టులు దవే అండు కో, 260, చైనాబజారు, మద్రాసు.

సికంద్రాబాదు, దక్కన్ స్టాకిస్టులు : పరిక్ బ్రదర్సు-జుమ్మామసీదు.

తిన్నవల్లి స్టాకిస్టులు: మెడికల్ స్టోర్సు తిరునల్వేలి.



**1906 1936**

ఈ 30 సంవత్సరముల "జాతీయసేవయన సామాన్యవిషయము కాదు. పైకాలములో మేము రు 1,45,00,000 లకు పైగా క్లెయిములను చెల్లించితిమని తెలుపుటకు గర్వపడుచున్నాము. ఈవిధముగా అసంఖ్యాకములయిన మాపాలిసీహోల్డరులను, వారి హక్కుదారులకును ధనమును చెల్లించి వారిని అభాగ్యస్థితినుండియు దీనదశనుండియు కాపాడగలిగితిమి.

నేషనల్ ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

హెడ్ ఆఫీసు : కలకత్తా.

ఏజన్సీ షరతులు వగైరాలకు వ్రాసి కనుగొనుడు:—

బ్రాంచి శెక్రటరి,

నేషనల్ యిన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

362, చైనాబజారురోడు, ఎస్ప్లనేడ్, మదరాసు.

లేక

| ఆర్గనైజింగు శెక్రటరి, సబ్ ఆఫీసు, 171, న్యూస్ట్రీటు, మధుర. | ది చీఫ్ ఏజన్సీ, ఆర్కాట్ శ్రీనివాసాచారివీధి, బెంగుళూరు సిటీ. |
|---|---|

అగ్ని మోటారు ప్రమాదముల ఇన్సూరెన్సులు అసోసియేటెడ్ నేషనల్ ఫైర్ అండ్ జనరల్ యిన్సూరెన్సుకంపెనీ, లిమిటెడ్ వారితో సంప్రతింపుడు.

'మా నాన్నకు నేనంటే చాలా ప్రేమ లే. ఈయన చెప్పేమాటలు శుద్ధ అబద్ధాలు' అని అంది కోపంతో.

సుశీకి కోపం ఎక్కువౌతోంది. రాజారావు తన గుట్టు బయటపెడతాడేమోనని భయంగా కూడా ఉంది. ఇంతలో వాకిట్లో రోడ్డుమీద మోటారుకారు ఆగిన శబ్దం వినిపించింది.

లచ్చివచ్చింది గదిలోకి. 'అమ్మగారండీ, ఎవరో ఆంతోనీగారంట. రంగూన్ అంట. దాసు అయ్యగారి స్నేహితులంట. మిమ్మల్ని చూడ్డానికి వచ్చారండీ' అంది.

సుశీగుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. విపరీతంగా భయంవేస్తోంది. నవ్వుకూడా వస్తోంది.

ఇంతలో ఆంతోనీగారు లోపలికి వచ్చారు.

'నమస్కారమండి. శాంతమ్మగారు మీరేనా?'

'మీ పేరేమిటి? మాదాసీ పొరబాటు చెప్పిందేమో!' అంది శాంతమ్మగారు గంభీరంగా.

'నా పేరు ఆంతోనీఅండి. నేను వస్తున్నానని మీ తమ్ముడు ఉత్తరం రాశానన్నాడే నాతో. మేమిద్దరం పాత స్నేహితులం లెండి'

'మా తమ్ముని స్నేహితుడు ఆంతోనీ యిక్కడే వున్నాడే' అంది శాంతమ్మగారు నిమ్మదిగా.

'ఇక్కడా' అన్నాడు ఆంతోనీ రాజారావుకేసి చూస్తూ. 'నాకేం అర్థం కావడంలేదు. నేనేనండి ఆంతోనీని.'

రాజారావుమాత్రం సామాన్యుడా? మంచి తరిఫీయత్ పొందిన చెయ్యి అతనిది యీవిద్యలో.

కొంచెం హేళనగా ఆయనవంక చూస్తూ అన్నాడు:

'బలేవాడవల్లే ఉన్నావయ్యా! మంచియెత్తు ఎత్తావే! ఎక్కడనేర్చావు యీవిద్య? రంగూన్‌లో కలపవర్తకం చేస్తూఉన్న ఆంతోనీవి నీవా? నేనా? పిచ్చిపిచ్చివేషాలు వెయ్యకు. ఖబర్దార్! నువ్వు రుజువు చెయ్యగలవు నీవే ఆంతోనీవని?'

'ఓ తప్పకుండా చేయగలను' అన్నాడు ఆంతోనీ.

'చెయ్యి' అంది శాంతమ్మగారు. 'మాకు చెప్పమని ఏంచెప్పాడు మాతమ్ముడు.'

'అన్నాడు ఏసుదాసు: సుశీ చాలా తెలివైన పిల్ల. ఆమె బాగా నవనాగరికతా వాతావరణంలో పెరిగింది. ఆధునిక కవులభావములు ఆమెకు చాలా ప్రీతికరములు. మా అక్కయ్య శాంతమ్మ పూర్వకాలపు మనిషి. ఆవిడకు ఈనవీనపద్ధతులు నచ్చవు. సుశీ స్వేచ్ఛను ఎప్పుడు అరికట్టడానికి యత్నిస్తుంది. అది నవీనశాస్త్రజ్ఞులు ఒప్పుకోరు. అలాచేయకుండా సుశీని ఆదరణతో పెంచమనిచెప్పు అని'

'నీమాటలకు ఈయనచెప్పే మాటలకు సంబంధమేలేదు. నువ్వు మాతమ్ముణ్ణి అసలు ఎరుగున్నట్లేలేదు. నీవు రంగంలో రెండేళ్లమట్టి ఉన్నావంటావుగదా. మా తమ్ముడి స్నేహితుణ్ణి అంటావుగదా. ఎరుగుంటే చెప్పు ఆబ్రూచి ఎప్పుడు కొన్నాడో!' అంటూ శాంతమ్మగారు డ్రాయర్ దగ్గరకు వెళ్లుతుంది.

రాజారావుకు గాభరా యెక్కువ అవుతూవున్నది. శాంతమ్మగారు డ్రాయర్ తెరుస్తున్నది. ఈసందడిలో రాజారావు తనజేబులో భద్రపరచిన, షుమారు నూటయేభై రూపాయిల ఖరీదుగలిగి రంగూన్ కమలములతో బాగా పనితనముగా తయారుచేయబడి తమ్ముడు ఏసుదాసు తనకు ప్రెజెంటుగా పంపిన బ్రూచిని నెమ్మదిగా ఆంతోనీగారి లాంగుకోటుయొక్క విశాలమైన పక్కజేబులోకి జారవిడిచాడు.

శాంతమ్మగారు డ్రాయరంతా వెతికింది. బ్రూచి కనబడలేదు. సాధారణంగా ఆవిడ ప్రతి ఆదివారం చర్చికి వెళ్లేటప్పుడు ఆబ్రూచిని పెట్టుకునే అలవాటు. మామూలురోజులలో దాని నివాసస్థలం ఆడ్రాయరే.

'ఏమైంది నాబ్రూచి? ఈసామానంతా చెల్లాచెదరై ఉందే. సుశీ ఈసామానేమైనా సర్దావా నీవు' అంది ఆమె కోపంతో.

'నాకేం తెలియదు అత్తా. నేనెందుకు తీస్తాను.'

'మరేమైనట్లు నా బ్రూచి?'

రాజారావు మధ్యకువచ్చి 'శాంతమ్మగారూ, నాకు చాలా అనుమానంగా ఉంది. ఈపెద్దమనిషి మారు పేరు పెట్టుకుని రావడం ఇదంతా చూస్తేనాకు...'

'ఇదేదో దోపిడిబేరంలాగా ఉంది. మ్రాఘెంచి పేటలో ఈమధ్య రకరకాల దొంగతనాలు జరుగుతున్నాయట. అన్నట్లు ఇందాక చెప్పింది సందు చివరనున్న మీయమ్మగారు—'మీయింటి కెదుటనున్న లాంతరు స్తంభందగ్గర సంచాని ఎవరో మనిషి మీయింటికేసి చూస్తున్నాడు మూడురోజులనుండి. అని' 'నీవేనా ఏమిటి ఆపెద్ద మనిషివి'అంది శాంతమ్మగారు ఆంతోనీ వైపు తిరిగి.

సుసీకి ఈసంఘటనంతా చాలా అసహ్యంగా వుంది. తాను మనసారా ప్రేమించిన రాజారావు పెద్ద టక్కరని తెలిసింది ఇప్పుడు. పైగా పెద్దమనిషి ఆంతోనీ గారికి చాలాఅమర్యాద జరుగుతున్నదనికూడా తెలుసుకుంది. రాజారావునిజవిషయం తెలిసినతరువాత ఆమెకు ఆతనిపైన ప్రేమపోయి అసహ్యం కలిగింది.

ధైర్యంతో ఆమె 'అత్తా! చూడు. ఇందులో ఏదో పెద్ద పొరబాటు జరిగి ఉంటుంది.' అని అనబోతుండగానే రాజారావు అడ్డువచ్చి

'అమ్మాయీ, నీవు ఊరుకో. తొందరపడకర్లు' అని ఆంతోనీగారివైపు తిరిగి

'అయ్యా, క్షమించి మీజేబులు కాస్త చూపించండి' అన్నాడు.

ఆంతోనీగారు కోటుజేబులలో చెయ్యిపెట్టి తీసేసరికి అందులోంచి శాంతమ్మగారి బ్రూచి, బంగారపు గడియారం బయటపడ్డవి.

'చూచారా, శాంతమ్మగారు! ఈయన ఏలాటి పెద్దమనిషో. ఉండండి. ఉండండి. పోలీసులను పిలుచుకువస్తాను' అంటూ రాజారావు గది గడప దాటుతున్నాడు.

'ఏయి, ఆగు' అన్నాడు నిర్ఘాంతపోయి చూస్తున్న ఆంతోనీ.

'నీవు మద్రాసుటక్కర్లను చంపిపుట్టినట్లున్నావే?'

శాంతమ్మగారివైపు తిరిగి—'అమ్మా, నేను ఘరానా అని రుజువుచేసుకోగలను' అని అంటూ ఉండగానే రాజారావు అడ్డువచ్చి—



'చూచారా, శాంతమ్మగారు! ఈయన ఏలాటి పెద్దమనిషో.'

'రుజువు చేయిస్తా. శాంతమ్మగారూ, పోకపోకండా చూస్తూఉండండి. నేనిప్పుడే పోలీసు స్టేషన్‌కు వెళ్లి వస్తా' నని జారాడు గదిలోనుండి.

'ఏమిటే ఘోరం! శాంతమ్మగారు, వాణ్ణి అలాపోనిస్తారేమిటి? ఏమమ్మా, సుసీ, నీవు కూడా నన్ను మరిచిపోయావా? క్రిందటిసారి రంగంలో నీవు ఉన్న

ప్పుడు నా మోటారులో షికారు తీసుకువెళ్లేవాడిని కానూ ? జ్ఞాపకం లేదూ '

' లేకేమండి ' అంది సునీ. ' కాని, వీళ్లు నన్ను మాట్లాడనిస్తేనా ?'

' శాంతమ్మగారూ, మీరు తెలియదు. మీరు బాగా మోసపోయారు. ఇదిగో నాకార్డు. ' యస్. ఆంతోనీ, రంగూన్ ' అని లేదూ. చూడండి. ఇదుగో మీ తమ్ముడు వ్రాసియిచ్చిన ఉత్తరం. మీకు, సునీకి ఆయన పంపిన ప్రజంట్సు ఇవిగో అంటూ ఒక డాలర్ గొలుసును,ఒకదంతపు గాజులజతను తననలోపల చొక్కా జేబులోనుండి తీసి ఉత్తరం, తన విజిటింగుకార్డుతో సహా టేబుల్ మీద పెట్టాడు ఆంతోనీ.

శాంతమ్మగారికి యింకా నమ్మకం కుదురలేదు.

' అసంభవం. కాని దస్తూరి దాసుదేనే ' అంది ఉత్తరం చదువుతూ.

' నాకు అగోచరంగా ఉంది యిదంతా ' అంది నిస్పృహతో.

ఇంతలోకే బయట మోటారుకారు స్టార్టు అయిన చప్పుడు వినబడ్డది.

శాంతమ్మగారు అతిజాగ్రత్తగా గదితలుపు లోపల గడియవేసి, తలుపు ఆనుకొని నుంచుంది—ఆంతోనీ పారిపోతాడేమోనని.

చెయ్యడానికి ఏమీతోచక ఆంతోనీ డ్రాయింగు రూము కిటికీలోంచి చూచాడు. ముఖం కందబారింది. శరీరం వొణికిపోతుంది. పట్టరాని కోపంతో

'అయ్యో శాంతమ్మగారూ, ఆదొంగ వెధవ నా కారులో పారిపోతున్నాడు.'

డ్రాయింగురూములో వున్న గడియారం ఏడు గంటలు కొట్టింది.

---

# ఋగ్వేదీయ సూర్యవర్ణనము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

ద్యుస్థాన దేవతలలోఁ బ్రధానుఁడును, పృథివ్యన్తరిక్ష ద్యులోకములకుఁ దేజోదాయకుఁడు నైన సూర్యుని బూర్వ మహర్షు లాదిత్య సవితృ మిత్రాది రూపముల బహువిధముగాఁ బెక్కు-చోట్ల ఋక్సంహితలో వర్ణించియున్నారు. వారివర్ణనములే తరువాతి పౌరాణికాది సూర్యవర్ణనల కుపజీవ్యములై సహస్రముఖముల విస్తరించినవి. గ్రహరాజైన సూర్యునివల్లనే ఖగోళమండలి యెల్లగ్రహ తారకాదులు తేజోవంతము లగుచున్నవనియు, ఊర్ధ్వాధోలోకములను బ్రకాశింపఁ జేయు సూర్యుఁడే సకల ప్రాణిలోకమునకుఁ బ్రేరకుఁ డగుచున్నాఁడనియు, స్థావర జంగమాత్మకమైన సకల జగత్తు నభ్యుదయమునకును సూర్యుఁడే మూలమనియువారు విశ్వసించి, సవితృరూపుఁడైన యతని నధికరించి గాయత్రీచ్ఛందస్సునం దావిర్భవించిన యనాదియగు గాయత్రియనెడి సావిత్రీ మంత్రమును జపించుచువచ్చిరి. అట్టిసవిత నుద్దేశించి ఋషులు సందర్శించిన మంత్రములు వేఱు వేఱుప్రయోజనములఁ దెలుపుచు మానవుని సకలాభీష్టములు నెఱవేర్చు దేవత సవిత యను భావము వెల్లడించుచు నతి మనోహరములై యొప్పుచున్నవి.

“మిత్రదేవుఁడు వృష్టికలిగించి వివిధజంతుజాలమునకు నన్నము కల్పించుచున్నాఁడు. సకలలోకమును తెప్పపాటులేని దయాదృష్టితో నెల్లకాలము చూచుచున్నాఁడు. సంవత్సరమునకు వార్షికయాగములకుఁ గర్త యతఁడే. కావుననే యతఁడు సకలజగదాధార మగుచున్నాఁడు.” అని విశ్వామిత్రమహర్షి సూర్యునిమహిమను బొగడియున్నాఁడు.

“జగత్ప్రేరకుఁ డైన సూర్యుని మహిమయు, స్వాతంత్ర్యమును అనన్యలభ్యములు. అతఁ డుదయించు చుండుట చూచి సకలప్రాణిలోకము స్వకర్మప్రవృత్త మగును; అతఁ డస్తమించుటతోనే స్వకర్మనివృత్త మగును. అపారమైన యీప్రాణిలోకముయొక్క- ప్రవృత్తినివృత్తు లెవని యధీనములో, అట్టి సూర్యుఁడుగాక, సర్వస్వతంత్రుఁడు మహిమపూర్ణుఁడు నగు మఱియొక దేవుఁ డేఁడీ!” అనుచుఁ గుత్స మహర్షి వర్ణించియున్నాఁడు.

పూషరూపుఁడైన సూర్యుని శుక్లవర్ణము పగటిని, కృష్ణవర్ణము రాత్రిని గలిగించుచున్నవనియు దానంజేసి యతఁ డహోరాత్రనిర్మాతయై సకల జంతుజాలమునకు రక్షకుఁ డగుచున్నాఁడనియు, భరద్వాజమహర్షి వర్ణించెను. ఈవిధముగా నెందఱో మహర్షు లెన్నో

విధముల సూర్యుని ప్రశంసించి యున్నారు. వారిలోఁ బ్రస్కణ్వాది మహర్షులు గావించిన వర్ణనముల సారము కొంత గ్రహింతము.

సూర్యుఁడు హరిదశ్వుఁడనియు, సప్తాశ్వుఁడనియు, అతనిరథమున కేడుగుఱ్ఱములు కలవనియుఁ బౌరాణికవర్ణనలు గనవచ్చును. కాని, వేదములం దవి యేడురశ్ములుగాఁ జెప్పఁబడినవి. సూర్యుని యాసప్తరశ్ములే సకల జగత్ప్రకాశకము లనియు, వానికాంతి యెదుట సదృశ్యములగు నితర గ్రహనక్షత్రాదు లన్నిటికిని రాత్రికాలమం దవియే వెలుఁగు నిచ్చుచున్న వనియు, నక్షత్రాదుల వెలుఁగు సూర్యరశ్మి ప్రతిఫలనము కంటె భిన్నము కాదనియు గృహద్వారమందున్న యద్దము మీఁదఁ బడిన సూర్యకిరణములు గృహాంతర్గతమైన చీఁకటిని బోఁగొట్టి వెలుతు రిచ్చునట్లే, రాత్రులయందు సూర్యకిరణములు చంద్ర నక్షత్రాదులమీఁదఁ బ్రతిఫలించి వానిని వెలిఁగించుచు నంధకారమును దొలఁగించుచున్న వనియు, సూర్యమండల తత్త్వబోధకములైన వర్ణనలు గలవు.

తరణి యనెడిపేరు సూర్యునికి వేదమందే కలదు. ఈశబ్దమునకు సంసారము నుండి తరింపఁజేయువాఁ డనియు, ఉపాసించువారిని రోగములనుండి తరింపఁజేయువాఁ డనియు వేఱువేఱర్థములు తరువాత వెలసినవి. ఇతరుల కెవరికిని బోసలవికాని మహామార్గమునఁ బోవువాఁడు తరణియని ప్రస్కణ్వుఁడు తెలిపియున్నాఁడు. ఈ యర్థమును స్మృతు లిట్లు వివరించినవి :

“యోజనానాం సహస్రే ద్వే, ద్వేశతే ద్వేచ
యోజనే, ఏకేన నిమిషార్థేన క్రమ
మాణ నమోఽస్తుతే”

అరనిమిషములో సూర్యుఁడు రెండు వేల రెండువందల రెండామడలదూరము పోవువాఁడని బాహ్యదృష్టికి గోచరించుదానినిబట్టి స్మృతి యిట్లు చెప్పినను, ఇందలి తత్త్వమును బట్టి యిది సూర్యకాంతిగతిపరమేకాని సూర్యమండల గతిపరము కాదని తెలియనగును. మఱియు—

సకలజగదధిష్ఠానమైన పరతత్త్వము సూర్యమండలాన్తర్యామియైయున్నదని తదుపాసకులైన వైదికర్షులు భావించి యట్లు ధ్యానించుచుండెడివారు. ఈయర్థమునే—

“ధ్యేయ స్సదా సవితృమణ్డలమధ్యవర్తీ,
నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః”

ఇత్యాది ధ్యానశ్లోకములు దెలుపుచున్నవి. సాయణాచార్యులు ‘తరణి ర్విశ్వదర్శతః’ ఇత్యాది ఋక్కున కీ క్రిందివిధముగా నంతరార్థము నావిష్కరించియున్నారు.

“అన్తర్యామివై సర్వజగమును బ్రేరించు పరమేశ్వరా! సచ్చిదానందరూపా! నీవు భక్తులను సంసారసాగరమునుండి తరింపఁ జేయువాఁడవు. కావుననే నీ వెల్లముముక్షువులకు దర్శనీయుఁడ వగుచున్నావు. అధిష్ఠాన

సాక్షాత్కారముకాఁగానే, ఆరోపితము నశించునట్లుగా, ఎనఁగా, ఇది శుక్తియనెడి ప్రత్యక్షజ్ఞానము కలిగినంతనే, ఆరోపిత రజత భ్రాంతి నశించునట్లుగా, నీసాక్షాత్కారము కాఁగానే ముముక్షువులకు జగద్భ్రాంతి నశించుచున్నది. దానంజేసి ముముక్షువు లాత్మతత్త్వము గనుచున్నారు. మఱియు సూర్యాదిజ్యోతిస్సులకు నీవే కర్తవు. "చంద్రమా మనసోజాతః చక్షో స్సూర్యోఅజాయత" అని శ్రుతియే తెలుపుచున్నది.

ఇట్టినీవు చిద్రూపుఁడవై ఈ దృశ్య జగత్తు దీప్యమానమగునట్లు ప్రకాశింపఁ జేయుచున్నావు." ఈ భావమందు "తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" అను శ్రుతిచెప్పినట్లు, స్వయం ప్రకాశమానుఁడైన పరమాత్మ ననుసరించి సర్వము భాసిల్లుచున్నదనెడి భావ మిమిడి యున్నది. దీనినంతనుబట్టి సర్వజగదధిష్ఠానము స్వయంప్రకాశమునైన పరమాత్మకు సూర్యమండల మధిష్ఠానమని సకలజగత్ప్రకాశకమైన తత్తేజోవిశేషమునుబట్టి వారు చెప్పినను పరమేశ్వరుఁ డొక సూర్యమండలమందే యున్నవాఁడని వారు భావించిన ట్లెంచరాదు. సర్వజగదంతర్యామియైన పరమాత్మను వారట్లు సూర్యమండలమధ్యవర్తిగా ధ్యానించుట యుపాసకకార్యార్థమని భావించునది. ఇది సత్యమైనను, ద్యుస్థాన దేవతలలో సకలలోకప్రకాశకుఁడును, సర్వభూతజాతరక్షకుఁడును నగువాఁడు సూర్యుఁడనెడి భావముమాత్రము వైదికర్షుల వాక్కుల సర్వత్ర గోచరించుచునేయుండును. ఈ భావమును

"ప్రత్యఙ్ దేవానా"మిత్యాదిఋక్కునఁ బ్రస్కణ్వుఁ డవిష్కరించుచు, సూర్యుఁడు మరుద్దేవతలకును,స్వర్లోకవాసులకును,మర్త్యలోకవాసులకునుగూడ నభిముఖుఁడై, ఆయా లోకములను బరిశోధించుచు, అనిష్టములను దొలఁగించుచు జంతుజాలములను బోషించుచున్నాఁడని వర్ణించెను. మఱియు—

"వేదములు కర్మను బ్రతిపాదించుచున్నవి. ఆకర్మ నాచరించుటకు సూర్యుఁడాధారభూతుఁడు. రాత్రిందివకర్త యైన యతనివల్లనే యాగాదికర్మలును, కృష్యాది కర్మలును సాగుచున్నవి. ఓషధులు పెరుఁగుచున్నవి. అన్నము దొరకుచున్నది. జలము లభించుచున్నది. శరీరములు రక్షింపఁబడుచున్నవి. సకలదేవతలలో దానాదిగుణయుక్తుఁడు, దేవతలకు దేవతయునైన సూర్యుఁడు తమోదూరుఁడు, అజ్ఞానాంధకారనాశకుఁడు,దివ్యతేజశ్శాలి. అతనినుపాసించి మేము ముక్తిఁ గాంతుము" అనుచునుపాసకోక్తిగా మఱియొకఋషి సూర్యమహత్త్వము వర్ణించెను. ఆదిత్యోపాసన చేయువార లాదిత్యసాయుజ్యమును బొందుదురని శ్రుతియుఁ జెప్పుచున్నది.

ప్రస్కణ్వమహర్షి చర్మరోగబాధితుఁడై తన్నివారణమునకు సూర్యోపాసనచేసి తదనుగ్రహమున నారోగ్యవంతుఁ డయ్యెనని ఋగనుక్రమణిక తెలుపుచున్నది. అతఁడు సందర్శించిన సూర్యోపాసనా మంత్రములు మూఁడును తృచమనుపేర జగత్ప్రసిద్ధములై యున్నవి. శౌనకమహర్షి ఆమంత్రముల మహాత్త్వము నెంతేని పొగడి, తృచవిధానమునఁ సూర్యు నుపాసించువారు సకలరోగ విముక్తులై భుక్తిముక్తులు గాంతురని వర్ణించి యున్నాఁడు. "ఉద్యన్నద్య మిత్రమహ" ఇత్యాది తన్మంత్రములు భరతఖండమున నేఁటికిని సూర్యోపాసకుల కభీష్టప్రదము లగుచున్న వనుటకంటె వానినిగూర్చి ప్రశంసింపఁ బనిలేదు.

---



గానుగ D. S. R.

# వ్యంగ్య-సినీమాలు

## (Cartoon Pictures)

యన్. జగన్నాథస్వామి

గాంధీ అగ్గిపెట్టెలు, గాంధీ సిగరెట్లు మొదలయిన పేర్లల్లో గాంధీగారిపేరు ఈదేశములో ఎలా ప్రసిద్ధి అయిపోయిందో (ఖైదులో పెడతారేమో అనే భయం లేకపోతే జార్జిచక్రవర్తిపేరు ఎన్ని చిన్నవస్తువులమీద కెక్కేదో, అంతఖ్యాతి అన్నిదేశాలలోను గణించినది మికీమౌస్ (Mickey Mouse) ఒకటే.* పూర్వకాలములో కాశీమజిలీల కథలు, తదుపరి తెనాలి రామునికథలు జనసామాన్యానికి ఎంత పరిచయముగా నుండేవో, ఈ రోజులలో మికీమౌస్ సినీమా లంత వాడుక. పదిపన్నెండువేల అడుగుల ఫిల్ములు, గంటన్నరో, రెండుగంటలో కడుపుబ్బేటట్లు నవ్వించడమో కళ్లనీళ్ల పర్యంతమూ తెప్పించడమో కాకుండా ప్రదర్శనము పదినిమిషాలు పట్టకపోయినా, పడుకున్న తర్వాతకూడా కళ్లముందర గంతులేస్తూ, అయిదేళ్ల పిల్లలదగ్గరనుంచి అరవైఏళ్లపైబడ్డ ముసలివాళ్లవరకూ చిరునవ్వుతెప్పించే నిర్జీవవ్యక్తి ఈమికీమౌస్.

ఇక ఈసర్వజనస్వాగతము (Universal reception) పొందడానికి దీనియందున్న విశేషము లేమిటి అని విచారిస్తే మొట్టమొదట అందరికీ స్ఫురించేవి ఇవి:— వ్యక్తీకరణమునందలి క్రొత్తదనమున్ను (Novelty of expression), భావములందలి ప్రతిభ (Originality of Ideas) యున్ను; అనగా, సాధారణముగా నోటితో చెప్పే మాటలకంటె ఈవ్యంగ్యచిత్రము, క్రొత్తదిగాను, చిత్రముగాను (Novel) ఉండుట చేత ప్రకటన చేయవలసిన ఉద్దేశాన్ని ఎక్కువ రసవంతంగా, సులభంగా, జనసామాన్యానికికూడా నాటేటట్లుగా బోధించగలశక్తి — "మనకు తోక లున్నచో" అని ఒక వ్యాసంకంటె, తలిశెట్టి రామారావుగారి బొమ్మ లెంత తక్కువకాలములో ఆ భావాలని అందరికీ తెలియజేస్తాయో, అదేవిధంగా; ఇక రెండవది భావము లందలి ప్రతిభ (Originality of Ideas) ప్రతిక్షణము మనకు సాధారణముగా కనబడేటట్టి, అలవాటు అయిపోయినట్టి దృశ్యములలోకూడ నూతనభావాలు పుట్టించడము. మామూలుగా 'కారు' పెట్రోలు పోసుకోవడం ఎంతమందో చూచియుంటారు. అదే దృశ్యాన్ని వాల్టుడిస్నీ (Walt Disney) గారు కల్పనాశక్తిచేత, కారుని ఒక చిన్నబిడ్డలాగ, పెట్రోలు పంపును పాలబుడ్డిలాగ కనుపరచితే అది ఎంతో క్రొత్త ఉల్లాసము (Amusement) పుట్టిస్తుంది. ఇటువంటి నూతన భావసూచన అంతసులభమయిన పని కాదు. దీనికి ఎంతో కల్పనాశక్తి, ప్రతిభ ఉండాలి. ఈ రెండుగుణాలలోను అతీతుడుగనుకనే వాల్టుడిస్నీ మిగిలిన వ్యంగ్యచిత్రా లన్నిటికంటే ఎన్నియోరెట్లు ఎక్కువ ఆనందదాయకమైన సినీమాలు సృష్టించగలుగుతున్నాడు. ఈరెండు కారణాలూ కొంచెము ఆలోచించినవాళ్లెవరికైనా స్ఫురిస్తాయి. కాని నిజంగా ఆలోచించి చూస్తే ఈఫిల్ములయొక్క జనాదరమునకు ఇంకా చాలా కారణా లున్నాయి, ఈమొదట చెప్పిన రెండూ ఫిల్ముకి పునాదిలాంటివి అని ఒప్పుకోవలసి వచ్చినప్పటికీని.

ఈ ఇతరకారణాలలో ముఖ్యమయినవి రెండు: ౧. ఫిల్మ ననుసరించియుండేసంగీతము (Back Ground Music); ౨. ఆదర్శప్రాయమైన భావప్రకటన (Ideal expression).

---

* మికీమౌసు కెమేరాలేమి, మికీమౌసు క్లబ్బులేమి, మికీమౌసు క్షవరపుసెట్టులేమి......ఎన్నో!

సినిమా చూస్తూ ఉన్నంత సేపూకూడా మనకు తెలియకుండానే మనలో పరిపరిభావాలు కల్పిస్తూఉండేది సినిమా ననుసరించియుండే సంగీతము (Back Ground Music). ఒకొక్కొక్కప్పుడది సంగీతము కాక సౌండ్ ఎఫెక్ట్సు (Sound effects) అనవచ్చు. దీని యొక్క ప్రాముఖ్యమూ, ప్రేక్షకులమీద దీనికున్న శక్తీ ఉదయశంకరనృత్యములు పరీక్షించినవాళ్లకి బాగా అర్థమౌతుంది, ఒకొక్క అడుగుకీ అంగముల కదలికకూ అనుగుణమైన శబ్దము కలిస్తే (విష్ణుదాసు షిరాలీగారి యొక్క గానమువలె) ఎంత ఉద్రూతలూపింపవచ్చునో. తాండవనృత్యము, వేటకాని నృత్యము మొదలయిన వాని ననుసరించి వాయించే సంగీతము రసభరితమై ఎంత ఆవేశమూ, ఉద్రేకమూ కలిగిస్తుందో ఆలాగనే ఈసినిమాలలో కూడా సంగీతమాత్రముచేత భావోత్పత్తి కలుగచేస్తున్నారు.

ఈచెప్పిన కారణములతో సమానప్రాముఖ్యము లేకపోయినా వీటితరువాత ముఖ్యమైనది భావప్రకటన. డైరక్టరు ఎంత ఆరితేరినవాడైనా, నటీనటులు ఎంత పేరు మోగినవాళ్లయినా ముఖభావప్రకటనలో (ఒకొక్కప్పుడు నడిచే తీరులో కూడాను) డైరక్టరు మనసులోనున్నంతభావమూ నటీనటులు కనబరచలేకపోతూ వుంటారు. కాని ఈవ్యంగ్య సినిమాలలో ఆబాధలేదు. ఎంతకష్టమైన అభినయమయినా ఒక్కటే; ఒక్క కనుబొమ్మ పైకి ఎత్తించడమో, రోమాల గగుర్పాటు కనబరచడమో – సిరాతో వ్రాసిన బొమ్మలతో ఎంత ఆదర్శప్రాయముగానైనా చూపించగలడు ఆర్టిస్టు. అందుచేత చూచేవాళ్లకి బాగా నాటుతుందికూడాను. వ్యంగ్యసినిమాలని వ్యాపింపజేసే కారణము లివిగనుక వీటిని మనసులో పెట్టుకుని, సినిమాలు తయారుచేయడానికి పూనుకొంటారని వేరే చెప్పనక్కర్లేదు.

ఇక ఈసినిమాలు ఏలా తయారుచేస్తారో పరిశీలించవలసివస్తే, "ఏవో చేతితో బొమ్మలు గీసి అవి విడివిడిగా ఫోటోగ్రాఫుచేస్తా"రని అందరూ అంటూం టారు; ఎన్ని బొమ్మలు గీయాలో, ఒకబొమ్మకీ ఇంకొకబొమ్మకీ తేడా యేమిటో, మిగిలిన చిన్నవిషయాలలో ఎంతపరిశ్రమ వున్నదో ఏమీ తెలియక పోయినాను. ఈమాట దాదాపు సరిగా, ఈసినిమాలయొక్క సూత్రాన్ని సూక్ష్మంగా చెప్పేసిందన్నమాట. ఇక వివరంగా, అనుభవంలో ఒకవ్యంగ్యసినిమా ఏలా తీస్తారు అనే ప్రశ్న: సాధారణంగా ప్రతికథా — కథ అంటే ముఖ్యంగా కాళ్లులేనిదన్నమాటే, అయినా ఈసినిమా యొక్క ఇతివృత్తాన్ని ప్రస్తుతము కథయే అనవలసివస్తుంది — కులాసా పుట్టించడానికి ఉద్దేశింపబడిన దవటంవల్ల, ముఖ్యంగా ఆవేశం (Inspiration) మీద ఆధారపడివుంటుంది. అందుచేత ఈకథను కల్పించే ఆవేశముతోపాటు ఇంకా చిన్నచిన్న అపూర్వభావాలు కూడా కలిసి ఒకపూర్తి ఫిల్ముకి సరిపోయిన సరుకు చేరగానే దానికి సినారియో (Scenario-అనగా కథ సినిమాలో ఏలా కనిపిస్తే బాగుంటుందని డైరక్టరు ఆలోచించి, స్థిరపరుచుకుంటాడో ఆపద్ధతికి వ్రాసిన వివరములతో కూడిన విషయసూచి (Analysis)) వ్రాసి, దాన్ని సంగీతపు డైరెక్టరు (Music Director) చేతికిస్తే దానికి చిత్తుగా సంగీతాన్ని సరిచేసుకుంటాడు. ఈవిధముగా వ్రాసినకథలో ఎక్కడెక్కడ రసవంతమైన పట్లు ఉన్నాయో అవిమాత్రము ఒకొక్క బొమ్మతోటి, దాని ననుసరించిన వ్రాతతోటి డైరక్టరు ఉదాహరిస్తాడు. ఈ ఒకొక్కొక్కబొమ్మా, దాని కుండవలసిన అభినయమూ, సినారియో దగ్గిర ఉంచుకొని మిగిలిన బొమ్మలు గీసేస్తారు ఆర్టిస్టులు. ఆందుచేత కథలో మొదట ఏవో ముఖ్యమయిన బొమ్మలనుమాత్రమే వాల్టు డిస్నీ గారు గీస్తారు.

దీని తరువాత ఈప్రత్యేకపు బొమ్మల నన్నిటినీ కలిపి ఫిల్ము తీయడానికి ఏలా ఉపయోగించుతారో తెలిసికొనుటకుముందర మామూలు సినిమాలలోని కొన్ని చిన్నవిషయాలు చెప్పవలసివస్తుంది.

చిన్నప్పుడు బడిలో సూర్యకాంతి ఏడురంగుల యొక్క మిశ్రమమని చెప్పడానికి చూపించే సాధనాలలో ఒకటి ఏడురంగులుగా వరుసగా చిత్రింపబడినచక్రమును గిరగిరా త్రిప్పుట. కొంచెం వడిగా త్రిప్పితే అంతా తెల్లగా కనబడుతుంది. దీనికి కారణము ఏడురంగులూ

కలిస్తే తెల్లరంగవుతుంది అనేదేకాక, ఇంకొకటికూడాను. ఈయేడురంగుల ప్రతిబింబములూ కంటిలోనుండి కంటి వెనుకనున్న తెర (Retina) మీద అతి త్వరగా పడుటవలన, ఆరంగులయొక్క ప్రత్యేకపుస్మరణ నాటుకొనుటకు వ్యవధిలేక, మెదడుకి అన్నీకలిసిపోయిన తరువాతతయారయే తెలుపురంగే తెలుస్తుంది. ఇంకాసాధారణమైన ఉదాహరణకావలసివస్తే, మంచివడిగాతిరుగుతున్న ఎలక్ట్రికుపంకాలోంచి చూస్తే, అవతలివస్తువులు ఏమాత్రమూ మసగగా నుండవు, మూడేసి యంగుళముల వెడలువున్న పంకారేకులు అడ్డమువస్తూన్నప్పటికీకూడాను; ఎందుచేతనంటే, ఒకవస్తువును చూడడానికి కంటికి కొంతకాలము (దాదాపు ౧/౧౦ సెకండు) కావాలి. ఆవ్యవధిలోపుగా కంటిముందర ఇంకొకబొమ్మని పెడితే, ఈ రెంటియొక్క కలయికయే దానికి తెలుస్తుంది.

సినీమాలో తొందరగా వచ్చిపోయే దగ్గిరబొమ్మలలో, ఒకదానికీ దానిప్రక్కదానికీ కొంచెము తేడావుంటుంది. అందుచేత ఏభాగములో ఎంతమాత్రము తేడావున్నదో ఆ భాగములో అంతమాత్రము చలనమున్నట్లు కనిపిస్తుంది. ఎలెక్ట్రిపంకా వెనుకనున్నది చలనములేని కూజా అయితే, అది కూజాలాగే కనిపిస్తుంది ఎంతసేపుచూచినా.

కనుక ఈసూత్రము ననుసరించి, మికీమాసు చేయి ఎత్తాలి అంటే ఆచేయి ఎత్తడము అనే చలనము తెరమీద అరసెకండులో అయేటట్టయితే ఆ అర సెకండులోనూ టాకీలో ౧౨ బొమ్మలు (ఫిల్ముమీదవి —Frames) నడచిపోతవి గనుక, దాదాపు పన్నెండు ప్రత్యేకపుబొమ్మలలో చేయి ఎత్తడములోని చిన్న చిన్న కదలికలను (ఒకబొమ్మలోకంటె ఇంకొకదానిలో ఒక్కచూపువాసి ఎక్కువ ఎత్తినట్లు) చిత్రించి వాటిని ఒక్కొకటి ఒక్కొక బొమ్మ (ఫ్రేము) తీయవలసివస్తుంది ఫిల్ముమీద. ఇటువలెనే ప్రతిచలనానికీకూడాను. ఇక ఈయొకవిధమయిన చలనమేకాకుండా, చేయి ఎత్తడముతోపాటు ముఖముత్రిప్పడమూ, ప్రక్కనున్న వ్యక్తియొక్క అభినయమూ, వెనుక రంగము (Back ground)లో చెట్ల ఆకులు కదలడమూలాటి చిన్నవిషయాలు అన్నీ జాగ్రత్తగా గమనించి చేతితో గీచిన ఒక్కొకబొమ్మలోను ఈమార్పులన్నీ ఏయే బొమ్మలో ఎంతెంతచలనము చూపించవలసిఉంటుందో ఊహించి ఆబొమ్మలనివ్రాయాలి. ఈకష్టానికితోడు ఏదో ఒకసారివ్రాసి తప్పించుకునే అచ్చులోని వ్యంగ్యచిత్రము వలెకాక, ప్రతిబొమ్మనీ ఏవైపు(Angle)నుంచి చూచినా ముఖకవళిక మారకుండా ఉండేలాగ—అందలి ముఖభావాలు మనుష్యుల ముఖభావాలకంటె బాగుండేటట్లు — చిత్రిస్తూ ఉండడానికి నేర్పరులగు పనివాళ్లయితేనే ఉపయోగపడతారు. అటువంటివాళ్లు అనేకవందలమంది ఉన్నారు వాల్ట్ డిస్నీగారి స్టూడియోలో. కొంతకొంతమంది కొన్నికొన్ని విషయాల్లో ప్రత్యేకనైపుణ్యం గలవాళ్లు. ముఖభావాలతీర్పు చూపు సమీపదృశ్యములు (Close-ups) కొందరు, దూరదృశ్యములు (Long shots) మొదలయినవి కొందరు, పరరంగదృశ్యము (Back ground) కొందరు వ్రాస్తూంటారు ఒక్కొకకథకీని.

తెరమీద అయిదునిమిషాలకన్న అధికముపట్టని కథకు సుమారు ఏడువేలబొమ్మలు చేతితో వ్రాయవలసియుంటుంది, కొన్నివిషయాలలో తెలివితేటలతో కొంతపని తప్పించుకొన్నప్పటికీని. ఇప్పుడు ఒకవ్యక్తి రోడ్డుమీద నడుస్తూన్నట్లో, మోటారు పరుగెత్తుతున్నట్లో చూపించవలసివస్తే గీయవలసిన చిత్రముల యొక్క సంఖ్యను తగ్గించడానికి 'రెలెటివ్ మోషన్' (Relative Motion) అనే సూత్రాన్ని ఉపయోగపరుస్తారు. ఒకరైలుస్టేషనులో రెండురైళ్లున్నాయనుకుని, అందులో నొకదాంట్లో మనం కూర్చుని రెండవదాని వంక చూస్తున్నామనుకోండి, అప్పుడు ఏదోవకటి నెమ్మదిగా కదుల్తే, ఏది కదలిందో చటుక్కున చెప్పకోవడం అసాధ్యము — మనంకూర్చున్నది (కోటిపల్లి బండిలాగ) భూకంపమొచ్చినట్లు కదలకపోతేను. ఈ సంశయానికి కారణం—కదుల్తూవున్న వస్తువుయొక్క చలనము కదలకుండాఉండే వస్తువుతో పోల్చి తెలుసుకోవడం మనుష్యస్వభావం. తెల్లటిమబ్బులు చంద్రుడిదగ్గరనుంచి

పోతూంటే చంద్రుడే మబ్బులలోంచి పోతూన్నట్లు కనిపించడంకూడా ఇలాంటిదే.

ఈ పద్ధతిని, నడుస్తూ ఉండడము రెండుభాగాలుగా భాగిస్తే, నడిచేమనిషి వకటేవెనుక కదలకుండాఉన్న రోడ్డుప్రక్కదృశ్యము (Road-side scenery) వకటే క్రింద ఈ రెండిటినీ విడివిడిగా వ్రాసి తెలివితేటలుగా జరిపి ఉపయోగించుకుంటే నడుస్తూన్నట్లు కనపడ్తువచ్చు సినీమాలో. ఇందుకు నడిచే వ్యక్తియొక్క ఎడమకాలు ముందరికి వేయడము, కుడికాలు ముందరికి వేయడము అనే రెండుచలనాలకు కావలసిన బొమ్మలు ఈ ప్రక్కనుంచి ఆ ప్రక్కకు కనుపించే (Transparent) సెలులాయిడు (Celluloid)మీద గీసి వెనుక రోడ్డుప్రక్కదృశ్యము ఒక్కొక అడుగుకి అనుగుణముగా జరుపుతూంటె (నడుస్తూన్న దిశకు వ్యతిరేక దిశలో) ఎన్ని అడుగులు కావాలో అన్ని అడుగులు ఈ రెండడుగులకు వ్రాసిన చిత్రాలతోటె తీసివేయవచ్చును. ఇట్లానే మోటారు నడవవలసివచ్చినాను. అయితే వెనుకనున్న (Road-side) దృశ్యము కొంచెం వడిగా కదల్చవలసి ఉంటుంది. ఇప్పుడీవెనుక జరుపబడుతున్న తెరయొక్క వడియే, సినీమాలో కదుల్తూన్న వస్తువుయొక్క వడిగా కనబడుతుంది.

ఈయనుకూలాలన్నీ చూచుకొని ఒక్కొకసీనుకి కావలసిన బొమ్మలు ఆర్టిస్టులు ఉల్లిపొరకాగితంమీద గీస్తారు. బొమ్మలయొక్క అభినయం ఒకదాన్నుంచి ఇంకొకదానివరకు ఎలావృద్ధి అవుతోందో కాగితం మీద ఎక్కువ సులభముగా కనిపెట్టవచ్చును. ఈబొమ్మలు ఫోటోగ్రాఫు చేసేముందర సెలులాయిడు మీదికి మారుస్తారు. తరువాత ఈ సెలులాయిడు బొమ్మనీ, దీనివెనుక సెలులాయిడుమీదనే చిత్రించిన పరరంగదృశ్యము (Back Ground) నూ పెట్టి కావలసిన అభినయమునకు తగినట్లు ఈవెనుకదాన్ని జరుపుతూ ముందరబొమ్మలు ఒకటి తరువాత ఒకటి మారుస్తూ ఫోటోగ్రాపుచేస్తారు.

ఈసినీమాలకు ఉపయోగించే కెమిరాకూ మిగిలిన కెమిరాలకూ ఒకచిన్న మార్పున్నది. మామూలుగా సినీమాలుతీసే కెమిరాయొక్కపిడి ఒక్క తిప్పు తిప్పితే గేటుముందర ఎనిమిది (బొమ్మలు పట్టగల ఫిల్ము) ఫ్రేములు జరుగుతాయి. అయితే ఈసినిమాలకుపయోగించేకెమిరాలో ఒక్కొక్కచుట్టునకొక్కొక్క ఫ్రేమే జరుగుతుంది. ఇది చాలా చిన్నమార్పే (కారులలో గేరు — Gear — మార్చడంలాంటిది); కాని అత్యావసరమైనది, అంటే మామూలు కెమిరాముందర ఈబొమ్మ పెట్టి ఒక త్రిప్పు త్రిప్పితే ఎనిమిది ఫ్రేముల మీదా అబొమ్మే తయారవుతుంది. అల్లాకాకుండా ఈ ప్రత్యేకపు కెమిరాతో ఒకబొమ్మ కావలిస్తే ఒకటే, రెండు కావలిస్తే రెండూ తీసికోవచ్చు.

ఈవిధంగా ఒక్కొకబొమ్మని గీసి తయారుచేసిన సినీమాలో మాటలులేకుండగానే (Silent గానే) తెరమీదవేసి చూసుకొని, మ్యూజిక్కు డైరక్టరు (Music Director) జాగ్రత్తగా ప్రతిచిన్న అభినయానికీ, కదలికకూ కూడా అనుగుణమైన శబ్దముల నమర్చి ఆర్కెస్ట్రాలో అవి రిహార్సుచేసుకొంటాడు మొదట వ్రాసిన సంగీతముతోసహా. ఈ సమయాన్నే వాళ్లు డిస్నీ మికీమౌసులాగ మాట్లాడడానికీ, మిగిలినవాళ్లు మిగిలిన బొమ్మలలాగ మాట్లాడడానికీ తమతమ మాటనూ, ఉచ్చారణనూ ఒకసారి సరిచూచుకొని (బొమ్మలయొక్క పెదవికదలికలన్నీ పరిశీలించి - ముందరే బొమ్మలలో చిత్రించియుంటారు - మాటలాడవలసిన మాటలు - సంవాదములు (dialogues) కథతోపాటె వ్రాస్తారు గనుక) అంతా కలిపి శబ్దఫలాల (Sound effects) తోసహా రిహార్సుచేసికొని, ఆఖరుసారి సినీమా చూస్తూ ఈ శబ్దాలూ, సంగీతమూ, మాటలూ రికార్డుచేస్తారు. దీనితరువాత ఈ శబ్దాన్ని లెక్కకలరుకాపీల మీద కెక్కిస్తే మనం రోజూ చూచే వ్యంగ్యచిత్రము (Cartoon Picture) తయారవుతుంది.

---

# రేడియము

డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

## ౧

మానవవికాస మెప్పు డారంభమాయెనో ఏవి పరిస్థితులనుబట్టి మానవుడు వికాసము జెందెనో సవిస్తరముగ తెలియుటకు మనకు ఆధారములు చాలవు. కాని అనాదినుండియు మానవునికి స్వాభివృద్ధియందు ఉత్సాహము ఉండియేయుండుననని దృఢముగ వక్కాణింపవచ్చును. స్వార్థపరత్వమును, స్వాభివృద్ధియందలి ఆసక్తియు ఈరెండే మానవుని నాగరికతకు ఆధారహేతువులు.

రెండుకట్టెలనురాచి మానవుడు అగ్నిని పుట్టింపగలిగినప్పుడే నాగరికత ప్రారంభమాయెను. ఈఅగ్నియే మానవునికి తొలుదొల్త కష్టనష్టములను మిక్కుటముగ కలిగించియుండవచ్చును. కాని క్రమముగ అగ్నిని స్వాధీనపరచుకొని దానిశక్తిని ఉపయోగించుకొనుట మానవుడు నేర్చుకొనెను. ఆహారపదార్థములను పచనముచేసి రుచికరములుగ చేయుటయందును, చలిబాధ తప్పించుకొనుటయందును అగ్ని అత్యంతము ఉపయోగకరమాయెను. రానురాను కీళ్లనొప్పులకును, కాయకష్టముచే బడలి నొప్పిజెందియున్న కండరములకును కాపడ మిచ్చిన సుఖముగ నుండుననని గూడ మానవుడు కన్గొనెను.

బుద్ధివికాసము పూర్ణతనొందిన కొద్దిని మానవుడు తనదేహకష్టమును తగ్గించుకొనుటకై ప్రకృతిశక్తులను పరిపరివిధముల నుపయోగించుటకు నేర్చుకొనెను. ప్రప్రథమమున ఆవులను, ఎద్దులను, గుఱ్ఱములను మచ్చికచేసి పెంచి వాని సహాయముచే తన దేహకష్టమును చాల మట్టుకు తగ్గించుకొనగలిగెను. క్రమముగ జంతుప్రపంచమును మాత్రమేగాక ఖనిజ శక్తులనుకూడ ఉపయోగించుటకు ప్రారంభించెను. నేలబొగ్గును కనుగొనినందువలన బొగ్గులకై అరణ్యములను కొల్లగొట్ట నావశ్యకము లేకపోయెను. నేలబొగ్గనే కనుగొనకపోయియుండినచో ప్రపంచమున నున్న మితదారుశక్తియంతయు వ్యయము జెందినపిమ్మట నాగరికప్రపంచమునకు ఎట్టి విషమస్థితి ఏర్పడియుండునో ఊహింప నలవిగాదు. కాని నేడు అత్యధికముగ నేలబొగ్గు వ్యయమగుచున్నందున త్వరలో ప్రపంచమునందలి నేలబొగ్గంతయు వ్యయమై నాగరికప్రపంచమునకు పూర్వోక్తమైనట్టి విషమస్థితి ఏర్పడునేమోయని తోచును. అట్టి విషమస్థితి ఏర్పడినచో మానవుడేమి చేయగలడు? నియమిత మార్గములు రెండే గాన్పించుచున్నవి. నాగరికతనే మరచి మరల అనాగరికదశకు రావలెను. లేదా, శక్త్యాధారకమగు క్రొత్తసామగ్రిని కనుగొనవలయును. అట్టి శక్త్యాధారకసామగ్రిలో రేడియమును, అణువులును విశ్వకిరణములును ( cosmic rays ) ముఖ్యములైనవి.

రేడియమునకు అట్టి అత్యధికశక్తి ఎట్లేర్పడినదని పరిశీలించుటకు ముందు రేడియము అననేమో కొంత విశదీకరించవలెను. 1895 వ సంవత్సరమున రంజను మహాశయుడు ఎక్స్‌కిరణములను కనిపెట్టిన 3 సంవత్సరములకే (అనగా 1898 వ సంవత్సరమునందే) క్యూరి దొరయు, అతనిభార్యయు రేడియమును కనిపెట్టిరి. అనగా ఒకక్రొత్త పదార్థమును వారు తయారుచేసిరని యర్థముగాదు. ఇతరఖనిజసంపదవలెనే భూగర్భమున రేడియములోహముగూడ కలదని వారు కనిపెట్టిరి.

ఎక్స్‌కిరణముల కెట్టితీక్ష్ణవేధకశక్తికలదో అట్టి వేధకశక్తి రేడియములోహమునుండి వికీర్ణములగు కిరణములకుగూడ గలదు. స్వతఃసిద్ధముగ అట్టికిరణములను వెదజల్లు స్వభావము గల లోహములు అనేకములు అనాదిగ నున్నప్పటికిని మొన్న మొన్నటివరకును భౌతికశాస్త్రజ్ఞులు ఈ సంగతిని గమనించరైరి.

ప్రాచీనహైందవులకు 'భైషజ్యరాజ్యము' అను ఒక వస్తువు తెలిసియుండెననియు, దానియాధారముచే అప్పటివైద్యులు నేటి ఎక్స్‌కిరణచికిత్సకులవలెనే శరీరాంతర్భాగముల నన్నిటిని పరీక్షింపగల్గియుండిరనియు ఒక ఐతిహ్యముగలదు. ఈవిషయమునుగూర్చి కమ్‌స్టన్ (Cumston) అను నొక దొర తన వైద్యశాస్త్రచరిత్ర యందు ఇట్లు వ్రాసియున్నాడు.

'జీవకుడను బౌద్ధవైద్యశిఖామణి యొకడు రాజభవనమునకు జనుచుండ రాజద్వారసమీపమున రెండు కట్టెలమోపులను మోసికొనిపోవుచుండిన ఒక బాలకుని గాంచెను. ఆ బాలకుని అన్నాశయ (Stomach) పక్వాశయా (Intestines) ద్యవయవములన్నియు విశదముగ బయటినుండి గాన్పించుచున్నందున ఆత డాశ్చర్యము జెంది ఇట్లు తలచెను. "ఓషధీగ్రంథమునందు భైషజ్యరాజ్యమను ఒక ఓషధి శరీరముయొక్క బహిర్భాగమునుండి అంతరావయవములను కాన్పించునటు చేయు ప్రభావగుణమును కలిగియున్నదని చెప్పబడియున్నది. ఈ బాలకుడు మోసికొనిపోవుచున్న కట్టెలమోపులలో ఈ ఓషధీఖండము లేవైనయున్నవేమో," యని తలచి "ఓయీ! ఈ కట్టెలమోపులను విక్రయింతువా" అని ఆబాలకునడిగెను. "ఔను"ని యాబాలకు డారెండుమోపులను ఆరు నాణెములకు జీవకునికి అమ్మివైచెను. ఆమోపులను తలనుండి దించగనే ఆబాలకుని అంతరావయవములు జీవకునికి గన్పించవాయెను. జీవకుడు పరమానందముతో ఆమోపులనురెంటిని విప్పి అందు ఒకొక కట్టెను ఆబాలకునిముందుంచి పరీక్షింపసాగెను. ఎట్టకేలకు అందు రెండు కట్టెలకు మాత్రము ఈ విచిత్రగుణముండుటగని జీవకుడు ఆ రెంటినిమాత్ర ముంచుకొని మిగతవానినన్నిటిని ఆబాలకునికే ఇచ్చివేసెను.[౧]

ఈ ఐతిహ్యము బయలుదేరుటకు ఏమికారణము లుండునో తెలియకున్నది. హైందవార్యుల కీవిషయమునుగూర్చి ఏమితెలిసియుండినను క్యూరీదంపతులే ఈ లోహములను కనిపెట్టినవారిలో ప్రథములని ఒప్పికొనక తీరదు.

కిరణోద్గారకరములగు (Radioactive)

లోహములనుండివచ్చు కిరణములన్నియు ఒక్కటే విధములైనవనియు లోహపుపరిమాణమునుబట్టి కిరణతీక్ష్ణతయు, పరిమాణమును హెచ్చుచుతగ్గుచునుండునవనియు తొలుదొల్త తలంచిరి. కాని ఒకపలుచనికాగితమును ఈకిరణముల కడ్డముగబెట్టినచో కిరణముల రిమాణము (volume) తగ్గునని త్వరలో విశదమాయెను. ఒక కాగితమునుండి దూరిరాగల కిరణములకడ్డముగ మరెన్ని కాగితములను అడ్డుపెట్టినను ప్రయోజనము లేకపోయెను. కాని ఒకపలుచని లోహపురేకును అడ్డుపెట్టిన మాత్రమున కిరణములపరిమాణము తగ్గుచుండెను. ఒకమిల్లిమీటర్ దళసరిగల సీసపురేకుగుండ దూరిపోగలకిరణములకు అత్యంతవేధకశక్తి యుండెను. అట్టికిరణములు కిరణసముదాయములో అత్యల్పభాగమేమై యుండెను.

పరిశోధనలు జరిగినకొద్ది జ్ఞానమతిశయించి ఈ లోహములనుండి మూడువిధములగుకిరణములు వికీర్ణములగుచున్నవని తెలిసెను. మొదటిహానిని ఆల్ఫాముక్కల (Alpha particles) ని యందురు. ఇవి నిజముగ కాంతికిరణములుగావు; హీలియము (Helium) యొక్క కేంద్రములు (neuclei). ఇవి ఒకసెకండునకు రమారమి ౯౦౦౦ నుండి ౨౦,౦౦౦ మైళ్ళవేగముతో వికీర్ణములగును. ఇవి వికీర్ణములైనవెనువెంటనే వీనివేగము తగ్గి తాము ప్రయాణించుచున్న మార్గమధ్యమునందలి ద్రవ్యాణువులతో (atom of elements) సంఘర్షణము జెంది, అందు రెండేసి విద్యుదృణపరమాణువులను ఆకర్షించి ఇంచుమించుగ హీలియము అణువులుగ మారిపోవుచున్నవి. ఇవన్నియు ఒక్కటే వేగముతో వికీర్ణములగుచున్నవి గనుక గాలిలో ఇవేవియును చాలదూరము ప్రయాణింపజాలవు. యురేనియము (Uranium) లోహమునుండి వికీర్ణములగు ఆల్ఫాముక్కలు (Alpha part-

---

౧. ఈవిషయమును నాకు తెలియజేసినందునకు డాక్టర్ డి. నారాయణరావుగారికి నేనెంతయు కృతజ్ఞుడను. ప్రాచీన హిందూవైద్యశాస్త్రమునుగూర్చిన యనేకవిశేషాంశములు వారి అముద్రిత ప్రసూతితంత్రమునం దున్నవి.

icles) మాత్రము ౨.౬ సెంటిమీటరులని దూరమును, థోరియము 'సి' (Torium C) నుండి వచ్చు ఆల్ఫాముక్కలు ౮.౬ సెంటిమీటరుల దూరము మాత్రమే ప్రయాణించగలవు. సాధారణ కాగితమునుగూడ ఇవి భేదించుకొనిపోజాలవు.

రెండవరకపు కిరణములకు బీటాకిరణములని (Beta Rays) పేరు. ఆల్ఫాముక్కలవలెనే ఇవి కూడ నిజముగ కిరణములుగావు. కాని ఆల్ఫాముక్కలకంటెను ఇవి చాల తేలికైనవిగాన వానికంటె చాల దూరము ప్రయాణించగలవు. ఇవి విద్యుదృణ పరమాణువులవంటివేగాని అత్యధిక వేగముతో ప్రయాణించుశక్తి వీనికి గలదు. కొన్ని కిరణోద్గారకరవస్తువులనుండి (Radio-active substances) వచ్చు బీటాకిరణములు వెల్తురుకిరణముల (Light Rays) వేగముతో సమానముగ ప్రయాణించగలవు. అట్లు ప్రయాణించిన కాలదని ఇవి తమప్రయాణశక్తిని గోల్పోయి విద్యుదృణపరమాణువులవలె మారుటకు పూర్వము ద్రవ్యములందు చాలదూరము వేధించుకొనిపోగలవు. వీనిలో వేగవంతమైనవి సుమారు ఒక సెంటిమీటరుదూరము మన దేహభాగములను భేదించుకొని పోగలవు. కాని ౩ మిల్లిమీటరుల దళసరిగల ఇత్తడిరేకును గాని ౧ మిల్లిమీటరు దళసరిగల బంగారు రేకునుగాని ఇవి చొరచుకొనిపోలేవు.

మూడవరకపు కిరణములే గామాకిరణములు (Gamma Rays). ఇవి ఎక్స్‌కిరణములవలెను, వెల్తురుకిరణములవలెను నిజముగా కిరణములే. వీనికెరటపు నిడివి (Wavelength) మిక్కిలి తక్కువయగుటచే వీనికి వేధకశక్తి మెండు. సుమారు ౨౫ సెంటిమీటరుల దళసరిగల సీసపురేకునుగూడ ఈకిరణములు చొచ్చుకొని పోగలవు.

ఈకిరణము లెచ్చటినుండి వికీర్ణములగుచున్నవి? ఎందువలన కొన్నిపదార్థములే ఈకిరణములను వికీర్ణము జేయుచున్నవి? కొన్నికిరణోద్గార కరపదార్థములు (Radio active substances) ఏల వివిధములగు కిరణములను వికీర్ణము చేయుచున్నవి? కిరణ వికీర్ణతచే శక్తిహీనమైనపిమ్మట ఈపదార్థముల కేమగును? అను నీయంశముల నిప్పుడు చర్చించవలెను. కాని ఆచర్చకు పూర్వము గతసంచికయందు విశదీకరించిన అణుసిద్ధాంతమును మరల నొకతూరి మనము జ్ఞాపకమునకు తెచ్చుకొనవలయును.

అణువు విద్యుద్వికారమనియు, అణుకేంద్రమగు (atomic nucleus) విద్యుద్ధనపరమాణుసముదాయము చుట్టును, వాని పరిమాణమునుబట్టి విద్యుదృణపరమాణువులు సూర్యునిచుట్టును గ్రహములవలె తిరుగుచుండునని యు గతవ్యాసమున తెలిసికొంటిమి. ఇట్లు తిరుగు విద్యుదృణపరమాణువుల సంఖ్యనుబట్టియే అణుసంఖ్యను నిర్ధరించి అన్నిటికన్న క్లిష్టమైన యురేనియము అణువునకు ౯౨ వ సంఖ్యను, రేడియము అణువునకు ౮౮ వ అణువు సంఖ్యను ప్రాణవాయువు (Oxygen)నకు ౮ వ సంఖ్యను, హీలియము (Helium) అణువునకు ౨ వ సంఖ్యను, హైడ్రొజిన్ (Hydrogen) అణువునకు ౧ వ సంఖ్యను ఒసంగితిమి.

ఇంతవరకును కేంద్రము (nucleus) చుట్టును తిరుగు విద్యుదృణపరమాణువులనుగూర్చియే చర్చించితిమిగాని, కేంద్రమునుగూర్చి విశదీకరించమైతిమి. కేంద్రము ధనశక్తి పూరితమనియు దాని పరిమాణమునుబట్టి బయటతిరుగు ఋణపరమాణువులసంఖ్య మారి ధనఋణశక్తులు (Positive and Negative forces) సమానప్రమాణమును బొందుచుండుననియు తెలిసికొంటిమి. గాని కేంద్రము సమగ్రముగ ధనశక్తి యుతమని యనుకొనరాదు. ధనశక్తియే కేంద్రమునందు ప్రధానముగనున్నను కొంతఋణశక్తిగూడ ఋణపరమాణువుల (Electrons) రూపముగ కేంద్రమునందున్నది. అట్టి ఋణపరమాణువులు ధనపరమాణువులతో అవినాభూతముగ కలిసి కేంద్రమునందే యుండును. ఉదాహరణముగ యురేనియము అణువును గైకొందము. ఇందు ౨౩౮ ధనపరమాణువులును, ౨౩౮ ఋణపరమాణువులును ఉన్నవి. గాని కేంద్రముచుట్టును ౯౨ ఋణపరమాణువులుమాత్రమే తిరుగుచుండుననిఇదివరకే తెలిసికొంటిమి.

౧. ఒక అంగుళమనగా ౨.౫ లేక ౨.౫౪ సెంటిమీటరులు.

కనుక మిగిలిన ౧౪౬ ఋణపరమాణువులును కేంద్రము నందే ధనపరమాణువులతో అవినాభూతముగ చేరి యున్నవని యర్థము. వివిధములగు అణువులనుగూర్చి చర్చించునపుడు కేంద్రముచుట్టును తిరుగు ఋణపరమాణువుల సంఖ్యనుబట్టి నిర్ధరించబడిన అణుసంఖ్యయే ఆధారమైనట్లు, కేంద్రమునుసరించిన చర్చలందంతటను, అణువుయొక్క భారమే (Atomic weight) ఆధారమైనది. హైడ్రొజన్ అణువు (Hydrogen atom) యొక్క భారము ౧. యురేనియము అణువుయొక్క భారము ౨౩౮. రేడియము మొదలగు పదార్థముల యొక్క అణువులయొక్క భారము క్రింద పట్టిక నందు ఇవ్వబడినది.

## యురేనియము జాతి

| ద్రవ్యము | అణుభారము | విశీర్ణము | అర్ధజీవితకాలము |
|---|---|---|---|
| యురేనియము ౧ | ౨౩౮ | ఆ | ౪,౬౭,౦౦,౦౦,౦౦౦సంవత్సరములు |
| యురేనియము ఎక్స్ ౧ | ౨౩౪ | బీ+గా | ౨౪.౬ దినములు |
| యురేనియము ఎక్స్ ౨ | ౨౩౪ | బీ+గా | ౧.౧౫ నిమిషములు |
| యురేనియము జడ్ | ౨౩౪ | బీ+గా | ౬.౭ గంటలు |
| యురేనియము ౨ | ౨౩౪ | ఆ | ౨౦,౦౦,౦౦౦ సంవత్సరములు |
| అయోనియము | ౨౩౦ | ఆ | ౬౯,౦౦౦ సంవత్సరములు |
| రేడియము | ౨౨౬ | ఆ | ౧,౬౯౦ సంవత్సరములు |
| రాడను | ౨౨౨ | ఆ | ౩.౮౫ దినములు |
| రేడియము ఏ | ౨౧౮ | ఆ | ౩.౦ నిమిషములు |
| రేడియము బి | ౨౧౪ | బి+గా | ౨౬.౮ నిమిషములు |
| రేడియము సి | ౨౧౪ | ఆ+బి+గా | ౧౯.౭ నిమిషములు |
| రేడియము సి ౧ | ౨౧౪ | ఆ | ౦.౦౦౦౦౦౧ సెకండు |
| రేడియము సి ౨ | ౨౧౦ | బి+గా | ౧.౩౨ నిమిషములు |
| రేడియము డి | ౨౧౦ | బి+గా | ౨౫ సంవత్సరములు |
| రేడియము ఇ | ౨౧౦ | బి+గా | ౫.౦ దినములు |
| రేడియము ఎఫ్ (పొలోనియము) | ౨౧౦ | ఆ | ౧౩౬.౩ దినములు |
| రేడియము జి (సీసము) | ౨౦౬ | ఈలోహము | అవస్థాభేదము నొందదు |

ఆ=ఆల్ఫాముక్కలు, గా=గామాకిరణములు, బి=బీటాకిరణములు.

ఒక అణువుయొక్క భారమంతయు ఇంచుమించుగ దానియందలి ధనపరమాణువులభారమే. కావునే ఒక పదార్థపుఅణువుయొక్క మానము ౨౨౬ అన్నవెంటనే, ఆపదార్థమునందలి ధనపరమాణువుల భారము హైడ్రొజన్ ధనపరమాణువుయొక్క భారమునకన్న ౨౨౬ రెట్లు అధికమని యర్థము. ధనపరమాణువులన్నియు ఒక్కటేరకముగాన పైపదార్థమునందు, హైడ్రొజనునందున్నట్టి ధనపరమాణువులు ౨౨౬ ఉన్నవని విశదమగుచున్నది. వీనిధనశక్తికి సమానమగుఋణశక్తి ఈఅణువునందుండుటకై ఇందు ౨౨౬ ఋణపరమాణువులుకూడ ఉండియేతీరవలయును. అట్లు ౨౨౬ ఋణపరమాణువులు ఈపదార్థపు అణువునందున్నను వానిలో ౮౮

# 'రేడియము' చిత్రములు

శస్త్రచికిత్సకు సాధ్యముగాని గొంతుకింద లేచిన గడ్డ



మేరీ క్యూరి—౧౮౬౭-౧౯౩౪



చికిత్సకు పూర్వపుస్థితి



చికిత్సానంతర స్థితి

టాన్సిలువద్ద లేచిన అపాయకరమైన వ్రణము



చికిత్సకు పూర్వపు స్థితి



చికిత్సానంతర స్థితి

## ఎపిథిలియోమావ్యాధి : Squamous Epithelioma



చికిత్సకు పూర్వపుస్థితి



చికిత్సానంతర స్థితి

## ఎపిథిలియోమావ్యాధి : Epithelioma of the Cheek



చికిత్సకు పూర్వపుస్థితి



చికిత్సానంతరస్థితి
(వారమురోజులు మాత్రమే చికిత్స చేయబడెను)

మాత్రమే కేంద్రముచుట్టును తిరుగుచున్నవి. మిగిలిన ౧౩౮ ఋణపరమాణువులును ధనపరమాణువులతో అవినాభూతముగ జేరి కేంద్రమునందే యున్నవి ఇదియే రేడియము అణువు.

ఇటీవల జొలియొ (Joliot) ఐరన్ (Iren) అను క్యూరీదంపతుల అల్లుడును బిడ్డ యునుకలసి విద్యుత్ సమపరమాణువు (Neutron) లను ముక్కలను కనిపెట్టియున్నారు. వీనియందు ఒక ధనపరమాణువును ఒక ఋణపరమాణువును అత్యంత సన్నిహితముగ కరచుకొనియుండును. ధన, ఋణపరమాణువుల ప్రమాణము సమానముగ నున్నం దున వీనియందలి విద్యుచ్ఛక్తి సమస్థితియందుండును గానవే వీనిని విద్యుత్ సమపరమాణువులు(Neutrons) అని యందురు. హైడ్రొజిన్ అణువునందుగూడ ఒక టే ధనపరమాణువును ఒక ఋణపరమాణువును ఉన్నను అచ్చటి ఋణపరమాణువు కేంద్రమగు ధనపరమాణువు చుట్టును వలయాకారముగ తిరుగుచుండును, గాని దానితో కలసియుండదు.

బెరిల్లియము (Beryllium) లోహముపైన ఆల్ఫాముక్కలను ప్రవహింపజేసినచో ఈ విద్యుత్ సమ పరమాణువులు వికీర్ణములగును. వీనికి గామాకిరణముల కన్న మిక్కుటమగు వేధకశక్తిగలదు. దీనిబట్టి తెలిసిన దేమన ద్రవ్యాణువు ధన ఋణపరమాణు నిర్మితమై నను కేంద్రమునందుమాత్రము ఈ ధనఋణపరమాణు వులు ఆల్ఫాముక్కలరూపముగనో, లేక విద్యుత్ సమపరమాణువులరూపముననో యుండును.

సుఖగ్రాహ్యమని యగుపడు అణువెంత క్లిష్టనిర్మాణ భూయిష్ఠమో చూచితిరా? దీనియందలి ధనపరమా ణువులు ఒకదానితోనొకటి కలియవు. ఋణపరమాణు వులుగూడ ఒకదానితోనొకటి కలియవు. కాని ధన పరమాణువులును, ఋణపరమాణువులును ఒకటినొకటి యాకర్షించును. ఈ యాకర్షణ వికర్షణములతో నొప్పారు అణువునందు అనుకూల ప్రతికూలశక్తు లన్ని యు ఒకదానితోనొకటి మిళితములై అణువునందలి విద్యుచ్ఛక్తి సమస్థితి (Neutral state) యందుండ గలుగుట విశ్వవిచిత్రములలో నొకటియని అనుకొన వచ్చును.

యురేనియముఅణువును కొంత పరిశీలింతము. దీనికేంద్రముచుట్టును తిరుగు ౯౨ ఋణపరమాణువులు గాక, కేంద్రమునందు ౧౪౬ ఋణ పరమాణువులును ౨౩౮ ధనపరమాణువులును ఒకదానినొకటి యాకర్షిం చుచు వికర్షణముచేయుచు ఎట్లుండగలవో యర్థముగుట కష్టతరము. ఈ అణువుకన్న క్లిష్టమైన అంతర్నిర్మాణము గల అణువును ఇదివరకు ఎవరును కనిపెట్టలేదు. యురే నియము అణువుయొక్క అంతర్నిర్మాణము ఇంత క్లిష్టమైనదిగానవే ఇది నియతస్థితియం దుండజాలక యవస్థాభేదము నెల్లప్పుడును చెందుచునేయుండును.

౨౦౮ కంటె ఎక్కువ అణుభారముగల పదార్థ ము లన్నియు యురేనియమువలెనే అవస్థాభేదమును చెందుచునేయుండును. ఈమార్పునకు కారణము చాల మట్టుకు వీనియం దత్యధికముగనుండు ధనఋణపరమాణు వుల సంఖ్యయేయైనను, ఆధనఋణపరమాణువు లొకటి తోనొకటి కలిసియుండువిధానముకూడ కొంతమట్టుకు కారణమేయని తోచుచున్నది. కానవే యురేనియము అణువున కున్నంత క్లిష్టమైన అంతర్నిర్మాణములేని లోహములుగూడ కొన్ని యురేనియమునకన్నను త్వరగ అవస్థాభేదమును చెందుచున్నవి. ఈ అవస్థాభేదము అణువుకంతటికిని సంబంధించినను ముఖ్యముగ కేంద్రము ననే ఈ మార్పు అధికముగ గోచరమగును. ఈమార్పు వలన అణువులు ఒకతరగతినుండి తక్కువశక్తిగల ఇంకొకతరగతి అణువులుగ మారుచుండును.

అవస్థాభేదముచెందుటలో అణువునుండి కొంత శక్తి విమోచనమగుచున్నది. పరిసరపరిస్థితుల కేమాత్ర మును సంబంధములేకనే స్వతఃసిద్ధముగ నవస్థాభేదమును చెందుట కిరణోద్గారకర (Radio active) పదార్థము లకు ముఖ్యలక్షణము. ఈలోహములకు క్రమక్రమముగ సంభవించు నీయవస్థాభేదము, వాని యణువులలో కొన్ని నియతకాలమున ఆకస్మికముగ ఇట్లు మార్పుచెందుట

వలననే సంభవించుచున్నది. ప్రతికిరణోద్ధారకర పదార్థమును ఒక నియతవిధానము ననుసరించి ఈ మార్పును బొందుచున్నది. ఆవిధానముమాత్ర మెప్పటికిని మారదు.

అణువుయొక్క కేంద్రమునందు సంభవించుమార్పు రెండువిధములుగ పరిగణించుచున్నది (౧) మొదటిది అణువునుండి హీలియముకేంద్రమువలెనే యుండు ఒకముక్క బహిర్గతమగుట. దీనినే ఆల్ఫాముక్కయని ఇదివరకే చెప్పియున్నాను. దీని అణుభారము ౪ గాన దీని బహిర్గమనమువలన అణువునకు ౪ ప్రమాణములభారము తక్కువయగును. అనగా ౨౩౮ అణుభారముగల యురేనియము అణువునుండి ఒకఆల్ఫాముక్క బహిర్గతమైనచో యురేనియముఅణువుయొక్క భారమునందు ౪ తగ్గి ౨౩౪ మాత్రము మిగులును. దీనివలన దానికి అవస్థాభేదము సంభవించి యురేనియము ఎక్సులోహముగమారును. (౨) రెండవమార్పు ఏదన ధనపరమాణువులతో మిళితమై[3]కేంద్రమునందుండు ఋణపరమాణువులలో నొకటి అణువునుండి బహిర్గమనము చెందుట. దీనిఅణుభారము అత్యంతహ్రస్వముగాన దీని బహిర్గమనమువలన అణుభారము ఏమాత్రమును తగ్గదు. బీటాకిరణములు వికీర్ణములైనపుడెల్ల గామాకిరణములు కూడ వికీర్ణము లగుచుండును.

ఇదివరకును సుమారు ౪౦ విధములగు కిరణోద్ధారకర పదార్థములను కనుగొనియున్నారు. వీని కొకదానితో నొకటి కుండు పరస్పరసంబంధములనుబట్టి వీనిని యురేనియముతెగ (Uraniam series), థోరియము తెగ (Thorium Series), ఆక్టినియముతెగ (Actenium Series) అని మూడుతెగలుగ విభజింపవచ్చును. ఆక్టినియముతెగ నిజముగ యురేనియముతెగలో నొకశాఖయేయని జెప్పవచ్చును. రేడియము, యురేనియముతెగకు చేరినదిగాన ఈ తెగనుగూర్చి ఇంకను కొంత తెలిసికొందము.

రసాయనశాస్త్రపద్ధతిని పరిశీలించినచో ఈ కిరణోద్ధారకరపదార్థములన్నియు(Radio-active substances) మూల ద్రవ్యములే (Elements) యని చెప్పవచ్చును. ప్రతిదానికిని ఒక నియత అణుభారము గలదు. ఇవి ఇతరపదార్థములతో గలసి మిశ్రపదార్థములుగ మారునపుడు మూలద్రవ్యములవలెనే ప్రవర్తించును. అవస్థాభేదమును చెందునంతవరకు వీనివిశిష్టత (identity) విశదముగ నుండును.

వీని అణువులకు సంభవించు మార్పులవల్లనే ఇవి యవస్థాభేదమును చెందుచున్నవని మనకిదివరకే తెలియును కాని ఇందువల్ల వీని అణువు లన్నియు ఒకచేతూరి పేలి (explode)శైథిల్యమును జెందునని తలచరాదు. ఒకగురిగింజయంత తూకముగల రేడియమునందు ఎన్నియో అణువులున్నవిగాని వానిలో చాల కొద్దిభాగముమాత్రమే ఒక్కొకతూరి పేలును. కనుక ఒకపదార్థమునందలి అణువులలో ఒక అణువును దీసి ఇది ఎంతకాలము అవస్థాభేదమును జెందకుండ యుండగలదని నిరూపించుటకు సాధ్యముగాదు. దానిజీవితము కొన్ని నిమిషములుమాత్రమే గావచ్చును. లేదా కొన్ని వేల సంవత్సరములైనను గావచ్చును.

కాని పరిశోధనలవల్ల ఒకొక కిరణోద్ధారకరవస్తువునందలి అణువులును రమారమి ఎంతకాలముండవచ్చుననువిషయమును శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు. ఒక రేడియము అణువుయొక్క సరాసరి జీవితకాలము ౨౪౦౦ సంవత్సరములు. యురేనియముతెగలో రేడియమునకు ముందుండు పదార్థమేమాత్రమును కలిసియుండని ఒక తులము రేడియమును తీసియుంచినచో దానియందుండు రేడియము క్రమముగ తగ్గిపోవుచుకడకు ౧౬౯౦ సంవత్సరములైనపిదప పరీక్షించిచూచిన ఒకతులములో సగభాగము రేడియము శిథిలమైయుండును. మిగిలిన అరతులము రేడియమును క్రొత్తరేడియమువలెనే ప్రవర్తించుచు దానిలో సగభాగము అనగా ౧/౪ తులము రేడియము ఇంకొక ౧౬౯౦ సంవత్సరములకు శిథిలమగును. ఇట్లనే ఆపాతికలో సగముతగ్గుటకు ౧౬౯౦ సంవత్సరములు పట్టును.

---

3. యురేనియమునకున్న గుణములే కొన్ని దీనికికూడ యున్నందున దీనిని యురేనియము ఎక్సు అనియందురు.

ఈవిధముగ పరీక్షించినచో ప్రతి కిరణోద్గారకర పదార్థమునకును ఒకనియత అర్థజీవితకాలమును నిరూపింపవచ్చును. పైజాబితాను జూచినచో ఈ పదార్థముల యర్థజీవితకాలము ఒక సెకండులో స్వల్పభాగము నుండి కొన్నివేల కోట్లవేల సంవత్సరములవరకు మారవచ్చునని తెలియుచున్నది. కాని పైని విశదీకరించినట్లు అర్థజీవిత కాలమును సరిగ నర్థము జేసికొనకున్నచో పొరబాటు కలుగును. రాడను అర్థజీవితకాలము ౩.౮౫ దినములని యన్నచో ఒకతులము రాడనులో సగభాగము ౩.౮౫ దినములలో శిథిల మగుననియు, మిగిలిన యర్థమును ౩.౮౫ దినములలో శిథిలమై ఒకవారమురోజులలో ఏమియు మిగలదనియు అర్థముగాదు. వారము రోజులైన పిమ్మటకూడ కొంతరాడనులో ఇంకను నూటియందు ౨౮.౩౬ భాగములు మిగిలియుండును.

స్వతఃసిద్ధములగు మార్పులతో రేడియము ఎట్టియవస్థాభేదములను చెందుచున్నదో కొంతపరిశీలింతము. రేడియము అవస్థాభేదమును జెంది రాడనుగ మారునని పైజాబితాయందు గోచరించును. అవస్థాభేదముచే రేడియమే రాడనుగమారినను ఈ రెంటికిని చాలభేదము గలదు. రేడియముయొక్క అర్థజీవితకాలము ౧౬౭౦ సంవత్సరములు. రాడనుయొక్క అర్థజీవితకాలము ౩.౮౫ దినములు. రేడియము ఘనపదార్థము. రాడను వాయుపదార్థము.

౨౨౬ అణుభారముగల ఒకరేడియము అణువు ౪ అణుభారము గల ఆల్ఫాముక్కను (అనగా హీలియము కేంద్రమును) వికీర్ణముజేసి అందువల్ల కొంతభారమును గోల్పోయి ౨౨౨ అణుభారమునుగల రాడనుగ మారుచున్నది. ఈ మార్పువల్ల అతిచంచలమైన మూలద్రవ్యమగు రేడియములోహము మారి రాడను హీలియము అనురెండు జడమైన వాయుపదార్థములుగ పరిగణింపబడినది. దీనిలో హీలియము చాల తేలికైనది. రాడను చాల బరువైనది. అణువుకేలి ఈవిధముగ శిథిలమగుటలో అత్యధికమైనశక్తులు పాల్గొనియుండును. గాననే ఏవిధముగను ఈ పరిణామమును ఆపుదలచేయుటకును పెంపొందించుటకును సాధ్యముగాదు.

రసాయనశాస్త్రదృష్టిని రాడనుఅణువు జడమైన వాయుపదార్థమైనను అదియు కిరణోద్గారకరపదార్థమే గాన త్వరలో ఒక ఆల్ఫాముక్కను వికీర్ణముజేసి మార్పు జెంది రేడియము 'ఎ'గను హీలియముగను మారును. ౨౨౨ అణుభారము గల రాడనుఅణువు ఒక ఆల్ఫాముక్కను గోల్పోయినది గాన రేడియము 'ఎ'యొక్క అణుభారము ౩౧౮. ఈ పదార్థము ఘనపదార్థమగు లోహము గాన రాడను నుంచిన పాత్రలప్రక్కలకు అంటుకొనియుండును. అవస్థాభేదముచే రేడియము 'ఎ' ౨౧౪ అణుభారముగల రేడియముబిగను హీలియముగను మారును. ఈ అవస్థాభేదముచే ఉద్భవించుపదార్థములందు ఒక్కొక్క దాని అణుభారమును దానిమాతృకయొక్క అణుమానమునకన్న ౪ తక్కువ. ఈ పరిణామమునందే వ్యక్తిత్వముచెందిన హీలియముయొక్క అణుమానము ౪ అని ఇదివరకే తెల్పియున్నాను.

రేడియము బి చెందుమార్పు ఇంతవరకు జరిగిన మార్పులకు భిన్నమైనది. ఇంతవరకును జరిగినమార్పు హీలియము ముక్కల వికీర్ణమువల్ల సంభవించినది. దానికి బదులుగ ఇప్పుడు బీటాకిరణములును, గామాకిరణములును వికీర్ణములగుచున్నవి. ఈవికీర్ణకాంతులు మూలద్రవ్యవస్తువు (Element) గాదు; గాన ఈ మార్పువలన సంభవించిన పదార్థ ముక్కలే. గాననే రేడియము సి, రేడియము బి అణుభారములకు ఏ మాత్రమును భేదములేదు. ఈ అణుభారము ౨౧౪ అని ఇదివరకే చూచితిమి. ఇట్లే పై పటమునందు చూపబడిన రీతిగ నవస్థాభేదములచే రేడియము సి క్రమముగ రేడియము జి గ మారును. దీ కిని సీసమునకును భేదమేలేదు.

కిరణోద్గారకర పదార్థములకు సంభవించు ఈక్రమపరిణామమును పరిశోధించి నిర్ధరించినవారు రూదర్ ఫర్డ్, సాడ్డీమహాశయులు. దీనివల్ల మూలద్రవ్యములకు ఒకదానితో నొకటికున్న సంబంధము విశదమై దీనికంతటికిని ఒకక్రమపద్ధతి సంభవించెను. రేడియమును కనిపెట్టినపిమ్మట తెలిసినశాస్త్ర సంగతు లన్నిటికన్నను ఇదియే అత్యంతప్రాముఖ్యమైనది.

రోగనిదానమునందును, చికిత్సయందును రేడియము ఎంతముఖ్యమో గతసంచికయందు ఇదివరకే తెలిపియున్నాను. సామాన్యకిరణములు చొరరాని ప్రదేశములకు చొచ్చుకొనిపోవుశక్తి ఎక్స్‌కిరణములకే అంతయధికముగనున్న ఎక్స్‌కిరణముల కెరటపు నిడివికన్న మిక్కిలితక్కువ కెరటపు నిడివిగల గామాకిరణములకు వేధకశక్తి ఇంకెంత యధికముగనుండునో మనమే యూహించుకొనవచ్చును. కాని ఎక్స్‌కిరణములను తయారుచేయుపద్ధతులు అభివృద్ధిజెందినకొలదిని రేడియము చేయుపనిలో చాలభాగము ఎక్స్‌కిరణములే చేయగలవు. గామాకిరణములకున్నంత వేధకశక్తి ఎక్స్‌కిరణములకు లేకపోయినను ఇటీవల తయారగుచున్న కొన్నికొన్ని ఎక్స్‌కిరణముల గొట్టములచే అత్యధికవేధక శక్తి గల ఎక్స్‌కిరణములు తయారగుచున్నవి.

రేడియమును కనిపెట్టిన ప్రప్రథమమునందు చర్మవ్యాధుల చికిత్సకొరకై రేడియమును చాల ఎక్కువగ ఉపయోగించుచుండిరి. కాని ఇటీవల ఎక్స్‌కిరణములనే ఈవ్యాధిచికిత్సకొరకు అధికముగ నుపయోగించుచున్నారు. ఇందులకు రేడియముయొక్క వెలయే ఒక కారణమై యుండనోపు. ఐనను సూదులరూపముననో, లేక బీజముల రూపముగనో రేడియమును ఇప్పటికిని ఉపయోగించుట సర్వసామాన్యము.

చాలకాలముగనుండు ల్యూకీమియా (Chronic Lukeamia) వ్యాధియందు కడుజాగ్రత్తగ రేడియము నుపయోగించినయెడల చాల మేలుకలుగును. గాయము వలన మాత్రముగాక మరివి ఇతరకారణములవలన రక్తప్రవాహము కలుగుచున్నను రేడియమును ప్లీహముపైన ప్రయోగించి రక్తస్రావమును ఆపవచ్చును. శస్త్రచికిత్సచేయుటకు వీలుగాని, హాజికిన్సువ్యాధి (Hodgkins disease) ఆక్టినొమైకోసిస్ (Actinomycosis) లింఫోసార్కోమా (Lympho sarcoma) వంటి వ్యాధులందు రేడియము చాలమట్టుకు గుణమును గనపర్చి బాధ తగ్గించును. శస్త్రచికిత్స జరిగినపిమ్మట ఒకొకతూరి సంభవించు తీక్ష్ణ పారొటైటిస్ (Acute parotitis) వంటి అంటువ్యాధులకు రేడియముచికిత్స చేయవచ్చును. అట్లనే రేడియము రాచపుండ్లను, ఇతర పురుపులను వ్రణములను వాని ప్రథమావస్థయందే పసులునట్లు చేసి నివారింపజేయగలదు. నాలుకమీదగాని, నోటిమీదగాని, పెదవిమీదగాని, శ్వాసనాళముమీదగాని, పురుషమర్మస్థానమునందు గాని విషవ్రణము (Cancer) ప్రారంభమైనయెడల శస్త్రచికిత్స చేయసాధ్యముగాదు. అట్టి సందర్భములందు రేడియమే శరణాగతి.

సరిగ నుపయోగించినయెడల రేడియము దేహమునందలి జీవాణువుల (cells) కేమాత్రమును హానియొనరించక విషవ్రణదుష్టములగు అణువులను మాత్రమే నాశనమొనరింపగలదు. జీవాణువులకు హానియొనరించుటకు ఎంతపరిమాణము రేడియముశక్తి కావలయునో అంతకంటె చాల తక్కువ పరిమాణపుశక్తితోనే విషవ్రణపు అణువులు (Cancer cells) నాశనములగుచున్నవి. రేడియము ఏవిధముగ ఇట్లు చేయగలుగుచున్నదో తెలియరాదు. కాని కొన్నిరోజులు రేడియముతో చికిత్సయొనరించినపిమ్మట విషవ్రణపు అణువులు పెరుగుటయే నిలచి గుణము గాన్పించును.

పరిశ్రమయందుగూడ రేడియము అత్యంత ఉపయోగకరమైనను అంతయధికముగ ఉపయోగింపబడకుండుటకు దానివెలయే ముఖ్యకారణము. లోహపదార్థముల యంతర్నిర్మాణమును పరిశోధించుటకు రేడియము నుపయోగించినను ముఖ్యముగ శాస్త్రపరిశోధనలందే రేడియము ఎక్కువగ ఉపయోగపడుచున్నది. రసాయనశాస్త్రీయవిభజనమునందు (Chemical analysis) రేడియము మిక్కిలి ఉపయోగకరము. బహుపదార్థయుతములైన ఘనద్రవపదార్థము లెయ్యవియో రేడియముచే నిర్ణయింపవచ్చును. కణములను (molecules) అణువులను (atoms) పరిశోధించునపుడు రేడియము ఎంత ఉపయోగమో తెలుసుకొనుటకు భౌతిక రసాయనశాస్త్రజ్ఞాన మధికముగనున్నగాని సాధ్యముగాదు.

రేడియమును ఉపయోగించువారు ఎంతజాగరూకులై యుండవలెనో ఎక్స్‌కిరణములనుగూర్చి వ్రాయు

నపుడే తెల్పితిని. అనుభవశాలికాని వైద్యుడు రేడియము నుపయోగించినచో రోగికిని చికిత్సకునికిని ఇద్దరికిని ముప్పువాటిల్లగలదు.

రేడియము లోహముగనులలో దొరకును. ప్రప్రథమమున జర్మనీదేశమునందలి జోఆఖిమ్‌స్థాల్ (Joachimsthal) నందును, ఇంగ్లాండునందును మాత్రమే ఇట్టి గనులున్నవని యనుకొనిరి గాని త్వరలోనే అమెరికా యందును ఇట్టిగనులను కనుగొని చాలరేడియమును బయటికితీసిరి. ౧౯౧౩ వ సంవత్సరమునందు ఆఫ్రికాఖండము నందలి బెల్జియమువారి స్వాధీనమునందుండు కాంగో దేశమున శ్రేష్ఠమైన రేడియముగనులను కనిపెట్టిరి. ఇప్పుడు ప్రపంచమునకంతటికిని కావలసిన రేడియములో నూటికి సుమారు ౯౫ భాగములు ఈ బెల్జియము కాంగోగనులనుండియే వచ్చును. హిందూదేశమునందు రేడియము గనులున్నవా లేవాయని ఇంకను పరిశోధింపలేదు.

రేడియము లోహము తెల్లనిరంగుకలది. కాని ఇట్టిపరిశుద్ధస్థితిలో అది అత్యధికముగ కిరణములను వికీర్ణముజేయుచు అతిత్వరగ రేడియము హైడ్రాక్సైడ్ (Radium Hydroxide)గ మారిపోవును. కనుక చికిత్సకొరకు ఉపయోగించు రేడియము రేడియముక్లోరైడ్ లవణరూపముగనో (Radium chloride salt) లేక రేడియము బ్రోమైడ్ (Radium bromide) లవణరూపముగనో ఉండును.

ఇవిరెండునుగాక రేడియమునుండి సంభవించు రాడనును చిన్నచిన్న గొట్టములలోచేర్చిపెట్టి ఉపయోగింతురు. అధికధనమును వ్యయముచేసి రేడియమును కొనలేని ఆస్పత్రుల కిది ఎంతయో అనుకూలము. మదరాసునందలి జనరల్ ఆస్పత్రియందు రాడన్‌ను చేర్చిపెట్టగల యంత్రమున్నది. గాన మదరాసునకు వచ్చుటకు వీలులేనివారుకూడ తామున్నచోటికే రాడనును తెప్పించుకొని రోగమును కుదుర్చుకొనుటకు సాధ్యము కాగలదు.

చికిత్సవిషయమున ఏ ఏ వ్యాధులకు ఎంతెంత రేడియము అవశ్యకమగునో ఒకలండను ఆస్పత్రి కార్యదర్శి ఈ విధముగ పరిగణించి చెప్పెను. నాలుకయందు విషవ్రణమువచ్చిన సుమారు ౬౦౦౦ రూపాయల విలువయగు రేడియమును, మెదడునందలి విషవ్రణమునకు ౧౫,౦౦౦రూపాయల విలువయగు రేడియమును, స్తనమునందలి విషవ్రణమునకు ౨౦,౦౦౦ రూపాయల విలువయగు రేడియమును ఉపయోగించవలెను. ఆయావ్యాధులకు అంతంత రేడియము ఉపయోగింపవలసివచ్చినను ఇదివరలో తెలిపినట్లు రేడియముయొక్క అర్ధజీవితకాలము చాల ఎక్కువయే గనుక అట్టి ఉపయోగమువలన దానిలో తరుగుదల చాల స్వల్పముగ నుండి ఏ మాత్రము నష్టముకలుగదు. అయినను ఇంత ఎక్కువమొత్తము వ్యయముజేసి రేడియమును కొని ఉంచుటకు మన దేశములో చిన్నచిన్న ఆస్పత్రులకును, డాక్టరులకును సాధ్యముగాదు.

ఈవ్యాసమును ముగించుటకుపూర్వము ఎక్సుకిరణములను కనిపెట్టిన రంజను జీవితచరిత్రను గూర్చియు, రేడియమును కనిపెట్టిన మేరీక్యూరి జీవితమును గూర్చియు కొన్ని విషయములైన తెలిసికొనుట యుక్తము.

రంజనుమహాశయుని బాల్యముననే యతనివిద్యాభివృద్ధికి అత్యధికముగ నాటంకము లేర్పడెను. యుట్రెక్ట్ (Utrecht) అను నగరమునందు పాఠశాలలో చదువునప్పుడు తన యొకానొక బాల్యనేస్తుని రంజను యధికారుల ఆగ్రహమునకు పాలాయెను. ఈయపరాధమున ఇతని భాగపరులగు బాలురెవ్వరో ఇతడు చెప్పకయ్యె గాన నియమబంధముగు ఆపాఠశాలనుండి అధికారులితనిని వెడలగొట్టిరి. ఇక రంజనుకు కళాశాల ప్రవేశింపవలెనన్న నొకటే మార్గ ముండెను. ఒక పరీక్షయం దుత్తీర్ణుడైన యెడల పాఠశాలయందు పఠింపకున్నను కళాశాల యందు ప్రవేశింప వీలయియుండియుండును. కాని రంజనుడు ఆపరీక్షయందుత్తీర్ణతబొంద లేక పోయెను. నియమనిబంధనలకు లోనైన అప్పటివిద్యావిధానము ఈ మేధావి యందున్న విజ్ఞానము ప్రకాశింపకుండునట్లు సాధ్యమగునంతవరకును ప్రయత్నించెను. కడకు ఇతడు పి హెచ్. డి. (Ph. D.) డిగ్రీని పొందినపిమ్మటకూడ ఉర్జుబర్గు (Wurgburg) విశ్వవిద్యాలయము ఇతని

సామర్థ్యమును గణించక ఇతనికి ఉద్యోగ మివ్వక పోయెను. కాని ఇట్టికష్టములు రంజను మనస్సును జ్ఞాన జిజ్ఞాసనుండి త్రిప్పజాలకపోయెను.

ఎక్సుకిరణములను కనుగొన్నపిమ్మట ఇతనికి వేరు విధములగు కష్టము లారంభమాయెను. ఈ కిరణములతో బ్రతికియున్నవారి ఎముకలను కండరములను చూచుటకన్న అసహ్యకరమగునదియును, నింద్యమగునదియును అగుకార్యము లేదని కొందరు ఇతనిని ద్వేషభావముతో చూచుచువచ్చిరి. మరికొందరు ఇతనిని హాస్యము చేయ నారంభించిరి. వార్తాపత్రికలలోను, నాట్యరంగములందును ఇతనిని గురించి పలుమారు ప్రస్తావించుచు హాస్యముచేయుచు పద్యములు వ్రాయుచు వెతలబెట్టుట వాడుకఆయెను. కాని ధీరచిత్తుడగు రంజనుడు ఇట్టిపరాభవములకు విసుగు చెందక ఇట్టికష్టములకు అధైర్యపడక భౌతికశాస్త్రాభివృద్ధియందే ఏకాగ్రచిత్తుడై ఇట్టి ఘనకార్యముల నొనర్చి మానవాగ్రేసరులలో నొకడాయెను.

రేడియమును కనిపెట్టిన క్యూరిదొరసాని తన పరిశోధనలో భాగస్వామియు, రేడియముశాస్త్రము నందలి మహామహులలో నొకడును నైన తన మగని గురించి వ్రాసిన పుస్తకమందు వీరిద్దరును పడినకష్టములనుగూర్చి చదివిన కన్నీరుగారును. రేడియమువంటి ఒక క్రొత్తలోహమును కనిపెట్టి, తనదేశముపేరిట దానిని పొలోనియము అని నామకరణముచేసి, రేడియము తేజస్సునుగూర్చి ఎంతయోకృషిజేసి కీర్తిగడించియున్నను వీరిద్దరును తమ పరిశోధనలు సల్పుటకు కూడ ధనము లేక చాలబాధపడిరి. ఏపదార్థములనుండి రేడియము తయారుచేయనగునో ఆ పదార్థములను కొనుటకు గూడ ధనములేకపోయెను. కాని పరిశోధనయందున్న ఉత్సాహము తగ్గలేదు. పరిత్యక్తమైన ఒక చిన్నగుడిసెను వీ రద్దెకు తీసికొనిరి. జీర్ణమైనదగుటచేత పైనకురిసిన వర్షపు నీరంతయు ఎప్పుడును గుడిసెలోనే యుండెడిది. పరిశోధనజేయుటకు గుడిసెలో స్థలము చాలకపోయెను. కనుక ఆ చలిదేశములో వీరి పరిశోధనలు గుడిసెబయట జరుగవలసివచ్చెను. దినములకొద్ది, వారములకొద్ది వీరిద్దరే ఇద్దరు తమపరిశోధనలందే మునిగితేలుచు తాము ఏదైన క్రొత్తవిషయమును కనిపెట్టిన ఆనందములో మునుగుచు తమగర్భదారిద్ర్యమును మరచిరి. కడకు వీరిని పలుకరించువారుకూడ లేరైరి. ఇంత కష్టపడి కనిపెట్టిన వీరివిషయములవల్ల వీరి కేలాటి ద్రవ్యాదాయమును గాలేదు. ఎక్సుకిరణములను కనిపెట్టిన రంజనువలెనే వీరుకూడ ఉన్నదున్నట్టుగ తమ విజ్ఞానము నంతయును ప్రపంచమునకు దానముచేసిరి. ఇది అని అననేల? ఈ రేడియమునుండి వచ్చుకిరణముల స్వభావములను పరిశోధించుటకై పియరిక్యూరీ తన చేతినే ఈ కిరణములతో కాల్చుకొని చాలబాధపడెను. కాని అతడు చనిపోవుటకు రెండుసంవత్సరములముందు వరకు అతడు ద్రవ్యసంబంధమైన కష్టములను పడుచునేయుండెను.

ఇట్టి జీవితచరిత్రలే మానవాదర్శప్రాయములు. పాశ్చాత్య విజ్ఞానాభివృద్ధికి కారణమే ఇట్టి మహనీయుల జీవితచర్య. కష్టములకోర్వక దారిద్ర్యమునకు వెఱగుజెందక అపహాసమునకు విసుగించక ముఖస్తుతికి లోనుగాక జీవిత సర్వస్వము ధారపోసి జ్ఞానజిజ్ఞాసకై, జ్ఞానాభివృద్ధికై అనేకులు పాటుపడినందుననే పాశ్చాత్యదేశములు ఇప్పుడు ప్రపంచమున ఉన్నతస్థానము నలంకరించినవి. జ్ఞానమే బలము. హిందూదేశము బలవంతము గావలెనన్నచో మనము విజ్ఞానార్జన చేయుటయేగాక విజ్ఞానాభివృద్ధికికూడ తోడ్పడవలెను.

---

# గురునానకు

## శ్రీ విక్రమదేవ వర్మ

మహమ్మదీయులలో నానా సంప్రదాయములు సృష్టింపంబడుచుండఁగా హిందువుల ప్రభతోడఁ బ్రతిభ దఱుఁగుచుండఁగా జగదీశుఁడు గురునానకును భారతమునకుం బంచెను. కలదు గదా గీతయందు:-శ్లో. యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత! అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం. అని.

ధర్మసంరక్షణార్థము భారతముయొక్క పూర్వభాగమునందు శ్రీ చైతన్యదేవుఁ డవతరించినప్పుడె పశ్చిమభాగమునందు మహాత్ముఁడయిన నానకావిర్భవించెను. నానకు క్రీ.శ. ౧౪౬౯ యందుఁ బంజాబంతర్గతమగు లాహోరుజిల్లాలోని రావీనదీతీరమున నున్న తిలోండియనెడి యూర జనించెను. ఆగ్రామముయొక్క యాధునికనామధేయము రాయపురము. అది శిఖుల తీర్థస్థానము. దానిని వారు "నాన్‌కానా సాహెబ్" అందురు. సాహే బనుపదము గురుముఖిభాషయందు సమ్మాననీయార్థబోధకము. కనుక "నాన్‌కానాసాహే" బనఁగా మాననీయ నానక జన్మస్థానమని యెఱుంగనగును. ఆయన "ఖత్రి" కులమునఁ బుట్టెను. అతని తండ్రి కరణకార్యము నేయుచుండిన "కాలు" అను వాఁడు; తల్లి తృప్త. నానకు దన యేడవ యేఁట నొక్కనాఁడె యక్షరమాలికను నేర్చి తలంపునకై దాని నొక పద్యముగా రచించెనఁట! అతని కౌదార్యము సహజగుణము. ఒకప్పు డతనితండ్రి యతనికి నలుబదిరూపాయలిచ్చి యుప్పును గొనితెమ్మని పంపఁగా నతఁ డా పైకమును క్షుధితసాధువుల పోషణమునకై వినియోగించెను. అదిగని యతని తండ్రి కపురతాలాంతర్గతమగు సుల్తానాపురమునందున్న యతని సోదరియింటికతనిని బంపించివేసెను. అప్పుడాపురమునన వాబుగా నున్న దౌలతఖానుని కొలువునందుఁ గోశాధ్యక్షపదవి యతనికి లభించెను. అప్పుడును గూడ ధనాగారమునుండి ధనమును వెచ్చించుచు నతఁడు సాధుజన పోషణము నెరపఁ దొడంగెను. దాని నెఱింగి నావా బాతనిపైని ధనాపహరణదోషము మోపి శిక్షింపనెంచి నిలువ పైకమును లెక్కలను బరిశీలింపఁజేయ సర్వమును సరిగా నుండెనఁట! అతఁడు దన పదునాఱవయేఁట సులక్ష్మియను సాధ్విని వివాహమాడెను. ఆ దంపతులకు హారిచంద్రుఁడును లక్ష్మీదాసుఁడు నను నిద్దఱు పుత్త్రులు గలిగిరి.

అతఁడు దన ముప్పదియాఱవయేఁట గృహస్థాశ్రమమును బరిత్యజించి మర్దానా,

లహానా, బాలా, రామదాసులను నలుగురు శిష్యులతో నేకేశ్వరమతమును బ్రకటించుచు దేశాటనము సేయఁదొడంగెను. ఆశిష్యులలో మర్దానా పంచమ కులజుఁడు. ఈశ్వరుఁ డొక్కఁడేయనియు, నందఱకు నేకేశ్వరారాధనమె కర్తవ్యమనియు, విగ్రహారాధనమును బహుదేవోపాసనమును నిష్ప్రయోజనములనియు, జాతిభేదము వలదనియు, సతీదాహమును నిర్బంధవైధవ్యమును మాదకద్రవ్యసేవనమును ధూమ్రపానమును శిశుహత్యయుఁ బరనిందయుఁ దీర్థయాత్రయును నిషిద్ధకర్మములనియు, రాజభక్తియుఁ గృతజ్ఞతయుఁ బరోపకారమును న్యాయవర్తనమును నిష్పక్షపాతమును సత్యవాదిత్వమును సరళత్వమును గర్తవ్య కార్యములనియు నాతని బోధనములు. అతని శిష్యసంఖ్య క్రమక్రమముగాఁ బెరుఁగసాగెను. అసహిష్ణువులయిన పిశునుల పలుకులను పాటించి డిల్లీ పాదుషాయయిన యిబ్రాహీములోడి యామహాత్ముని జెఱసాలయందు నుంపించెను. ఇబ్రాహీమును బేబరు క్రీ॥ శ॥ ౧౫౨౬ నందు గెలిచిన పిమ్మట నతఁడు కారాగృహముక్తుఁడయి నిజగృహమునందు సన్న్యాసిగానె కొంతకాలము నివసించెను.

అతఁడు జలంధరజిల్లా యందుఁ గర్తారపురమను నామముతో నొకపట్టణ మేర్పఱిచి యందు నొక ధర్మశాలను బ్రతిష్ఠించెను. ఆ స్థలమునందె యాతఁడు క్రీ॥ శ॥ ౧౫౩౯ యందుఁ గీర్తిశేషుఁడయ్యెను. అతఁడు వేమనయోగివలెఁ దన్నె సంబోధించుచు గీతరూపముగా లోకమున కుపదేశించుచుండెను. అతఁడొక యాశుకవియై యుండెను. మఱియు నాతఁ డొకప్పుడు సన్న్యాసివేషముతోడను మఱొకప్పుడు ఫకీరువేషముతోడను నుతబోధనము సేయుచుండెను. అతనిమతావలంబకులను నానకపంథి జనులు లేక నానకసాహిజనులు లేక శిఖులందురు. అతఁడు నిజమతప్రచారము సేయుచు జగన్నాథక్షేత్రము కటకము, చెన్నపురి, సింహళము, లాహోరు, డిల్లీ, కురుక్షేత్రము, కామరూపము, బృందావనము; కాశ్మీరము, పేషవారు, హరిద్వారము, హిమాగశిఖరము, బాగ్దాదు, మక్కా మొదలగు పెక్కు ప్రదేశములందుఁ బర్యటనమొనర్చెను.

అతఁడు హరిద్వారమున కరిగినప్పుడక్కడఁ గొందఱు పూర్వముఖులయి గంగానదియందు జలతర్పణము సేయుచుండుటగని తాను బశ్చిమాభిముఖుఁడయి జలతర్పణము సేయుచుండ నట్లు సేయుటకుఁ గారణము గొందఱడుగఁగా గొంతదూరమునఁ దనకొక పొలముగలదనియు దానిపంట యెండకుండుటకై నీరు వోయుచున్నవాఁడననియు నతఁడు చెప్పఁగా వారు నవ్వసాగిరి. అదిగని మీరేల నీరు వోసెదరని యతఁ డడుగఁగా మేము పితృదేవతలకై తర్పణముసేయుదు మనిరి. "మీరు వోయు జలము పరలోకముననున్న పితరులకుఁ జేరుచుండఁగా నేను వోయు జలము గొంత దవ్వుననెయున్న పొలమునం

థైరాయిడ్ గ్రంథి విషవ్రణము (Malignant disease of the Thyroid glands)



ఈ ఎక్స్‌కిరణచిత్రమున చికిత్సనిమిత్తము పెట్టిన రేడియము సూదులు చూడనగును (ముందరి దృశ్యము)



పైచిత్రము పార్శ్వ దృశ్యము

ఆహారనాళమున గలిగిన విషవ్రణము (Cancer of Oesophagus)



విషవ్రణమున్నచోట నాళము మధ్యభాగము చెడినట్లు
ఈ ఎక్స్‌కిరణచిత్రమున చూడనగును



చికిత్సకొరకు ఆహారనాళములోపల ప్రవేశపెట్టబడిన రేడియం సూదులు

ఉమ్మిగ్రంథుల (Salivery glands) విస్రవణము



చికిత్సకొరకు పెట్టిన రేడియము సూదుల ఎక్స్‌కిరణచిత్రము

Illustrations through the Courtesy of Dr. P. Rama Rao, Director of Radiological Institute.

దలి పంటకుఁ జేరదా?" యని యతఁడు నుడి
వెను. అతని భావగర్భితోపదేశము నెఱింగి
వారు స్తబ్ధులయిరి. అతఁడు దేవాలయముల
కును మసీదులకును బ్రతిషేధము లేక పోవు
చుండెను. అతఁ డొకనాఁడు జగన్నాథాలయ
మున కేగఁగా నపుడు శ్రీస్వామికి నారతి
యిచ్చుచుండుటగని యాభావముగల గీతము
హిందీలోఁ బాడెను :—

ప్రభువ ! నింగి నీ కారాత్రిపాత్రము, నుడు
చయము దాపినముత్తెముల్, శశియు రవియు
వెలుఁగు కపురంపు ముక్కలు, మలయపవన
మతులధూపంబు, వనసుమవితతి సుమము
నజపగాయత్రి భేరియు, ననిల మొప్పు
చామరంబునై తనరారు జగమునందు.

అతఁడు గొన్ని యద్భుత కార్యములను
జేసెను. అతఁడు మక్కాకు వెళ్లి "కాబా"
మందిరమువైపు పాదములనుజాఁచి పండుకొని
యుండ నొక మహమ్మదీయుఁడు దేవుని వైపు
పాదములను జాఁచుట పాతకమనెను. అది
విని దేవుఁడు లేనిదిక్కున నా పాదముల
నుంచుమని నానకనఁగా నమ్మహమదీయుఁ
డాతని పాదముల నేదిక్కున కీడ్చియుంచెనో,
యా దిక్కుననె యామందిరముండుట గనుం
గొననయ్యెనఁట ! అతఁడు కటకమునందు
మతబోధనముసేయ నచ్చటి ప్రభు వతని
మతమునం దాసక్తుండగుట యెఱింగిన యా
ప్రభుని గురుఁడు కుపితుఁడయి నానకును
శిక్షించుటకొరకు శాఖోటశాఖను గైకొని
యతని వాసస్థానమయిన "కాళియాబోదా"
యను స్థలమునకు వెళ్లి యతని ప్రభావ
మునుగని లజ్జితుఁడయి యాకొమ్మ నక్కడనె
పడవేసి మరలిపోయెను. అంత నానకు
"నా దంతధావనముకొఱకు నీ కొమ్మను భగ
వంతుఁ డిచ్చె"నని చెప్పుచు నా కొమ్మనుండి
యొక పుడుకనువిఱిచి దానితోడఁ బలుదోమి
దాని నక్కడఁ బాతిపెట్టెను. ఆ పుడక
మొలచి రెండున్నరమూరల విరివిగలచెట్టయి
నేఁటికి నక్కడ వర్ధిల్లుచున్నది. అంత విరివి
గల చెట్టాజాతియందుఁ గానరాదు. దానిని
శిఖులు "దాంతన్ సాహెబ్" (మాననీయ
మగు పలుదోము పుడుక) అనియు, దాని
యొద్దనున్న మఠమును "గురుద్వారదాంతన్
సాహెబ్" అనియు నందురు. గురునాన
కెన్నియో మహిమలను గనంజేసెను. వాని
నన్నింటిని వ్రాయఁబూనినచో నొక పెద్ద
పొత్తమగును.

ఆయన నిజమరణసమయ మాసన్న
మగుట దెలిసికొని తనశిష్యులలో లహనా
యనువానికి "అంగదుఁ" డను నామ మిడి
యతనిని దనపీఠమున కధిపతిగాఁజేసి యతని
శిరముపై ఛత్రమును దాను స్వహస్తముతోడఁ
బట్టెను. అతని శవమును దహించుటకు
హిందూశిష్యులును బూడ్చుటకు మహమ్మ
దీయశిష్యులును గోరఁగాఁ దనశవముపై నొక
దుప్పటిని గప్పి యొకప్రక్కఁ గొన్నిపూలను
హిందువులును రెండవప్రక్కఁ గొన్నిపూలను
మహమ్మదీయులు నుంచి వెళ్లి, మఱుచటి

దినమువచ్చి చూచునపు డెవరిపూలు వాడి యుండవో, వారు దమ మతాచారానుసార ముగాఁ దన యంత్యక్రియను జరిగింపవలెనని చెప్పి యాయన పరమపదము సేరెను. శిష్యు ల్లొనర్చి మఱునాఁడు వచ్చిచూడఁగా నిరు పక్కలపూలును వాడకయె యుండెను. ఆ దుప్పటి నెత్తిచూడ దానిక్రింద సమ్మహాత్ముని శవము లేకపోయెను! అంత నారెండుతెగలవా రెవరిపూలను వారె గ్రహించుటయె కాక, యాదుప్పటిని రెండుతునకలుగాఁ జీల్చి చెఱి యొకతునకను గొని చని రావీనదీతీరము నందు హిందువు లొకయాలయమును మహ మ్మదీయు లొక "సమాధి" ని నిర్మించి వాని యందు నాయాపదార్థముల నిడిరి. నానకు ప్రతిమార్చనవిరోధి. కనుక నతనితరువాత జను లర్చనాసక్తులుగాకుండుటకుఁ గాఁబోలు జగదీశుఁ డాయాలయమును సమాధిని నేటి పాలు గావించెను. గురునానకుని మతము హిందువుల యొక్కయు మహమ్మదీయుల యొక్కయు నేకేశ్వరమతమె. అతని తరు వాతఁ దొమ్మండ్రు గురువులయిరి. మూడవ గురువయిన రామదాసుఁడు రామదాసపుర మను పేర నొకపట్టణ మేర్పఱచి యందు "అమృతసర" మను సరస్సును ద్రవ్వించెను. అతని కొడుకును నాలుగవ గురువునయిన యర్జునుఁ డక్కడ నొక స్వర్ణాలయమును గట్టించి యందు శిఖుల ప్రథమధర్మగ్రంథమగు "గ్రంథసాహేబు" నుంచెను. మఱియు నందుఁ గబీర, నానక, రామానందప్రభృ తుల బోధనగ్రంథములు గలవు.

శిఖులకుఁ గకారపంచక మవశ్యధార ణీయము:— ౧. కేశము (నిండుజుట్టు); ౨. కంగాయి (దువ్వెన); ౩. కచ్ఛము (కచ్చ); ౪. కడా (చేత నినుపకడియము); ౫. కృపా ణము (ఖడ్గము).



## ౮. ఐశ్వర్యభావము

ఐశ్వర్యభావమును నిరూపించు ముఖ్యరేఖ ధనరేఖ. ఆరేఖకుగలిగిన వివిధశక్తుల గత వ్యాసములో నిరూపించియున్నాను ఈ వ్యాసములో తద్భావమునకు మూలాధారము లైన ధనరేఖను, రవిరేఖనుగూర్చి చెప్పెదను.

ధనరేఖకు రవిరేఖ సోదరరేఖవంటిది. ధనరేఖ ధనమునకు, రవిరేఖ కీర్తికి సంబంధించినను రెండును సోదరరేఖలై ఒకటిలేని లోపమును రెండవది సవరించుకొనుచుండును. ఆరెండురేఖలును గలిగియున్నవారు నిక్కమగు సుఖజీవులయి యుందురు.

ఈ రెండురేఖలును ఒకేస్థానమున బుట్టవచ్చును. లేకున్న రవిరేఖ 1. ధనరేఖలోనుండిగాని, 2. జీవితరేఖలోనుండిగాని, 3.




పటము ౧

అరచేతికి నడుమను కుజస్థానములోగాని, 4. శిరోరేఖపైనుండిగాని, 5. హృదయరేఖ పై నుండిగాని, 6. బుధస్థానమునకు క్రిందనున్న కుజస్థానమునుండిగాని, 7. శుక్రస్థానములో నుండిగాని పుట్టవచ్చును. 8. చంద్రస్థానము లోనుండికూడ పుట్టవచ్చును.

(చూ: 1-వ పటము)

ఈ రేఖ యుండుటవలన ధనరేఖ లేని లోపము తీరును. చాలామందికి యీరేఖ కనబడదు. అట్టివారు సాధారణజాతకులు. అఖండైశ్వర్యవంతులుగాని, విశేషవిఖ్యాత పురుషులుగాని కాకపోవచ్చును. అది లేనంత



పటము ౨

మాత్రమున పెద్దలోపమని చెప్పరాదు. ఆరేఖయున్నచోట కీర్తిసంపాదనము సులభసాధ్యమగును. మొత్తముమీద నీ రెండు రేఖలకును ఫలితము లొక్కమాదిరినే చెప్పవచ్చును. ఆరేఖల వివిధఫలితములు, ఏకఫలితములు యిందు వివరించెదను.

ఈ రేఖలు చంద్రస్థానములో బుట్టి పైకి పోయినచో ధనాధికారము స్త్రీపై నాధార పడియుండును. (చూ: 2-వ పటము)



పటము 3

ఈ రేఖలు జీవితరేఖలో బుట్టిన మానవుడు స్వప్రయోజకత్వమున వృద్ధిలోనికి వచ్చును. (చూ: 3-వ పటము)



పటము ౪

ఈ రేఖలు శుక్రస్థానములో బుట్టిన ఆత్మీయులవలన ధనలాభము, అనగా వారసత్వాదికము లని కొంతవఱకు చెప్పవచ్చును.

(చూ: 4-వ పటము)

ఈ రేఖలు అరచేతిమధ్యనున్న కుజస్థానములో బయలుదేరిన ఆజాతకునకు జీవితములో నడిమివయస్సునుండిగాని ధనార్జ



పటము ౫

నము గలుగదు. అట్టివాడు విశేషశ్రమల కోర్చి ధనార్జనము చేయవలసియుండును.

(చూ: 5-వ పటము)



పటము ౬

ఈ రేఖలు శిరోరేఖపైనుండి పుట్టినచో ఆజాతకుడు తన తెలివితేటలవలనను, మనోదార్ఢ్యమువలనను నభివృద్ధిలోనికి వచ్చును.

(చూ: 6-వ పటము)

ఈ రేఖలు బుధస్థానమునకు క్రిందనుండు కుజస్థానములోనుండి పుట్టిన, ధనరేఖను వ్యాజ్యములవల్లను, శత్రువులనుండియు ధనము సంపాదించునని చెప్పవలెను. రవిరేఖ అక్కడనుండి పుట్టినచో అట్టివారు సహజమైన నటీ



పటము ౭

నటులై విస్తారమైన యశస్సును సంపాదించు కొందురు. (చూ: 7-వ పటము)

ఈ రేఖలు హృదయ రేఖపైనుండి పుట్టిన సుమారు 45 సం॥ ప్రాంతములనుండి యైశ్వ



పటము ౮

ర్యము పట్టును. జీవితములో ఉత్తరభాగమే సౌఖ్యవంతమై పూర్వభాగము రెండువంతుల జీవితము కష్టభాజనమై యుండును.

(చూ: 8-వ పటము)

ఈరవిరేఖనే విద్యారేఖయని మనలో పెక్కండ్రు వాడుదురు. విశేషవిద్య లేనిచోట్ల గూడ నీరేఖ కనబడుచున్నది. కావున నిది విద్యారేఖ యని పిలువరాదు.

ఈ రేఖలు అరచేతిక్రింద పుట్టి శిరోరేఖ కడ సాగిపోవుట కలదు. అట్టిచో జాతకుడు



పటము ౯

బుద్ధిపూర్వకముగా నైశ్వర్యమును బోగొట్టు కొనునని చెప్పవలెను. (చూ: 9-వ పటము)



పటము ౧౦

ఈ రేఖలు హృదయరేఖక్రింద నాగి పోయినచో స్త్రీమూలమున నైశ్వర్యము పోవునని చెప్పవలెను. (చూ: 10-వ పటము)



పటము ౧౧

ధన రేఖ త్రికోణములో నుండిగాని, చతు ష్కోణములోనుండిగాని పుట్టినచో అట్టివాడు స్థిరవసతుల సంపాదించుకొనును.

(చూ: 11-వ పటము)



పటము ౧౨

రవిరేఖ త్రికోణములోనుండిగాని, చతు ష్కోణములోనుండిగాని పుట్టినచో వాడు ప్రభుమన్ననలకు పాత్రుడై బిరుదములనంది విఖ్యాతిని గడించుకొనును. (చూ: 12-వ పటము)



పటము ౧3

ధన రేఖలో నడుమ నక్షత్రముండిన నది వైశ్వర్యవినాశలక్షణము.

(చూ: 13-వ పటము)

ఆనక్షత్రలక్షణముగల పెక్కండ్రు ఐశ్వ ర్యముల నాకస్మికముగ బోయినవారిని నేనెరు గుదును. కొందరు దివాలాపడి యుండుట కూడ చూచియున్నాను.

రవిరేఖలోనడుమ నక్షత్రముండిన విశే షైశ్వర్యము, అపారమైనకీర్తి గలుగును. కొందరిచేతులలో యీనక్షత్రచిహ్నము రవి స్థానముపై నుండును. కాని కుడిచేతిలో



పటము ౧౪

నుండదు. అట్టివారి పూర్వులు, తండ్రులు, తాతలు విశేషవిఖ్యాతిని గడించినవారని చెప్పవలెను. కుడిచేతిలో ఆ నక్షత్ర ముండి నచో ఆనక్షత్రఫలితము జాతకునకే లభిం చునుగాని యన్యులకు గాదు.

(చూ. 14-వ పటము)



పటము ౧౫

ధన రేఖలో ధాన్యరేఖ, లేక ద్వీపరేఖ యున్నచో నద్ది అన్యస్త్రీసాంగత్య చిహ్నమని కొందరిమతము. మరికొందరు ధననష్టమని చెప్పుదురు. (చూ. 15-వ పటము)



పటము ౧౬

ఈధాన్యరేఖయే రవిరేఖలో నున్నచో అపకీర్తి నచ్చును. ఇది పెక్కుతావుల నిదర్శనముగా కనబడినది. ఆయపకీర్తి ఒక స్త్రీమూలమున ననిగాని, ద్రవ్యమూలమున ననిగాని నిరూపించిచెప్పరాదు.

(చూ: 16-వ పటము)



పటము ౧౭

ధన రేఖలో గుంటలు కనుబడిన సమయములలో చోరభయమని చెప్పవలెను.

(చూ: 17-వ పటము)

నా కీచిహ్నము మూడు నాల్గు సారులకంటె నెక్కుడుగ కాన్పింపలేదు. విశేష ధననష్టము చోరగ్రస్తమువలన తటస్థమైన జాతకులచేతులలో నట్టి చిహ్నములు కనబడలేదు.

ధన రేఖలోని యడ్డుగీట్లు తాత్కాలిక కష్టములను దెచ్చిపెట్టును. అవి 3 మాసములనుండి 9 మాసములవఱకు ఆ కష్టదినము లుండునని గీతయొక్కలావు సన్నముల



పటము ౧౮

బట్టి యాఫలితముల చెప్పవలెను. ఆ చిహ్నము ఉద్యోగస్థులను తాత్కాలికముగా పనిలోనుండి తొలగించును. లేక యితరమైన కష్టములచే సెలవుపెట్టించి జీతనష్టమును కలుగజేయును. (చూ: 18-వ పటము)



పటము ౧౯

రవిరేఖలోని యడ్డుగీట్లుకూడ తాత్కాలికముగా నభివృద్ధిని నిరోధించును. అనగా యెన్నికలలో ఓటమి మొదలగునవి చెప్పవలెను. (చూ : 19-వ పటము)



పటము ౨౦

ధనరేఖపై శనిస్థానములో నడ్డుగీట్లుండిన పిదపకాలములో జాతకునకు ధననష్టములు, కారాగారవాసములు సంభవించుచుండును. (చూ: 20-వ పటము)



పటము ౨౧

ధనరేఖ హృదయరేఖవఱకును తిన్నగ వచ్చి అక్కడనుండి గురుస్థానములోనికి చొరుచుకొనిపోయిన అత్యాశతో గూడిన ధనార్జనము. అది ఫలితప్రాప్తిచూపు రేఖ. (చూ : 21-వ పటము)

ఆధనరేఖ గురుస్థానములో నుండి చూపుడువేలి మొదటి కణుపులోనికి చొరుచుకొని పోయిన చోట నక్షత్రపుగుర్తుకూడ నున్నచో అమితమైన ధనలాభము.

(చూ: 21-వ పటము)



పటము ౨౨

ఆరేఖ నక్షత్రచిహ్నముతో నాగక కత్తెరగుర్తుతో నాగినచో ధననష్టమును, గర్వభంగమును నిరూపించును.

(చూ: 22-వ పటము)



పటము ౨౩

ధనరేఖ శనిస్థానములో నెన్నిపాయలైన నంత మంచిది. అన్నివిధముల ధనార్జనము కలుగును. (చూ: 23-వ పటము)



పటము ౨౪

ధనరేఖ శనిస్థానములోని చతుష్కోణములో నాగిపోయిన విపద్దశలనుండి సూక్ష్మముగ వెలుపలకురాగలుగుట సూచించును. (చూ: 24-వ పటము)

అతిఅదృష్టమో అతిదురదృష్టమో పట్టును. ఆజాతకుడు సాధారణజాతకుడుకాడు. అతి



పటము ౨౫

ధనరేఖ శనిస్థానమునుదాటి మధ్యవ్రేలి మొదటికణుపులోనికి చొరుచుకొని పోయిన వృష్టి అనావృష్టి దోషములు పూర్తిగా పట్టును. (చూ: 25-వ పటము)

---



ఒడ్డును బట్టింది                                A. A.

# బ్రతుకు తెరువు

వడ్లమన్నాటి కుటుంబరావు

౨

## నౌకరీకొరకు స్వదేశము విడచుట

### భారతవిద్యార్థి - భూగోళశాస్త్రము

మన భారతవిద్యార్థికి పాఠశాలయందు నేర్పబడెడు భూగోళశాస్త్రము సంపూర్ణమైనదిగాదు. ఈశాస్త్రపరిచయము ముండవలసిన అవసర మేమియో, మానవునకు జీవన పరిణామమునం దిదెట్లుపయోగపడునో మున్నగువిషయముల దెలుపక యేమేమో పాఠ్యమొనర్చునట్లు చేయుదురు. ఈశాస్త్రము కఠినమై, రసవంతముగ నుండక వట్టి పిప్పివలె నుండుటచే దీనియందు విద్యార్థులు శ్రద్ధ నగుపరచకున్నారు.

చెన్నపురి, కలకత్తా, బొంబాయివంటి నగరరాజముల నివసించు విద్యార్థులకు యింగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియావంటి దేశములనుగూర్చి కొంత శ్రుత పరిచయమైన నుండును. పట్టణము లనబడు నెల్లూరు, గుంటూరు, బెజవాడ, బందరు, రాజమండ్రి, విశాఖపట్టణము మొదలగు ప్రదేశములనుండు విద్యార్థులకు పత్రికాప్రచారము వెల్లివిరిసిన వెనుక తమ స్వదేశస్థితిగతులను కొంతవరకు తెలిసికొనగలుగుచున్నారు. తమిళదేశముల విశేషాంశములు ఆంధ్రులకు తెలియవు. ఆంధ్రులకు తమిళులవిషయములు తెలియవు. గుజరాతీయులు గుజరాతీయుల సంగతులందు శ్రద్ధచూపుదురు. ఇట్లే యేదేశములకు సంబంధించినవారు ఆయా దేశములగూర్చి శ్రద్ధచూపుకొందురు. అంతేగాక యితర ప్రదేశములగూర్చి వారి కంతగ తెలియవు. భూగోళశాస్త్రము పఠించుట ఉదరపోషణార్థము స్వదేశము విడువవలసినవిద్యార్థికి చాల ఆవశ్యకము.

### ఆంధ్రులది, ఆంగ్లేయులది ఒకటే పడికట్టు

ఆంగ్లేయులకు దేశాభిమానము, జాత్యభిమానము మెండు. కాలనిలంటే వారి కయిష్టము. స్కాటిషు, ఐరిషువారికి ఆంగ్లేయులవలె పట్టుదలలేదు. లాభకారిగ నుండునని తోచినపక్షమున స్వదేశమును విడచి యెంత దూరమునకైనవారు పోవుదురు. మన మద్రాసు రాజధానియందుగల ఆంధ్రులు, అరవలు నను రెండు ప్రధాన వర్గములలో ఆంధ్రులకంటె అరవల కీవిషయమున మంచి చొరవగలదు.

### జన్మదేశము విడచిన

పొట్టకూటికి జన్మదేశమువదలి పరాయిదేశములకేగుటవలన చాల అనర్థములు గలవు. కొత్తదేశమునందు పలుకరించువా రగుపడరు. స్వదేశమున నున్నట్లు తోపదు. అణా ఖర్చుపెట్టవలసినచోట రెండణాలు ఖర్చుచేయవలసిన అగత్య మేర్పడును. స్వదేశాచార వ్యవహారములు సంప్రదాయములు క్రొత్తస్థలమున పనికిరాక పరిహాసపాత్రులు కావచ్చును. స్వదేశమునగల సౌకర్యములు, సౌఖ్యములు యెన్నియో కొరవడినట్లు తోచును. సంవత్సరమున కొకసారియైన బంధుకోటిని పరామర్శించుకొనుటకు స్వదేశమునకు పోదలచిన అమితమగు వ్యయమగును. దూరదేశమున నొకడు హెచ్చుగ సంపాదింపగలిగినదానిలో స్వదేశమున సగపాటి ఆర్జన ఉన్నటులైన స్వదేశమును, స్వజనమును విడువబనియే యుండదు.

స్వదేశముమాత్ర మెంతమందికి జీవనోపాధి కల్పింపగలదు! బ్రహ్మాండమగు వ్యాపారస్థలము, కూడలిస్థలములందు తప్ప మిగత సామాన్య పట్నములందు వ్యాపారమే యుండదు. ఈకారణమున జన్మదేశమున నౌకరీ లభ్యపడక దూరప్రాంతములకు పోవలసిన ఆవశ్యక మేర్పడితీరును.

అరవలచొరవ - ఆంధ్రుల అవలక్షణము

ఇక నితరప్రదేశములకు వెడలకతప్పదేని పైనుదా హరింపబడిన కష్టము లుండ మరొక పెద్దయంశము గలదు. అక్కడనుండుకాలమున స్వదేశమును గూర్చి హెచ్చుగ బ్రశంసింపకూడదు. ఈ అలవాటు చాల చెరుపు. ఆంగ్లేయులకువలెనే మన ఆంధ్రులకును దేశాభిమానము, జాత్యభిమానము హెచ్చు. అరవలు ఆంధ్ర దేశమునకువచ్చి ఆంధ్రులతో నిట్టే యతికిపోయి వ్యాపారములనడిపి ధనము గడించుచున్నారు. మన వేష భాషల సులభముగ నేర్చికొందురు. ఆంధ్రులో చెన్న నగరమందు అరవలతో కలసిమెలసియుండు నవసరము గలిగినను 'నన్ను ముట్టుకోకు నామాలకాకి' వలె సంచరింతురు. అరవము నేర్చుకొనుటయన్న నేవగింపు. వారిలోగల కొన్ని సల్లక్షణములనైన ననుసరింపకున్న మానె, ప్రశంసింపకున్న మానె గ్రహింపనైన బ్రయత్నింపరు. ఆంధ్రజాతి కీలక్షణము న్యూనత నాపాదింపగలదు.

ఆంగ్లేయులకు గల పెంకెతనమే వారికి ముప్పును దెచ్చుచున్నది. అమెరికా, జర్మనీ, ఇటలీ, రష్యా వంటి దేశములలో నౌకర్లు కావలెననే ప్రకటనలు పత్రికలలో ప్రకటింపబడినప్పుడు "No Englishman need apply" అనగా "ఆంగ్లేయులు దరఖాస్తు లంపవలదు" అని ప్రకటించెదరు. జీవనాధారము నిమిత్తము స్వదేశమును విడువవలసిన విద్యార్థి యితరదేశములగూర్చిన పరిచయమును గలిగియుండుట, జాత్యభిమానము, దేశాభిమానములను కొంత సడలించుకొనుట శ్రేయము.

## ౩

## పాఠశాలలో

### పాఠశాలచదువు

పాఠశాలలందు భారతవిద్యార్థులకు నేర్పబడుచున్న, వారి కలవడుచున్న విద్యనుగూర్చి ఒక భారతము రచించినను చాలదు. విద్యార్థులయొక్క భావిజీవనమునకు తగిన పునాది నేర్పాటొనర్చుకొనుటకు నెట్లు స్కూలుఫైనలు తరగతి ఉత్తమమైనదో గతసంచికయందు గ్రహించితిమి. ఈ తరగతిలో నేర్పబడెడు కొన్ని పాఠ్యములు, అనగా రసాయనశాస్త్రము, భౌతికశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, భూగోళశాస్త్రము, చరిత్ర మొదలైనవి నగరములలో నౌకరీకొరకు పోవలసియున్నవారికి నిరుపయోగములు. మెడికలు, ఇంజనీరింగువంటి దేదేని నొకవృత్తియందు ప్రాధాన్యత సంపాదింపదలచినచో పైవిషయము లుపయోగ పడగలవు.

వ్యాయామకాలము, తల్లిదండ్రులకు హెచ్చరిక

పాఠశాలలలో నేర్పబడుచున్న వ్యాయామమును గూర్చి యిచ్చట కొంత యుదాహరింపవలసియున్నది. ఇందు డ్రిల్లు అనునది నిర్బంధము. ఈ డ్రిల్లుక్లాసుకు పోవుట ప్రతివిద్యార్థికి మనసులేని పెండ్లివలె నున్నది. ఇటీవల పాఠశాలలందలి కొందరుపాధ్యాయులు ఆటలయందు హెచ్చుశ్రద్ధ నగుపరచుచున్నారు. ఆటలయందు వారుచూపెడుశ్రద్ధ చదువునందగుపరచుచో నెంతయు మేలుకలుగును. గుమాస్తాగిరికి తయారు కాదలచుకున్న, తయారగుచున్న విద్యార్థి నౌకరీకొరకొక యజమానిని దర్శింపబోవుపట్ల క్రికెటుబంతిని, హాకీ బ్యాటును, ఫుట్‌బాలు పంపును తీసికొనిపోవడు. పాఠశాలవదలి నౌకరీలో ప్రవేశించి సాయంకాలమగుసరికి వార్తాపత్రికలో ఆనాటి వ్యాయామవార్తలకొరకు వెదక తహతహపడు విద్యార్థి యజమాని కెంత యుపయోగపడునో యించుక యోచనచేసిన గ్రహింపగలరు.

ఎందుకును కొరగాని యీవ్యాయామమును ప్రోత్సాహపరచు నుపాధ్యాయులే యిప్పుడు పాఠశాలలందు జాస్తిగ కానవచ్చుచున్నారు. ఇట్టి అనవసరనిర్బంధ వ్యాయామము విద్యార్థియొక్క భావిజీవన పరిణామమున కెంతవరకు అవసరము, యీకాలమును మరొకవిధముగ ఉపయోగకరముగ నొనర్చునుపాయ మేదేని గలదాయని విద్యార్థులయొక్క తల్లిదండ్రు లించుకైన యోచింపకున్నారు.

ఎల్లరకును వ్యాయామమనునది అత్యవసరమే. కాదని నామతముకాదు. టెన్నీసు ఆడేవారు, క్రికెటు ఆటగాండ్లు ఫుట్‌బాల్ టీము కేప్టెనులు మొదలైనవారు అక్కడక్కడ పొందుచున్న గౌరవములు కండ్లా

చూచుచు చెవులారవినుచు నట్లన వీలులేదు. తనయువకుడు ముందువత్సరమునుండి చేయబోవు సేవకావృత్తికి పైఆటలెట్లుపకరించును, ఆ యాటలకొరకు వెచ్చించు కాలము ప్రయోజనకరముగ నుండునట్లు వేరేదేని చేయగలిగినది గలదా యని తల్లిదండ్రు లించుక యోచనచేసిన పైవ్యాయామములు కేవలము నిష్ప్రయోజనములనీ, భావిజీవితమున కవసరమగు ననేకముఖ్యాంశములు నేర్చుటకు ఆకాలమును వినియోగించిన బాగుండునని గ్రహింపగలరు. ఉపాధ్యాయులకు తోడు విద్యార్థులు గూడ పాఠములు యెప్పుడు ముగియునా, యెప్పుడు play ground లోబడి ఆటలాడుదుమా యని వేచి యుందురు. ఆసంవత్సర మెట్లో గడచి పైసంవత్సరము నౌకరీయందు ప్రవేశించినప్పుడు విద్యార్థి జీవితమునకు, నౌకరీజీవితమునకుగల తారతమ్యము హస్తిమశకాంతర ముండును. తనకు యజమాని ఒప్పగింతపెట్టిన పనులలో నొకటిగూడ సరిగనిర్వర్తింపలేని స్థితిలోనుండును. ప్రతిస్వల్పవిషయమునకు యజమానిని సంప్రదించవలసి యుండును. నౌకరీ ఒకసమయమున తన తండ్రికిచెందిన కంపెనీయందే యయినచో నంత ప్రమాద ముండదు. యజమాని పరాయివాడయినచో నౌకరుయొక్క back ward nature కంటకముగ నుండును.

### టెక్నికల్సు నేర్వవలసిన యావశ్యకత

నౌకరీలో చేరుటకు తలపెట్టిన సంవత్సరము, అనగా స్కూలు ఫైనలు పఠించుసంవత్సరము చాల అమూల్యమైనది. నౌకరీకి దరఖాస్తుపెట్టగా యజమాని దరఖాస్తుదారును యెదురులోవచ్చి చూడవలసినదిగ వ్రాయును. దరఖాస్తుదారుని అప్పటి సంభాషణము వాణిజ్యపంథాలో నుండవలెను. అప్పుడు చూపవలసిన కొన్ని లాంఛనములు గలవు; మర్యాదలు గలవు. అప్పుడుపయోగింపవలసిన భాషయే ఒకతరహా. ఒక్కొక యజమాని ఒక్కొకతీరున దరఖాస్తుదారుని పరీక్షించును. ఆపరీక్షల నెదుర్కొన సమర్థతగలిగియుండవలెను. పాఠశాల ప్రధానోపాధ్యాయులు విద్యార్థుల progress గూర్చి తల్లిదండ్రుల కప్పుడప్పుడు తెలుపుచుందురు. అందు లెక్కలలో హెచ్చుమార్కులు వచ్చుట చూచి వారు చాలమురిసిపోదురు. కాని తమ పిల్లవాడు రేపు నౌకరీలో ప్రవేశించునప్పుడు స్కూలులో నేర్చిన ఆల్జీబ్రా, జ్యామెట్రీ యేవిధముగను ప్రయోజనపడవనీ, అప్పటికి కావలసియుండు Book keeping లోని ప్రథమదశగూడ నెరుగడుగదా యనీ పరితపించుట లేదు. స్కూలుఫైనలు చదువునప్పుడు Education carriculum ప్రకారము పాఠశాలలో నేర్పెడివిద్య యెట్టిదైనను యీతరగతి గడచినవెనుక నౌకరీకిదిగుటకు నిశ్చయించిన యువకుడు Shorthand, Typewriting, Book keeping మొదలైనవాటిని నేర్చుట శ్రేయము.

వీటన్నిటిని మించినది handwriting. పాఠశాలయందుండు కాలములో విద్యార్థులు యీవిషయమున తగుశ్రద్ధ చూపకుందురు. నౌకరీకి దిగువానికి దీని అవసరము చెప్ప నలవికాదు. పాఠశాలయందుండగానే దీనివిషయమున యువకులు గట్టిశ్రద్ధ చూపు టెంతయు శ్రేయము.

౪

### ఇంటియొద్ద తీరిక సమయములందు టెక్నికలుయొక్క ఉపయోగము

టైపురైటింగు, షార్టుహాండు మున్నగునవి ఒకానొకవిద్యార్థికి తన భావిజీవనపరిణామమునం దెట్లుపకరించునదియు వివరించితిమి. పాఠశాల విడువబోవు సమయమునం దేమి, ఏదేని నౌకరీలో ప్రవేశము కలిగినంత మాత్రమున నేమి పైవిద్య లన్నింటిని సాధించుట మానదగదు. ఒకటి రెండు వత్సరములు పట్టుదలతో వాటిని సాధించినపక్షమున చెరుపేమియులేదు. పైగా అమితమగు నుపయోగము గలదు. నౌకరీలో చేరినపిమ్మట ఆ వ్యాపారముయొక్క తీరుననుసరించి నేర్వవలసిన విశేషాంశము లనేక ముండును. అయినను పై వాటిని విడచుట ఉచితముగాదు. నౌకరీలో చేరినవెంటనే యేదో భుక్తి గడచుటకు సందుదొరికినదిగదా యని పైవిద్యల సాధించుట మానివైచిన యువకు లెందరో గలరు. స్కూలులలోనేర్చిన విద్యవల్లనే భుక్తికి సరు

పాయమేర్పడినదని, టైపురైటింగు మొదలుగునవి అంత మాత్రముచేత ప్రయోజనము లేదని తలంచుట వెర్రి. నౌకరీలో ప్రవేశింపబోవుపట్టున యజమాని యువకున కేయే విద్యలయందు పరిచయముగలదో ప్రశ్నింప కపోవచ్చును. ప్రారంభదశయందు యువకున కావిద్యల యొక్క ఆవశ్యకత లేకపోవచ్చును. కాని క్రమేపి దానియొక్క ఉపయోగము తేటపడగలదు. నేడు attender గా నౌకరీలోచేరిన ఒకానొక యువకుడు చాకచక్యమువలన కొలదిదినములలో గుమాస్తా, గుమాస్తా పదవినుండి క్రమముగా మేనేజరువగైరా పదవులనుపొంది అభివృద్ధి మార్గమున బడినప్పుడు Technical subjects యొక్క ఉపయోగము, విలువ బయలుపడును. ఈ Technical subjects తెలిసియుండెడువానికే త్వరలో అభివృద్ధికి మంచిమంచి అవకాశములు యేర్పడగలవు.

అభివృద్ధికి Technical subjects ఒక్కటేనా అవసరమని ప్రశ్నింపకుము. వీటికి personal elements గూడ తోడు కావలెను. అభివృద్ధి నాశించు యువకుడు తాను దేనియందేని వెనుకపడియున్నట్లు తానే గ్రహించినను, తన స్నేహకోటి, బంధువులు తన కెరుకపరచినను అట్టిదానిని గట్టిపరచుకొని యుంచుకొను టుచితము.

తపాలుమూలమున విద్యల సాధించుట

ఈ technicals ను postal tuition వల్ల నేర్పెదమని అనేకులు పత్రికలలో ప్రకటించుచుండుట మనము నిత్యము గమనించుచున్నాము. ఇటీవల నీవిధానము చాల అమలులో నున్నట్లు తెలియుచున్నది. ఈ పద్ధతి చాల చవుకగూడ. ప్రత్యేకించి పాఠశాలయందు technicals నేర్చుటదానికంటె యీ postal tuition వల్ల నేర్చుకొనుట చవుకే. కాని యీవిధానమునందు గురుశిష్యసంప్రదాయము లేదు. శిష్యుడు, లేక విద్యార్థి యేస్థితిలోనున్నాడని ఆదుర్దాపడెడి గురుడు యెదుట లేడు. Technicals నేర్పేపాఠశాల చేరువలో లేని యువకుడే యిట్టి postal tuitionను నమ్మియుండు టుచితముగాని technical institute దగ్గరలోగల నాతడావిధానమునకు దిగు టుచితముగాదు. ఎంతవల్లనన ఉపాధ్యాయుని ముఖతః నేర్చినదానియందుగల పటిష్ఠత వేరు, యువకున కెన్నివేల మైళ్లదూరమునుండియో వచ్చెడు కాగితపుకట్టల మూలమున నేర్చు దాని పటిమ వేరు.

Postal tuition వల్ల నేర్చుట అంత తృప్తికరమైనదిగాదు. దీనివల్ల నింటియొద్ద తీరికసమయములందు నేర్వవలసిన పాఠములయందు శ్రద్ధ తప్పిపోవును. ఇంటి పనులయందు బడి తీరికదొరకక గూడ కొంత అశ్రద్ధయగును. తీరికదొరకమి కాగితముల నట్లేపడవైచి కుప్ప పేర్చి యెప్పుడో తిరుగ వేయతలంతురు. అట్లు postal tuition వల్ల నేర్పెడిది ఒకకట్టుబాటు, క్రమము లేకుండును. ఒకపరీక్ష తద్వారా ఒక stage గడచినదనే తృప్తి ఉండనికారణమున యీ చదువు చాల విసువు కలిగించును. పైకారణమువల్ల గురుముఖతః నేర్చుకొనుట చాలఉత్తమము. ఉపాధ్యాయుడు చేరువలోనుండి చెప్పెడివిద్యకు ఒకక్రమమైనడక యుండును. యువకునకు కలిగెడు అనుమానముల, సంశయముల యుపాధ్యాయుని సంప్రదించి తీర్చుకొనవచ్చును. నిక్కముగ postal tuition వల్ల నాల్గుసంవత్సరములైనను నేర్వలేనిది గురువునొద్ద ఒక్కవత్సరములో నేర్వవచ్చును.

ఇంతేగాక ఒక institute లో క్రమముగ నేర్చిన విద్యయందే యెవ్వనికేని, అనగా నేయజమానికేని గౌరవముండును. postal tuition వల్ల నేర్చినవిద్యార్థి గౌరవపాత్రుడు కాకపోవచ్చును.

※

"నౌకరీకి యువకులు కావలెను"

నౌకరీని శిఫారసువల్ల సంపాదింపనెంచుట

పలుకుబడిగల యువకునకు కొన్నిసందర్భములలో నౌకరీ అతిసులభముగ లభ్యపడును. పలుకుబడిలేని యువకుడు నౌకరీని సంపాదించుకొనుటకు కొంత కష్టపడవలసివచ్చును.

ఒకానొక వ్యాపారసంస్థయందు ఒకగుమాస్తాపని ఖాళీవచ్చిన దనుకొనుడు. నిర్వ్యాపారత హెచ్చుగనున్న యీదినములలో ఆ ఒక్కఖాళీకి వేలకొలది దర

ఖాస్తులు వచ్చిపడుచున్నవి. ఈ దరఖాస్తులలో నెట్టి దానిని అంగీకరింపవచ్చుననునది యజమానులకే గుర్తు రాకున్నది. ఈఖాళీపడిన నౌకరీకి వ్రాసిపంపిన దరఖాస్తు అయాచితముగ నెన్నుకొనబడిన, అనగా నితరుల యొక్క శిఫారసులతో నిమిత్తము లేకుండ అంగీకరింపబడిన దరఖాస్తుదారు ధన్యుడే. దరఖాస్తులు జాస్తిగ నుండి నౌకరీలభించునో, లభింపదో యను సంశయమున్న దరఖాస్తుదారు శిఫారసుకొరకు ప్రయత్నించు టవసరము.

శిఫారసువల్లగాని పైనౌకరీ లభ్యపడదను విశ్వాసమున్నచో అట్టి శిఫారసుకొరకై అనుకూలమైనవానిని వెదకి అర్థింపవలెను. మనుజతత్వము లనేకములు. మనుజతత్వముల గుర్తించుట ఒక ఘనవిద్య. దీనినిగూర్చి పరామర్శించుట యిచ్చట అప్రస్తుతము.

సరియైన శిఫారసు అయినచో నౌకరీ దరఖాస్తుదారుని పరము కాకమానదు. శిఫారసువల్ల సంపాదించిననౌకరీ స్వతస్సిద్ధముగ, స్వశక్తిచేత సంపాదించినంత విలువ నగుపరచదు. నౌకరీ లభ్యపడినపిమ్మట గుమాస్తా తనకేర్పడిన పనులలో దేనియందేని కొంతతప్పొనర్చిన మిగత తోడిగుమాస్తాలలో అవమానముగ నుండును. నౌకరీకి శిఫారసుచేసిన ఆ పెద్దమనిషిని యజమాను డెప్పుడేని కలియుట తటస్థపడినటులైన ప్రస్తావవశమున తన స్నేహితు డొప్పగించిన గుమాస్తా ప్రస్తావముగూడ రావచ్చును. గుమాస్తా చేయుచున్నతప్పులు, లోటుపాటులు యజమాని యేకరుపెట్టు సందర్భమున శిఫారసుచేసినాతడు కటకటపడును. తానప్పగించిన యువకుడింత చేతగానివాడా యని స్ఫురించును. శిఫారసను నది మొగమోటమిచేతనో, స్వప్రయోజనముండియో జరుగుట సంభవించును. ఇట్టి శిఫారసులు చాలసందర్భముల ప్రమాదకరములుగ పరిణమించినవి. గుమాస్తాచేయు తప్పులు, లోట్లు యేయజమానిగూడ సహింపడు. శిఫారసుచేసినవానికిని యజమానికిని నేదో సంబంధముండి గుమాస్తాను పనినుండి తొలగింపవెరచును. గుమాస్తా చేసెడు తప్పులు సహింపలేనంత బరువెక్కినప్పుడు ఆగుమాస్తాను నౌకరీనుండి తొలగింపక తప్పదు. ఇంతతో శిఫారసుచేసిన పెద్దమనిషికిని యజమానికిని గల సంబంధము, స్నేహము, బాంధవ్యములకు కొంత తెగతెంపుడు జరుగును గాన శిఫారసుద్వారా నౌకరీని సంపాదింపనెంచు టుచితమైనదికాదు.

కొన్ని సందర్భములందు శిఫారసు అగత్యమే గూడ. ఒకేవిధమగు తాహతు, ఆధిక్యత కలిగిన ఇరువురు దరఖాస్తుదారులలో ఒకేనౌకరీకి పోటియేర్పడినపుడు శిఫారసు అగత్యమే. పైపేరాలో సూచించినది కేవలము నూతనముగ నౌకరీలో ప్రవేశింపబోవు యువకునకుమాత్రమే సూచింపబడినది.

పుట్టించినవాడెట్లో పెట్టకమానునా యను సామెత ప్రకారము ప్రతిమానవుని కెక్కడనో ఒకచోట జీవనోపాధి యేర్పాటొనర్పబడియే యున్నది. అయ్యది అగోచరమైనతోచు యువకుడే దానిని వెదకుకొను సాధన యొనర్పవలెను. క్రమముగ సాధనమీద లభ్యపడకపోదు. రాయియైన అహల్య శ్రీరామపాదస్పర్శకై వేచియున్నట్లు సాధనచేసిన యువకుడుగూడ తనకు నౌకరీలభ్యపడినపిమ్మట పుట్టించినవాడెట్లో పెట్టకమానునా యనెడి సామెతయొక్క సత్యమును గ్రహింపగలుగును.

"గుమాస్తాలు కావలెను."

"నౌకరీకి గుమాస్తాలు కావలెను" అను ప్రకటనలు తరుచు పత్రికలందగుపడుచుండును. వానికి యువకుడు దరఖాస్తును పంపునప్పుడు యీక్రిందిఅంశములు గమనించుటావశ్యకము.

(౧) ప్రకటన కనుగుణముగ దరఖాస్తుండవలెనేగాని విసువుదలను కల్పించెడు అనవసరగాథ వ్రాయకూడదు.

(౨) తన కట్టిలక్షణములతోగూడిన నౌకరు కావలెనని యజమాని తన ప్రకటనయందుదాహరించునో చక్కగ గమనించి అట్టిలక్షణములుగల యువకుడే దరఖాస్తు నంపవలెను. దరఖాస్తుదారు తనలోగల లక్షణములకు నాధారముల నుదాహరించుట మరీయుచితము. అప్పుడుగాని ఆదరఖాస్తు ఆయజమాని నాకర్షింపదు. యోగ్యతాపత్రము లేవేని యున్నచో వానినకల్లుగూడ

చేర్చిపంపవలెను. యజమాని కోరెడు లక్షణములమా
త్రమేగాక అతని కవసరపడే యితరయోగ్యత లేవేని
దరఖాస్తుదారునొద్ద నున్నచో వానినెల్ల నుదాహరింప
వచ్చును.

(3) శాస్త్రమును సూచించే యితరలాంఛనముల
తగ్గించి పైవాటినే నూతన ఫక్కీని ముక్తసరిగ నుదాహ
రింపవలెను.

దరఖాస్తు చేతితో వ్రాయబడినటులైన దస్తూరి
యం దెక్కుడుశ్రద్ధ నగుపరచవలెను. దరఖాస్తు అను
గుణ చేయు చేవ్రాలు నిశిందాగ, గొలుసుకట్టుగ జేసి
యజమానికి గ్రాహ్యముకాకుండ నొనర్పకూడదు. తేలి
కగ పఠించుటకు వీలుగ నుండునట్లు spacing, punctuation and general get-up నందు జాగ్రత్తగ
నుండవలెను. స్నేహితునకు జాబువ్రాయు ఫక్కీని
ఏదో కాగితము, యేదోకవరు ఉపయోగింపజనదు.
ఇట్టి అజాగ్రత్త, నిర్లక్ష్యము యేయజమానిగూడ
హర్షింపడు.

దరఖాస్తునం దేమాత్రపుమకిలిగూడ కనపడగూ
డదు. దరఖాస్తునందలి విషయములు సులభముగ
గ్రాహ్యములు గాకుండనుండిన అట్టిదానిని యేయజమా
నియు చూచుట కిచ్ఛగింపకపోగా వెంటనే బుట్టదాఖ
లుగూడ చేయును. ఒకానొక దరఖాస్తుదారునందు
విశేషమగు యోగ్యత లుండవచ్చును. అయినను అట్టి
దరఖాస్తుదారుని వ్రాత దుర్భేద్యముగనున్నచో నాతని
దరఖాస్తు బుట్టదాఖలు కాకతప్పదు. ఆనొకరికి తన
వలెనే అనేకులు దరఖాస్తు లంపుకొనియుందురనియు,
ఆదరఖాస్తులెల్ల యజమానిమేజాపై నుంపబడినప్పుడు
ఆకర్షవంతముగ నుండుదానిని ముందుగ చూడతటస్థ
పడుననియు యువకుడు గ్రహించి తనదరఖాస్తుగూడ
ఆకర్షవంతముగ నొనర్చుటకు సాధింపవలెను.

దరఖాస్తునందు వ్రాయదలచిన యంశముల నొక
టొకటిగ వేరువేరుపేరాలుగ వ్రాయవలెను. అన్నిటి
నొక్కటే రోకటిపాటగ నొనర్పవలను. సంసారపు
గొడవనుగూర్చి అందుదాహరింపరాదు. ఉదాహరించిన
దానినే తిరిగితిరిగి ఉదహరింపజనదు. ఇట్లు వ్రాయుట
చాల విసువుదలను కలిగించును.

యోగ్యతకుతోడు, దైవబలముగూడ నుండిన
యజమానిదగ్గరనుండి దరఖాస్తుదారునకు జాబువచ్చును.
అందు తనను ముఖాముఖిని యిన్నో తేదీని, యిన్నిగంట
లకు వచ్చి చూడవలసినదిగ కోరును. దానియందు లక్ష్య
ముంచి సరిగ నాసమయమున కక్కడుండవలెను.
అయిదు పది నిమిషములు ముందుగనే అక్కడచేరుట
మరీయుత్తమము. సిగ్గుపడకూడదు. ధైర్యముగనుండ
వలెను. దరఖాస్తుదారు అందమైనవాడు కాకపోవచ్చును.
అంతమాత్రముచేత మురికివస్త్రములుధరించి మలినముగ
యజమానికంట బడకూడదు. శుభ్రమగు దుస్తుల ధరింప
వలెను. యజమానికి దరఖాస్తుదారుకు జరిగిన ఉత్తర
ప్రత్యుత్తరములు, యిదివరలో తానుపొందిన యోగ్య
తాపత్రముల అసల్లు మొదలైనవాటిని వెంటతీసుకొని
పోవుట మరువకూడదు. అణకువ, పరిశుభ్రత, punctuality వల్ల యజమానియొక్క దయను సంపాదింప
వచ్చును. దరఖాస్తుదారు యిదివరలో యెక్కడనేని
కొంతకాలము పనిచేసియున్నచో అక్కడిసంగతులు
నిచ్చుట నేకరువెట్టుట మంచిదిగాదు. దీనదశ, సంసార
బాధలు అతనిచెంత ప్రస్తావింపగూడదు. వీటన్నిటి
మించినది, ముఖ్యమైనది, గంభీరత సూచించునది, తృప్తి
నగుపరచెడిది, యజమాని నాకర్షించునది మందహాసపు
వెలుగు, చిరునవ్వువెన్నెల.

# ఆంధ్ర నాటక కళాపరిషత్తు, చెన్నపురి

(౨౮-౧౨-౧౯౩౫)

ఆంధ్రనాటక కళాపరిషత్తు ఐదవవార్షిక మహాసభ ఇపుడు జరిగినది. శ్రీ మోతె నారాయణరావుగారు దీని కధ్యక్షులు. శ్రీ వనారస గోవిందరావుగారు ఆహ్వానసంఘాధ్యక్షులు. సమావేశమును ప్రారంభించినవారు శ్రీ పి. వి. దాసుగారు.

అధ్యక్షులు చిరకాలముననుండి నాటక సమాజములను స్థాపించి, పోషించి నాటక కళయందనుభవమును సంపాదించుకొనుచున్నవారు. ఆహ్వానసంఘాధ్యక్షులు కుటుంబ నాటకసమాజమును (సురభికంపెనీ) చిరకాలముననుండి నిర్వహించుచు వివిధనాటకముల నాంధ్రదేశమం దంతటను ప్రదర్శించుచున్నవారు. సమావేశ ప్రారంభకులు వేల్ పిక్చర్సు లిమిటెడ్ యాజమాన్యము గలవారు. వీరికి 'టాకీ' అనుభవము అత్యధికము. ఈ సిద్ధహస్తులు మువ్వురును కార్యకర్త లగుటవలన నీమైదవమహాసభ కొక యపూర్వత ఘటిల్లినది. వీరు తమ యనుభవమును బట్టి ఆంధ్ర నాటకరంగాభివృద్ధికి ఆవశ్యకములగు విషయముల ననేకములను తమ యుపన్యాసముల యందు పేర్కొనిరి. వానియందలి ముఖ్య భాగము లీక్రింద నుద్ధరింపబడినవి.

### అధ్యక్షోపన్యాసమునుండి

"ఇక ప్రధానాంశమునుగూర్చి కొంత విచారింతము. పరిషద్ధర్మమునుగూర్చి ముందే తెలిపికొంటిని. ధర్మమనిన లక్ష్యముతో గూడినదని వేరుగ జెప్పనక్కరయుండదు. ప్రకృతము విమర్శలకు జొరక విలక్షణయుక్తమగు కర్తవ్యమునుగూర్చి మాత్రము ఇంచుకంత మనవి



చేయుదును. తెలుగుసీమయందలి నాట్యసమాజములకెల్ల ఈ పరిషత్తు (Dictatorship) ప్రభుత్వము వహించుటకు బ్రయత్నింపవలయును. పరిషత్పాలకత్వమున కధీనమయిన సమాజములకు శిక్షణక్రమము చాటించుట మొదటి లక్షణమై యుండునట్లు చూడవలయును. పరిష

దావరణమున నున్నంతవరకు ఏసమాజముగాని, సామాజికుడుగాని ఒకశాసనమునకు గట్టుపడియుండవలయును. ఒకనీతికి కట్టుపడక యథేష్టముగ వర్తించుచు నధిక సంఖ్యాకముగ పరిషత్తు ఊరుచున్నదని యుబ్బుటకంటె శిక్షావిధేయములయిన అల్పసంఖ్యతో ఎదుగుబొదుగులు లేకున్నను, చేవదేఱి యుండుటయే వాంఛనీయమని, శుభచిహ్నమని, సజీవమని లోకమునకు ఈ పరిషత్తు తెలియజెప్పగలదిగా నుండవలయును. పొంగు ఎంతకాలమో నిలువదు; చేవదేఱిన జీవశక్తి అంతర్వాహినిగా నుండినయెడల ఎన్నటికైన నది వికసింపక పోదు. దాని లక్ష్యమును లోకమునకు జూపకపోదు. దానిఫలితము లోకమునకు బ్రసాదింపకపోదని మనవి చేయుచున్నాడను."

"ముఖ్యముగా రచనకొక ప్రయోజనమావశ్యకము. భారత రామాయణాది ఉద్గ్రంథములు పరమప్రయోజనముం బాటించి రచింపబడినవి. వానిలో ఒక్కొక్క ఉపాఖ్యానమునకు నొక్కొక్క ప్రయోజనము అంతర్వాహికగా చూపట్టుచుండును. మానవసమాజమునందలి ధర్మమును, నీతిని ఎప్పటికప్పుడు మేల్కొల్పుచుండుటయే వాని పరమప్రయోజనము. అట్టి గ్రంథములవలననే మన భారతీయసమాజము ఇంతవఱకు కొంత దారితప్పినను, పరమార్థస్మృతిలేశముతో బ్రదుకగలుగుచున్నది. భారతీయులలోను, పాశ్చాత్యులలోను గల భేదమొక్కటి ముఖ్యముగా గమనింపవలయును. మనము ప్రయోజనమును బట్టియే వస్తువును సృష్టింతుము. వారు వస్తువును సృష్టించి ప్రయోజనము గల్పింతురు. మనము ధర్మముతో నీతిని నడిపింపవలె నని యందుము; వారు నీతికి ధర్మసంబంధము విడగొట్టి నడుపుదురు. కావున మనకు ప్రకృతము కావలసిన నాటకములు సామాజికములేయైనను కష్టజీవి బ్రదుకునందలి విషాదఘట్టములకు సంబంధించినవస్తువే గ్రహింపవలసిన దైనను, మానవుని యంతఃకరణమును ద్రవింపజేసి ఆధ్యాత్మిక దృష్టి ప్రసాదింపగలిగినవిగా నుండవలయును. అందు నూతనత్వమునకు దావు లేకపోదు. రసనిష్పత్తికి అవకాశము లేకపోదు."

"ముఖ్యముగా దేశకాలపాత్రముల కనుగుణముగా నవ్యత్వము ప్రతిపాదించుచు సామాజిక వ్యవస్థలయందు కృషి సలిపి, దేశము నేడు పరిభ్రమించుచున్న దుర్గమ సన్నివేశములను మఱవక, రసయుక్తముగా రచించు నాటకములు కళాదేవతకు నిజమైన సొమ్ము లనదగును. ఇట్టి యలంకారములను సమర్పింప గలిగిననాడు పరిషత్ప్రయోజనము సార్థకముగ లోకమునకు వెల్లడి కాగలదు. గణమునకన్న గుణమునకు ఎక్కువ ప్రాధాన్యమియ్యవలె నని, సంఖ్యకన్న సారస్యమునకు ప్రాముఖ్యమియ్యవలెనని మఱవగూడదని మనవి."

"అంతఃకరణశుద్ధిగా జెప్పవలయు ననిన నేడు ప్రయోగింపబడు నాటకములలో కళయే ప్రయోజనముగా రచితములైనవి కొన్ని లేకపోవు. ఆ కొలది సంఖ్యయు ఏ గ్రహపాటోగాని మన నాట్యసమాజము వారికి నచ్చవు. ఎందునకో! పైసా సంపాదనమీదనే వెంపరలాడువారికి నిజముగా కళాప్రశస్తి ఎందులకు? ఈ నాటి నటకులను, నాట్యసమాజములను ఒక్క పర్యాయము పరికించిచూడుడు! ఈనాటి సినీమాలను పరికింపుడు! ఇవి పామర సామాన్యమున కుద్దేశింపబడినవి కాని కళాప్రియులకు బ్రీతిగొల్పునవి కావని చెప్పక తప్పదు. అన్నిటను దేశమును వణిగ్వృత్తి కబళించినది. దేవుని పూజయు, పితృశ్రాద్ధములును, తుదకు సూర్యనమస్కారములుగూడ కూలివానితో జేయించుటకు బూనిన మనము ఏపని కూలికి జేయింపకుందుము. నాటకరచయిత మొదలు నటకునివరకు కూలికిలోబడుచున్నప్పుడు నాటక ప్రయోగమునకు, కడపనుండి ఒక నటుడు, కాకినాడనుండి ఒకనటుడు, నెల్లూరునుండి ఒకనటుడు, బళ్లారినుండి ఒకనటుడు సరిగా సమయానికి ట్రెయిన్ దిగి, గ్రీన్‌రూములోనికి వెళ్లుచున్నప్పుడు, అడ్వాన్సులతో అగ్రిమెంట్లు పుచ్చుకొనేవఱకు రంగముమీదికి రాక పేచీ పెట్టుచున్నప్పుడు, తమకన్న ఇక ఆక్టరు అనేవాడు లేడని నటులగువారు ఒళ్లు విఱుచుకొని తిరుగుటలోగాని, సమాజములవారు తమవే నాటకములని సంతోషించుటలోగాని సిగ్గుపడనప్పుడు 'కళ' మాయమయిన దనిన వింత యేమికలదు? అట్టియెడ కళ

అనునది మనకు ఎట్లుదక్కగలదు? ఈటాకీలలో ప్రయోగింపబడే నాటకములు, ఎవరైన ఆగ్రహింతురేమోకాని నిజముగా తెలుగువారిని సిగ్గులపాలు జేయుటకు సాధనములయిన బూటకములని ఘంటాపథముగ జెప్పుచున్నాను. తెలుగువారి కళాదరిద్రతను రచ్చ కెక్కించుటకే ఇవి పనికివచ్చుచున్నవి. నాటకప్రయోగముల పేర ఈ యకార్యము నిజముగా కళాహంతలు, జాతివైరులు తలపెట్టదగినదికాని, కళయందేమాత్రము రక్తియున్నవాడును, జాతియందేమాత్రము భక్తిగలవాడును చేయదగినపనికాదు. కూలినాటక రచయితలను, కూలినటకులను విసర్జించిననాడు, పామరజనమును మోసగించి పైసా సంపాదించుటకు దలపడిన నాట్యసమాజముల పేరిలాటరీలను గర్హించిననాడు మనకు కళ ప్రసన్నమగునని నా నమ్మకము. ఈపెద్ద సంస్కరణము పరిషత్తువారిమీద నున్నది."

"నేను తొలుతనే పరిషత్కర్తవ్యమును, ధర్మమును సూచించితిని. విశ్వకళాపరిషత్తు యూనివర్సిటీ, లలో నాట్యకళాబోధనకు స్థానమీయమని కోరుటకు పూర్వము కొన్ని సమాజముల మీదనైన ఈపరిషత్తునకు ప్రభుత్వ మేర్పడవలయును. ప్రయోగమునకు యోగ్యమయిన నాటకములను గొన్నిటినేని సేకరింపవలయును. కూలినటకులను తఱిమివేసి, కళానురక్తులగు విద్యావంతులు ముందడుగు వేయవలయును. మాకు కళయే ప్రాధాన్యముగాని కాంచనము కాదని స్వాచరణపూర్వముగా లోకమునకు వెల్లడింపగల స్థితికి రావలయును. నాటక వస్తువు (Subject Matter) జాతీయభావము నాశ్రయించినదిగా నుండుటయేకాక జాతీయతను, దేశస్థితిని వెలువరింపగల సాధనసామగ్రులు సంపాదింపవలయునను దీక్ష అత్యావశ్యకము."

"కులస్త్రీలు నాటకములలో పాత్రలు ధరించుటను గూర్చి ప్రజాభిప్రాయములు భిన్న భిన్నములుగా నున్నవి. కొందఱు ఆవశ్యక మనుచున్నారు. కొందఱు కూడదనుచున్నారు. ఇక కొందరు నాబోటివారు అస్తి నాస్తి చెప్పలేకుండ గుటకలు వేయుచున్నారు. కళాదృష్టియం దవసరమని చెప్పవలసియున్నను, వ్యక్తిశీలముచే గాదు, సంఘశీలమునుబట్టియు కులస్త్రీల కొప్పిదమయినది కాదని చెప్పవలసియున్నది. శీలముతో బనిలేదని ముందున కుఱుకువారుండవచ్చును, ఉన్నారు గూడ. వారు కేవలము కళాజీవులు. వారియందు నాకు ప్రేమ తగ్గదు. అట్టివారికి నా వ్యక్త్యభిప్రాయముతో నిమిత్తముకూడ నుండదు. అథవా ఆనవాయితీగా కావలెనన్న నా వోటుకూడ నిచ్చెదను."

### ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసమునుండి

"ఈయొక్క సంవత్సరములో నాట్యకళా సందర్భమున నొక్కగొప్ప విపరీత పరివర్తనము జరిగినది. యంత్రము కార్మికపరిశ్రమల నణగార్చినట్లు సినీమాకళ నాట్యకళను తోసి రాజు చేసినది. నటలోకంబెల్ల టాకీలోకములో దన్మయమైయున్నది. పెట్టుబడిదారుల సొమ్ములపెట్టెలెల్ల "మాయాబజారు"లోని గృహోపకరణములట్లు తమంతట దామే టాకీస్టూడియోలకు నడచిపోవుచున్నవి. జనసామాన్యమునకు గూడ టాకీ యొక యత్యవసరమైన మత్తుపదార్థమైనది. ఇంక ప్రతి నాటకశాలయు సినిమా హాలయినది."

"ప్రియకుమారుడుగాని, యనుంగుదమ్ముడు గాని యొక మహాపురుషుని బదభ్రష్టుని జేయునపుడు సహించుట కష్టముగానే యుండును; అన్యోన్యసాహాయ్య సంపత్తి నలరారునపుడే చూచువారి కన్నులకు జల్లగా నుండుట. ఇప్పుడు నాట్యకళకు సినిమాకళ యాదేశముగా వచ్చినదిగాని యాగమముగా రాలేదు. వీధి భాగవతములను నాటకములు వెనకద్రోసినట్లు సినీమా నాటకము నంతరింపజేయునా? అట్లే జరిగిన కళ కిది గొప్పవిపద్దశయే యగును. ఇంకను బాల్యావస్థలో నేయున్న నాట్యకళకు బుట్టిన సినిమాకళ బలముగల్గి యేపారి, చిరంజీవి కాజాలదేమో! తల్లికి హానికల్గించి తానును హాని బొందు దుర్బల శిశువగునేమో! ఇదేభయము. ఎట్లును నేటి మనసినీమాకళ కన్యదేశీయుల కళాప్రాబల్యముతో బోటీతప్పదు; అందిది నిల్వనులేదు. మన నాట్యకళకు మాత్ర మిది కొంతయైన హానిజేయ సమర్థమగుట నిశ్చయము. అన్యదేశములలోగూడ నిట్టిక్లిష్టపరిస్థితు లేర్పడు

చున్నను ఫొటోగ్రఫీ మొదలగువానివలన చిత్రకళకును, జంత్రవాద్యములవలన గాత్రపాటకులకును బాధ గలుగనట్లు సినీమా కళవలన నాటకకళకు పీడ లేనట్లుగా వారు ప్రయత్నములు సల్పుచున్నారు. ప్రాజ్ఞవరేణ్యులు తమరెల్లరుగూడ బాగుగ నాలోచించి నాట్యకళ నిలిచి వర్ధిల్లుపథము లేర్పఱుప బ్రార్థింతును. టాకీపరిశ్రమ నిరసింపవలెనని కాదు; అదియును గావలె. లేనిదాని సంపాదించుకొనుటయు, నున్నదానిని గాపాడుకొనుటయు—నిదియే గదా యోగక్షేమములనగా! జీవితమునకుగూడ కీలక మిదియేకదా!"

"నేడు మన భారతదేశమందెల్ల బాశ్చాత్యవిజ్ఞాన తేజ మత్యధికముగ బ్రసరించుటం జేసి మనవారికి నాదర్శసృష్టియందు నిరసనభావంబును, వాస్తవికసృష్టి యందు ప్రబల గౌరవంబును గల్గియున్నవి. ఇది కారణముగ మన పూర్వనిర్మాణములెల్ల మూలపడు దుర్గతి వాటిల్లినది. ఎంత యత్నించుచున్నను పాశ్చాత్య వాస్తవిక కల్పనాచాతుర్యము చేపడకున్నది. కాగా బ్రతిభాశాలుర కనేకులకు గూడ ప్రకృతి, కళ - వీనికి గల భేదము, సంబంధము మొదలగునవి తెలియరాకున్నవి. ఈయజ్ఞానము నూతనసృష్టికి జాల బాధకముగా నున్నదని తలంతును."

## ప్రారంభోపన్యాసమునుండి

"ఆదిలోన మనకు సంస్కృత నాటకముల అనువాదములే గతి అయినవి. తరువాత నవి క్రమముగ ఆంగ్ల నాటక సంప్రదాయ సంకరము లయిపోయినవి. ఈ సంకర స్వరూపములకు అనుకృతులుగా అతిమానుష పురాణేతిహాస గాథలతోను, చారిత్రక గాథలతోను నాటకము లనేకములు బయలుదేరినవి. నట బాహుళ్యము కొన్నింటను, అతిమానుష అసాధ్యరంగ బాహుళ్యము కొన్నింటను ఉండుటవలన వానిలో కొన్ని రసోత్కృష్టములయ్యును, సమగ్రప్రదర్శన సాధ్యములు కామిని నాటక పరమార్థమగు హృదయానందమును కలిగించునవి కాకపోయినవి. ఇక రసహీనములగువాని విషయము చెప్పబనియే లేదు. ఆయాకాలముల నాయాసంఘముల స్థితిగతులను ప్రతిబింబించుట్లున చిత్రించినగాని నాటకము లప్పటప్పటివారి యభిరుచులకు సరిపోవు. ఇట్టి మార్పు లింకను నేటి మననాటకములలో కలుగనందువలన అవి మనోరంజకములు కాకున్నవి. ఇంతే కాదు. అసమర్థులగు నటులమూలమున నవి మనస్సునకు అత్యంతము ఖేదమును గలిగించునవి గానున్నవి. ఇది ప్రజాసామాన్యపుమాట. సహృదయుల మాటకాదు. వారు వానిని నాటకములుగనే పరిగణింపరు. ఈలోపము తొలగించుటకయి నాటకకళాపరిషత్తు కొన్నినియమములతో నాటకములను రచియింపింపదలచి అందుకు దగిన ప్రోత్సాహమును ధన బహూకరణ రూపమున నీయ సమకట్టియున్నది. ఈశుభప్రారంభముతో నాటక ప్రపంచమున నొకక్రొత్తమార్పు వికాసము పైపునకు కలుగకతప్పదు. దేశకాలములను, అభిరుచిని పరికించి తదనురూపముగా రచియించిన నాటకములయందు సంగీతాది యితరవిషయములును ఔచిత్యమును మీరిపోవని తలంపవచ్చును.

ఎంత రసోత్తరమగు నాటకమయినను నటకులు అసమర్థులయినపుడు ప్రదర్శనము రసహీనముగ పరిణమించును. నటకులమని రంగమున కెక్కువా రందరును విద్యావంతులు, అభినయ కళావేత్తలు, లోకజ్ఞులు నగుదురేని రసహీనములగు రచనములనయిన రసవంతములుగ ప్రదర్శింపజాలుదురు. ఆంధ్ర నాటకరంగమున నేడు కానవచ్చుచున్న నటకులలో సంస్కారము సామర్థ్యము గలవా రెందరో లేరనుట సాహసముకాదని తలతును. ఈ లోపమును తీర్చుటకయి నటకులకు హావభావ విలాసములతో సక్రమశిక్షణము నొసగుసంస్థ నొకదానిని మన దేశమున నెలకొల్పుట మిక్కిలి యావశ్యకము. ఇందుకు పరిషత్తు తగిన ప్రయత్నము చేయవలయును. ఈ విషయమున ఆంధ్రదేశమునందలి నటులు, నాటకమండలులు, నాట్యకళాభిమానులు, టాకీకంపెనీలు కలసి పరిషత్తునకు సాయము చేయవలయును.

స్త్రీలు నాటకరంగమున కెక్కువిషయము ఇంకను పెద్దసమస్యగా నున్నది. వర్తమానకాలమున స్త్రీలు స్త్రీపాత్రను, పురుషులు పురుషపాత్రను ధరించిననే

ప్రజాదరణ గలుగుచున్నది. అట్టితఱి నాట్యకళాభిజ్ఞులగు సాంసారిక స్త్రీలు వెలికిరాక మూకీభావము వహించుట విచారకరము. నేడు నాటకరంగముననేమి, టాకీరంగమున నేమి స్త్రీకొక మహోన్నతమగుస్థానము యేర్పడియున్నది. ఆస్థానమును ఎక్కువగా వివాహితలగు స్త్రీలుమాత్రమే ఆక్రమించుటవలన పవిత్రమగు నాటకకళకు కళంకము గలిగెనదని చెప్పకతప్పదు.

అట్టి కళంకము నాట్యరంగమునకు గాని, టాకీ రంగమునకుగాని ఆపాదింపకుండ నుండుటకు వారెల్లరు పరిశుద్ధవర్తనులై జీవితమును సంస్కరించుకొనగోరెదను.

టాకీలు నాటకకళాభివృద్ధికి భంగమును కలిగించునవని యొక ప్రవాదము వినవచ్చుచున్నది. అది పొరపాటని నాభావము. నాటకము తత్త్వము వేఱు టాకీ తత్వము వేఱు. నాటకమున కన్నింటను కావలసినంత గాంభీర్యము టాకీకి పనిలేదు. అది అన్నింటను టూకీగా నడచును. వివిధములగు చిత్రచమత్కారములు, అద్భుత సన్నివేశములు, కృత్రిమాకృత్రిమ ప్రకృతి సమ్మిశ్రణము మొదలగునవి దానికి ముఖ్యములు. అందు తునుకలగు కథాంశము నొకటిని వదలి యొకటి దారమున గ్రుచ్చిన రంగులపూసలవలెనుండును. అట్లున్ననే ప్రజాసామాన్యమున కది సంతోషమును గలిగించును.

"లవ కుశ, కృష్ణలీల" టాకీలు ప్రదర్శింపబడుచున్నవి. ప్రతి ప్రదర్శనమునకును ప్రజలు వేలకువేలు వెల్లువగా వచ్చుచున్నారు. ఆకథల నట్లే నాటకరంగముపయి ప్రదర్శింపలేరు. ప్రదర్శించిన సామాన్య ప్రేక్షక హృదయము నయినను రంజింపజేయజాలవు. కాబట్టి, టాకీలవలన నాటకకళకు భంగము కలుగుననుభయముతో పనిలేదని నేను చెప్పగలను."



మన నాగరకతయును ఉద్భవించినవి! ఈయంశమును రవీంద్రుడు పలుమారు తన రచనలందు దుల్లేఖించినాడు.. ("In India it was in the forests that our civilisation had its birth, and it look a distinct character from this origin and environment"...... "The Indian mind never has any hesitation in acknowledging its kinship with nature its unbroken relation with all" vide: Rabindranath's "Sadhana" pages 4 and 7.)

పాశ్చాత్యులుకూడ దేశభ్రమణమును, ప్రకృతి సంసర్గమును జ్ఞానసంపాదనమున కక్కరయునవని గుర్తించిరి. ఆక్స్‌ఫర్డు కేంబ్రిడ్జిలందు విద్యార్థిజీవనమును ముగించి ఆంగ్లజిజ్ఞాసువులు ఐరోపాఖండమందు దీర్ఘప్రయాణములు సాగించి, ఇటలీకి తరలి, అచటి సుందర ప్రకృతిదృశ్యములందు మసలి, శృంగారప్రహదములందు, సౌందర్యమాధుర్యములందు గ్రుంకులిడిరి. షెల్లీ, కీట్సు, గోల్డుస్మిత్ లిట్లొనరించి రని ఆంగ్లసాహితీవిద్యార్థు లెఱుగుదురు. కోలెరిడ్జిమహాశయుడు పర్వతమందలి తన నిభృతస్థానము ("The Valley of Seclusion" నుండి తరలియేకదా తన ప్రజలను చేరుకొనెను!* సివిలుయుద్ధములందు ఇంగ్లాండు తవులుకొనినపుడుకదా ఇటలీ రమ్యారామములనుండి మిల్టనుమహాకవిస్వీయసీమకుతరలి దేశసేవయందు దినులను పోగొట్టుకొనినాడు.

ప్రయాణప్రాముఖ్యము నధునాతన యుగమందును గమనించి, ఆంగ్లేయులును ప్రయాణమును గుఱించి ఉద్గ్రంథములు వ్రాసిరి. వీరిలో ముఖ్యుడు సుప్రసిద్ధ గ్రంథకర్త స్టీవెన్సన్. 1876 లో సర్ వాల్టర్ సింప్సన్‌తో గూడి చిన్ని నావయం దీతడు ఏంట్‌వెర్ప్ నుండి బయల్వెడలినాడు. వానయందును, సన్నమై, భయంకరమైన సముద్రమార్గము (Straits) లందును చెచ్చెలినిగూడి సలిపిన నౌకాయాత్ర నాతడు "An Inland Voyage" అను గ్రంథమున వర్ణించి 1878లో దానిని ప్రకటించినాడు. రాత్రులందు తలదాచుకొనుటకై తాముపడిన పాట్లనతడందు చక్కగ వివరించినాడు. మిగుల సామాన్యాంశములను సయితము విపులీకరించి తెలిపినాడు. తాను వ్రాసికొనిన డైరీనుండి కైకొనిన అంశములనే అతడు పెంచి వ్రాసినాడు. ఈగ్రంథమందు స్టీవెన్‌సన్ కథనకౌశలము, శిల్పనైపుణ్యము గోచరించును. "సిగరెట్" ("Cigarette") లేక సర్ వాల్టర్ సింప్సన్ చరిత్ర నీతడు చక్కగ చిత్రించినాడు. ప్రయాణాంతమున నీతడు పేరిస్‌లో ఓస్‌బోర్న్ సతి (Mrs. Osborne) ని కలిసికొనినాడు. ఈతనితో సలిపిన యొడంబడిక చొప్పున నీయువతి వెంటనే అమెరికాపోయి, తన తొంటిమగనికి విడాకులు సమర్పించి కొమరుని, కూతురును వెంటగొని స్టీవెన్‌సన్‌ను కట్టుకొన్నది. ఈమె విద్యాబుద్ధు లెఱిగిన మహిళయట! ఈమె తనకు లభించినందుల కామహాగ్రంథకర్త మురిసిపోయినాడు. ప్రయాణ ప్రమోదమున ప్రణయప్రమోదము చేకురెనని ఉబ్బితబ్బిబ్బయినాడు. ఒల్లమిచి తన ప్రణయావేగము నీతడు తనగ్రంథమందు వెడల గ్రక్కినాడు. "And I blessed God that I was free to wander, free to hope and free to love" అని ఒకతావున నీతడు కంఠమెత్తి పలికినాడో అనునట్లు వ్రాసికొన్నాడు.

ప్రయాణగ్రంథములందు చిరస్థానము నాక్రమింపజాలునది ఈతనిచే రచింపబడిన "Travels with a Donkey in the Cevennes" అను గ్రంథము. "మోడెస్టెయిన్" (Modestine) అను నాడుగాడిదను దోకొని ఫ్రాన్స్‌నం దీతడు కావించిన పయన

"Ah! quiet dell, dear cot, and mount sublime! I was constrained to quit you. Was it right, while my unnumbered brethren toiled and bled, that I should dream away the entrusted hours on rose-leaf bed pampering the coward heart with feelings all too delicate for use?" (Vide: Coleridge's "Reflections on having left a place of Retirement.")

మిందు వర్ణింపబడినది. ప్రయాణసన్నాహమునకును, ఖరక్రయమునకును సంబంధించిన అంశములు గ్రంథారంభమున విపులముగ వర్ణింపబడినవి. చక్కని వర్ణనము లున్నను గ్రంథము విషాదప్లావితమైయున్నది. భారతీయులకువలె స్కాట్లండువాసులకు కొంత ఉపదేశధోరణి యుండును. ఈగ్రంథమం దిట్టిధోరణి గోచరింపక మానదు.

వివాహానంతరమున పశ్చిమ అమెరికాయందు తాను కొంతకాలము కడపిన జీవనము నీతడు "The Silverado Squatters" అను గ్రంథమున చిత్రించినాడు. సిల్ వెరేడోను గురించిన హృద్యమైన గద్యవర్ణనలింకను గలవు.

"Across the plains", "The Amateur Emigrant" అను గ్రంథములందు గ్రంథకర్త జీవనచరిత్రను గురించిన కొన్ని అంశములు కలవు. ఇంగ్లాండునుండి అమెరికాకును, న్యూయార్కునుండి సేన్‌ఫ్రాన్సిస్కోకును స్టీరేజ్‌సక్ కావించిన ప్రయాణ మిందు వర్ణింపబడినది. కాని ప్రయాణమునకు సంబంధించిన ఈతని గ్రంథరాజములలో నివి కడపటిచోటునే ఆక్రమింపగలవు.

"In the South Seas" అనునది పయనమును గురించిన ఈతని తుదిగ్రంథము. తొలుత నిది యొక సుప్రసిద్ధ న్యూయార్కుపత్రికలో ప్రకటింపబడినది. తన చిన్నిడింగీలో (The Casco) దక్షిణసముద్ర దీవులనడుమ గావించిన పయనమున తానందిన అనుభవముల నీత డిందు విశదీకరించినాడు. ఈ దీవులందలి ప్రకృతిసౌందర్యమును, అందుండువారి పరిస్థితులును, గుణదోషములును ఇందు వర్ణింపబడినవి.

ఇటీవల దివంగతుడైన కిప్లింగుమహాకవి "From the Sea to the Sea" అను శీర్షికతో 1893 లో ప్రయాణమునకు సంబంధించిన రెండు వాల్యూములను ప్రచురించినాడు. యువకుడై యున్నపుడు సోదరునితో కలిసి జార్జిసార్వభౌముడు ప్రపంచయాత్రను గావించెను. అప్పటి యాత్రాంశములు రెండుగ్రంథములుగ 1896 లో ప్రకటింపబడినవి.

ప్రయాణమందలి ప్రమోదము నెందరెందరాంగ్లగ్రంథకర్తలో ఉగ్గడించిరి. "One of the pleasantest things is going on a journey, but I like to go by myself" అనికదా హేజ్‌లిట్ మహాశయుడు పలికినాడు! ఒరు లొనరించిన పయనములను గూర్చిన కథనములనుండి కొన్ని యంశములను గైకొని డేనియల్‌డీఫో, షేక్స్పియరాదులు చక్కని కావ్యము లల్లిరి. అలెగ్జాండరు సెల్‌కర్కు నౌకాభంగముకతన సముద్రమున బడి కొండొకతెప్పసాయమున నొక నిర్జనద్వీపమును చేరుకొని ఐదేండ్లందు కడపిన ప్రవాసమును దృష్టిలిడికొనియేకదా డీఫో తన సుప్రసిద్ధ గ్రంథరాజము Robinson crusoe ను సృష్టించినాడు! ఒక సాహసకృత్యమును, ఒకదైవఘటనమును (Adventure) ఆధారము గావించుకొనియే షేక్స్పియరు మహాకవి తన "The Tempest" ను రచించెనని ఆంగ్ల సారస్వతవిద్యార్థు లెఱుగుదురు.

భారతదేశమందు నేడు చెల్లుబడియగుచున్న విద్యావిధానము లోపములతుట్టయని ఎల్లరు నెఱుగుదురు. ఈ విద్యావిధానమువలన హృదయము వికసింపదు. ప్రజ్ఞాప్రతిభలు హృదయమందేకదా పెంపొందును! కళోపాసనమును పురికొలుపు Emotion, Imagination లు హృదయమునందేకదా వృద్ధినందును! ఈశక్తులను మనుష్యహృదయమున రేకెత్తించునది ప్రయాణమని కంఠమెత్తి చెప్పగలను. Excursion అను చిన్ని వేడుకపయనముల కందందు అవకాశము కలదుగాని, విజ్ఞానసంపాదనమునకు కక్కరైన దీర్ఘప్రయాణములకు నేటి విద్యావిధానమున ప్రోత్సాహము లేదు. కావున ప్రయాణమునకు సంబంధించిన గ్రంథములు అధునాతన భారత సారస్వతాంగణమున గోచరించుటలేదు. ఒక్క వంగభాషయందు మాత్రము జలధరసెన్ అను సుప్రసిద్ధ గ్రంథకర్త తనయాత్రను గురించి వ్రాసిన చిన్నిపుస్తకముమాత్ర మగపడుచున్నది.

మనభాషయం దిట్టిగ్రంథములు లేనేలేవు. దేశాటనమందలి ప్రాముఖ్య మిట్టి దని మనపెద్ద లెవ్వరును

కీర్తిశేషులైన

## పంచమజార్జిచక్రవర్తి



జననము 3-6-1865    మరణము 20-1-1936

చెప్పవలెను. ఇటీవల మదరాసులో శ్రీ బత్తుల కామాక్షమ్మగారు దేశాటనము నుగ్గడించుట ముదావహము. "కాశీమజిలీ"లను గ్రంథమొకటి మనరాష్ట్రమందు విశేష ప్రచారము నందినది. దీని వాల్యూములెన్నో వెలువడినవి. మధిర సుబ్బన్న దీక్షితులుగారు భూలోకమందలి తమ మజిలీని ముగించి, స్వర్గధామమును చేరుకొనిరి గాని మణిసిద్ధుడును, గోపిగాడును తమ గమ్యస్థానమైన కాశీని జేరుకొనజాలరైరి. వివిధగ్రంథములనుండి సంగ్రహింపబడిన విడ్డూరపు కథలును, చిత్రవిచిత్రములును ఇందు మూటగట్టబడినవి! ఇది మెఱుపులు తళుక్కొత్తించు అబద్ధముల మూట! చేప నవ్విన దనియు, రాతిబొమ్మ శిరోజములతో నలరారె ననియు, సప్తసముద్రముల కవ్వల నొకచెట్టుక్రింద పెక్కు నిలువులలోతున నొకపెట్టె సొరుగునందలి బరణిలో దాచబడిన తుమ్మెదలు నులిమి వేయబడినపుడు ఒకబ్రహ్మరాక్షసి చచ్చెననియు ("చేప నవ్వినకథ" "బుద్ధిసాగర కామపాలుర కథ" "సింహాదమను:కథ"లను చూడుడు) దండుడు, సాంబుడు, ప్రవరుడు, వసంతుడు, రాముడను నేవురు మిత్రులందు సాంబుడు చెట్టుమొదలున నిలిచియుండ దక్కినవారు వివిధశాఖలనుండి చని సముద్రమధ్యమందో, పర్వతగుహలోనో అదృశ్యులై,ఒకప్పు డిక్కట్టులబడి వేఱొకప్పుడు కొండొక కొలనులో జలక్రీడలు సలుపు గంధర్వస్త్రీలను భార్యలుగ బడసి, భూలోకమునకు స్వర్గమర్త్యములను సంధించి, ముల్లోకముల నేలి రనియు, తానువలచిన సుందరాంగు నొకయువతిరక్షించి పెంపుడు-తల్లి వచ్చువేళ నల్లిని జేసి మంచపుపట్టెడయందు దాచెననియు, ఎవ్వడో ఆకసమునుండి గిరుగిఱ్ఱున దిరిగివచ్చి పెద్ద కొనేరున గూలబడెననియు, కీలుగుఱ్ఱము నధిష్ఠించి యోధప్రవరుడొకడు మేఘవీథులనుండి చరచరబోవుచు రాజసౌధాగ్రమున తలవిరియబోసికొని విహరించుసుందరి దృష్టియందుబడి, ఆమెచూడ్కివలయందు దవుల్కొని బరబర మేడలోనికి లాగబడెననియు నందు చదువుదుము. ఈరీతికథ లెంతనూర మైనను తెగసాగగలవు. సాహితి కొంత Romance ను కాంక్షించుట నిక్కమే! కాని Realism ను మంటగలిపి కేవలము Romance వెంటబడు సారస్వతవధూటి మృగతృష్ణ ననుసరించుచును నభాగునివలె వ్యర్థపరిశ్రమయందు కూలబడి నగుబాటునకు బాల్పడును. మాయమాటలును, వింతకబురులును మోళీబాజావలె పామరులదృష్టి నాకర్షించును. ఇట్టి సరుకును వారికి సమర్పించు గ్రంథములు వేలకొలది విక్రయమగును. ఈతుకుక్రపోవులవలన కొందఱు గ్రంథకర్తలు ఐశ్వర్యవంతు లగుచున్నారు. విడ్డూరపు చెత్తకై జీవనములు ధారవోసి, తమ హృదయములను క్షుద్రయాశలకు లగించి, చీనిచీనాంబరములను గట్టుకొని విఱ్ఱవీగు గ్రంథకర్తలు ప్రజాళియందు సత్యప్రదీపకళికను వెలిగించుటకు మాఱు వారి హృదయములందు రాజ్యచక్రమును త్రిప్పు అవిద్యాపిశాచమునకు మఱింత నైవేద్యమును సమర్పించువా రగుదురు. "సత్యం శివం సుందరమ్" ("Truth, Goodness and Beauty)" లను మహదాశయములనుండి పఱతెంచు రచయితలు అంధకారమందును, అనృతమందును, అల్లకల్లోలమందును కూలబడుదురు.

భ్రమణచరిత్రలు కల్పితకథలు కావు. అవి ప్రత్యక్షానుభవముల భాండాగారములు. వీనికతన చేకుఱు విజ్ఞానము మానవుని సర్వతోముఖాభివృద్ధికై తోడుపడునని నాదృఢవిశ్వాసము.

ఏకారణముచేతనో జగదీశుడు నిక్కమైన నా విద్యార్థిజీవనమును దేశభ్రమణమందే ఆరంభింపజేసినాడు. నేను పుట్టినది పవిత్రమైన ఆంధ్రదేశమందే. ఆంధ్రవసుంధరయందు నేను మిడిమిడిజ్ఞానమును సంపాదింపకమున్నే నాతలిదండ్రులు దివంగతు లగుటవల్లను, వారి మహానిష్క్రమణానంతరము నా పితార్జితము జ్ఞాతుల గభీరకంధరనాళమందు గుభాలున జొచ్చుటచేతను శైశవమందే ఆంధ్రావని వీడి, దేశభ్రమణ మొనరించి తుదకు వంగమాతయండ జేరితిని. ననుగన్న ఆంధ్రజనయిత్రికి జోహారొనరించుచు, ఏదిక్కు లేక అల్లాడు నన్ను తన యంకసీమను జేర్చుకొని, నాకు తన స్తన్యమిచ్చి పెంచి, పదునేనేండ్లు నన్ను పెంచి, నాకు జ్ఞానభిక్ష నొసగి, నాకు పెంపుడుతల్లి యైన

'సోనార్ బంగ్లా' కు నేను సాగిలపడుచుందును. ఈ యమ్మను తలచినపుడు నాహృదయ మావేశముతో నిండి పోవును. నాకనులనుండి కడవలకొలది నీరు కాఱును. ఒకప్పుడు తునకతునకలైన నాచిన్ని యెడందకు తన ప్రేమామృతాంజనమును పూసి, నాకు సాంత్వనమును, సాంత్వనము నే కాదు, ఆయువును ఒసగిన వంగజనయిత్రి ఋణమును నేను తీర్చుకొనలేను. నేను ఏకారణము చేనైన నాహృదయము విషాదపూరితమగుచో నొకమాఱు వంగవసుంధర కరిగి మనసు కుదుటబడినపిదప నిచటికి మరలివత్తును..... దేశభ్రమణమందు అంగుళాంగుళమును పరిశీలించి, అందుండి విజ్ఞానమును గ్రహించుటకు పిన్ననాడే యలవాటుపడితి నని తెలుపుట నాయాశయము.

కలకత్తాలో నుండుతఱి ఆర్యావర్తమును పలుమాఱు—ఒక్కొకప్పు డొంటరిగను, మఱొక్కప్పుడు సతీసహితముగను — ప్రదక్షిణము చేసితిని. ఇటీవల మాత్రము పశ్చిమపర్వతములందు పర్యటనము చేయగలిగితిని. ఏపుణ్యభూమి శివాజీని గని ప్రపంచచరిత్రకారుల దృష్టి నాకర్షించినదో, ఏపవిత్రసీమ తిలక్, గోఖలే, రనడే మున్నగు మహాపురుషులకు కన్నతల్లి యైనదో, ఏనేలయందలి గిరికందరములును, అరణ్యప్రదేశములునుకూడ పూతస్వాతంత్ర్య శబ్దముచే బహుశతాబ్దులు ప్రతిధ్వనించెనో, ఏయున్నతావని గోదావరి, కృష్ణ, సావిత్రి, గాయత్రి, కోయనా, ఎన్నా మున్నగు నదీమతల్లులకు జన్మస్థలమైనదో, శివాజీ మనియున్నపుడును, లోకమాన్యుడు సజీవుడైయున్నపుడును, హిందూమతము అవిచలితమై ఏభూమియందు పెంపారెనో ఆ సీమలో ప్రవేశించి, దాని మహత్త్వమును గుర్తింప మిక్కిలి మక్కువపడితిని.

మహారాష్ట్రయాత్రకు బొంబాయిని కేంద్రస్థలము గావించుకొంటిని. అందుండియే పశ్చిమభారతమందలి వివిధస్థలములకు కదలిపోతిని.

ఉత్తర హిందూస్థానమందలి పర్యటనమును ముగించి బొంబాయిని కడచిన డిశంబరు ౧౬ వ తేదీనాడు చేరితిని. అందుండి ౨౩ వ తేదీని నాసికకుపోవ నిశ్చయించితిని.

నాసికదిశకు పోవు రైళ్లు ఎన్నిఉన్నవో ఏయేసమయములందు అని బయల్వెడలునో తెలిసికొనుటకై బోరిబందర్ (Victoria Terminus) స్టేషనునకు పోయిఇక్క్వయిరీ ఆఫీసులో వాకబు చేసితిని. రాత్రి పదిన్నర మొదలు అరగంట కొకటి చొప్పున మూడు రైళ్లునాసికకు పోవునని అచటి ఆఫీసరు చెప్పినాడు. "తెల్లవారు నప్పటికి ఆచోటును చేరు రైలేదే?" అని ఆతని నడిగితిని. "౧౧ గంటల రైలుపోవును" అని అతడుత్తర మిచ్చినాడు.

నాటిరాత్రి (డిశంబరు ౨౩) బొంబాయిలో బయలుదేరితిని. అచటి మిత్రుడొకడు స్టేషనువఱకువచ్చినాడు. టిక్కట్టు తీసికొనివస్తా నన్నాడు. "ఉదయమను లోపల దిగవలసివచ్చుచో అక్రొత్తచోటులో చిక్కుపడవలసివచ్చును. కావున ౧౧ గంటల రైలునకై టిక్కట్టు తీసికొనిరమ్ము" అని చెప్పి ఆతనికి పైకమిచ్చినాను. కొంత సేపటిలో అతడు పంజాబుమేలు టిక్కట్టు తెచ్చి నాచేత బెట్టినాడు. టిక్కట్టును చూడగనే నా కించుక ఖేదము కలిగినది. వేగముగపోవు మనరైళ్లలో మొదటిది పంజాబు మెయిలు. ఒకప్పుడిది గాంధీగారి సర్టిఫికెటును కూడ పడసినది. బొంబాయిలో రాత్రి పదునొకండు గంటలకు బయల్దేరి, నాసికచేరుటకిది ఉదయమువఱకు నడచునని నమ్మకమెట్లు? శరవేగమున పోవుచు నిది చిన్ని స్టేషనులను వదలివేయును. ఇక్క్వయిరీ ఆఫీసులోని ఉద్యోగులు చెప్పువృత్తాంతమును ఉన్నదున్నట్లు నమ్మరాదని గ్రహించితిని. ఢిల్లీలో కొన్న **All India Railway Guide** నొక పెద్దమనిషి బొంబాయిలో తీసికొని మఱల నీయకపోవుటచే నిట్టి యుద్యోగి నాశ్రయింపక తప్పినది కాదు. టిక్కట్టునకై పోయిన మిత్రశేఖరుడైనను ౧౧ గంటల రైలు మేలని విని, దానికై పైకము చెల్లించినపుడు అది రాత్రిసమయమందే నాసికకడ నన్ను జారవిడుచునని యోచింపనైన లేదు. "మిత్రుడు ఇంచుక **Native intelligence** ను ఉపయోగించిన బాగుండెడిది" అని యనుకొన్నాను. రాత్రి ౧౧-౩౫ లకు బయలుదేరు ప్యాసింజరు నాసికను ఉదయము ౮ గంటలకు చేరున్న

స్టేషనులో కానుపించిన పెద్దమనిషి యొక్క డపుడు చెప్పినాడు. టికెట్టు కొన్న తర్వాత నిక నాలసింప నిచ్చగింపక ౧౨ వ నెంబరు ప్లాటుఫారములో నిలిచిన పంజాబుమెయి లెక్కితిని. మిత్రు డింటికి మరలిపోయినాడు.

మఱొక విషయము: డిశంబరులోకూడ బొంబాయిలో చలిలేదు. అంతకుమున్ను సంయుక్త రాష్ట్రము లందును, పంజాబులోను తిరిగి దురంతమైన చలికి గుఱియై బొంబాయి చేరుకొనినంతనే "అమ్మయ్యా!" అనుకొంటిని. సత్వర స్థల పరివర్తనమువలన బొంబాయిలోని కొద్దిపాటి చలి చలివలెనే నాకు తోచలేదు. నాసికకుపోయి వెంటనే తిరిగి రాదలచితిని కావున స్నానమున కవసరమైన కొలదిమాత్రపు బట్టలను, ఒక మరచెంబును కూడ గొనిపోతిని. పరపును, రగ్గును తదితర శీతవస్త్రములను బొంబాయిలో విడిచిపెట్టితిని.

రైలు క్రమక్రమముగ నెత్తుచో టెక్క పర్విడ నొచ్చినది. పడమటి కొండలకు రాకరాక వచ్చితినని కాబోలు కొండకోనలనుండి చివాలున నెగసివచ్చి తీవ్ర శీతవాతూలము నా కాహ్వాన మొసగినది. పెట్టెలోనివా రందఱు పెద్ద పెద్ద రగ్గులు కప్పుకొని ముసుగుదన్నిరి. ఏకాంబరధారివలె నున్నవాడను నేనొక్కడనే. వడకకుండ నుండవలెనని యెంత యత్నించినను బహువేగమున నడుచు రైలు నిదురొక్కని కిటికీగుండా రివ్వున లోపల బ్రవేశించు చలిగాలిలో శరీరము గజగజ వడకిపోయినది. నన్నుచూచి ఖేదపడుదానివలె నామరచెంబు చిరుచప్పుడు చేయుచు వడకినది! "నాసిక ఇందే ఎదురైనది! అచటికిపోయి గోదావరిలో మునుగు టెట్లు? ముందున్నది కాబోలు ముసుళ్లపండుగ. నాసిక చలిని గుఱించి ముందే యోచింపకుండుట పొరపాటైనది" అని తలపోసితిని.

జరిగిన పొరపాటుపై దృష్టి నిలిపినయెడల అది బ్రహ్మరాక్షసియై పీడించునుగదా! ఇట్టిపొరపాటునకై వగచుట నా ప్రకృతికి ప్రతికూలము. తప్పును తప్పుకాదని మిడిసిపడను. ఇట్టి మిడిసిపాటు మానవుని అపరాధములందు సిద్ధహస్తుని జేసితీఱును. పొరపాటునుండి వాటిలు కష్టముకతన కొంతపరిజ్ఞానము చేకుఱుననియు, కష్టముకతనగాని మానవు డాత్మపరిశీలనమున కలవాటుపడడనియు, స్వీయహృదయపరీక్షను నేర్పునాచార్యు లరిష్టములే యనియు, సుఖమెన్నడు నాచార్యపీఠము నధిష్ఠింపజాలదనియు యోజించి, ఇక్కట్టు బోధించు పాఠమును పలుమాఱు మననము చేసికొని, దానికి చిత్తమున చిరస్థాన మొసగి, దాని వెలుగున క్లిష్టపరిస్థితులందు ముందంజవేయ బ్రయత్నింతును. ప్రపంచపరిస్థితు లన్నపుడు మన కనుకూలముగ నుండవు. భిన్నభిన్న మానవ ప్రకృతులతో తఱచుగ మనకు సంఘర్షణము కలుగుచుండును. అనవరత మేకైకభావమందే మునిగి తేలవలెననిన, మనకు నిరాశ తప్పదు. మనసు నులిపిరికాగితమును చేసి వదలితిమేని, వ్యతిరేకమైన ఏచిన్నితలపుచేనైనను, అది చిరిగిపోకమానదు. ప్రతికూలప్రపంచపరిస్థితులకు వ్యక్తిగత వ్యతిరేకపరిస్థితులు నైతోడులగునపుడు తన మనసును కొంత బండబారించినగాని (ధైర్యమును చిక్కబట్టినగాని యనినను అనుడు) మానవుడు క్షణక్షణము తన యంతరంగమున దురంతయాతనబడును. ఇదియే "తెవులులేని వేదన!" భావసంఘర్షణమున మన కొక అపూర్వానుభవము చేకుఱును; మన మెఱుగని క్రొత్త ప్రకృతి (అదెట్టిదైనను) మనకు దృగ్గోచరమగును, ఈ దృష్టి నలవరుచుకొనుటకు మానవునకు సమయముపట్టును సంఘర్షణసమయమున మనుజుడు చఱ్ఱుమనుట సహజము చఱ్ఱుమనువాడు తనయాత్మపై స్ఫులింగమును విసరుకొనును. ఒరులవలన చెఱుపునందుటకుమున్న ఆంతరంగికముగ నీతడు తానే ఎంతేని చెఱుపు నందును. సంఘర్షణము నీతడు విశాలదృష్టితో పరికించు ముహూర్తమందే విజ్ఞానదృష్టి నలవఱుచుకొనజాలును. ఈదృష్టి నలవఱుచుకొని బాహ్యావనియందు ప్రవేశించితిమేని ప్రతికూలానుభవములు మనచే "నమ్మో!" యనిపించవు. మనసును పిడికిటబట్టు టెట్లని మన మాతురపడ నక్కరలేదు; మీదుమిక్కిలి మనకు కొంత జ్ఞానమబ్బునని ఆనందింతుము. అయ్యలారా! జ్ఞానము గిన్నెడుతేనెవలె మనకు చేబడదు. దాని నందుటకై

ఒక్కొకపుడు మనము చింతనిప్పులందుకూడ కిక్కురు మనకుండ నడువవలెనుజుడీ! ఈభ్రమణవాహినియందు చదువరులు నన్ననుగమించివచ్చిరేని మనుష్యచరిత్ర యందలి చిత్రవిచిత్రముల నెన్నేని పొడగాంచగలరు.

రాత్రికదా! మనసునందు ఆందోళన మేమియు లేనందున చలి యెక్కువగానున్నను నిద్దుర రాదాయెగి నది. కాని నిద్రపోవు టెట్లు? రైలు రాత్రి రెండు న్నర గంటలకు నాసిక చేరు నని రైలులోని ఒక పెద్ద మనిషి చెప్పినాడు. నాకు కునుకుపట్టినచో తూరీగవలె బండి ముందుల కరుగుచున్నందున నాగమ్యస్థానము పిట్ట వలె వెన్క కెగసిపోవునుగదా! అందుచే నాసిక నెదురు చూచుచు, ఇంచుకైన నోరుగక బల్లపై తిష్ఠవేసితిని. మా పెట్టెలో నెందఱో లేరు. పండుకొనుట కెంతేని చోటున్నది. ఇది యపూర్వమైన విషయమే! స్థల మున్నను నిద్రించుటకు పెట్టిపుట్టితిని గానని వగచితిని. "ఈఘటము ఒంటరిగా నున్నాడు. పాపము కాలక్షేప మునకై యేదైన బాతాఖానీ మొదలుపెడదాము" అనే ఇంగితజ్ఞానము పెట్టెలోని మహాశయుని కొక్కనికైనా లేకపోయినది. పరోపకారము ప్రపంచమునుండి అంత ర్ధానమైపోయినదని కినిసితిని. నిలువునా ముసుగులుదన్ని ఒక ద్దఱు భీమకాయులు మహాఘోరముగా గుఱ్ఱు పెట్ట సాగిరి. రైలు హోరుతో పందెము గట్టుటకై ముక్కు లతో వారు గంభీరముగా గర్జించుచున్నట్లు తోచినది. "ఈ అతికాయ మహాకాయు లెవ"రని ఆశ్చర్యముతో పరికించితిని. ఒకడు మార్వాడీమహాశయుడు, బస్తావంటి బొజ్జగలవాడు. నేను రైలెక్కబోవునపుడు "చోటు లేద"ని కసరి, నేను పెట్టెలో ప్రవేశింపగనే అప్రతిభు డైన పెద్దమనిషి. కాని ఐదు నిమిషములలో అతనికిని, నాకును స్నేహము కుదిరినది. అతడు హైదరాబాదులో వర్తకము చేయుచున్నాడు. కొలదిమాత్రపు తెలుగు ముక్కలను ముక్కున బట్టినాడు. విభక్తులను, పురుష లను పాటింపమేని ఆతని ప్రయోగములందు తప్పులున్న వని చెప్పజాలము. "నేనుఉన్నాడు ఈబల్లమీద. చోటు గనై ఉన్నాడు. మీరు పడుకున్నాను ఆబల్లమీద"అని కొంతసేపటికి మున్ను నాతో ఆతడు చెప్పినాడు. తన ప్రసంగములో పొసపువతుగా మార్వాడీమాటల నాతడు కలుపువాడు. రాజస్థానమందు మసలితిని కావున గనై (అధికముగా) మున్నగు మార్వాడీల మాటల నెఱుగు దును. కావున నాతనిమాటల నవలీలగ నర్థముచేసికొని, ఆతని వింతప్రసంగమును వినవలెనని ముక్కువపడి, ఏమేమో ఆతని నడుగువాడను. నవ్వుచు నేనడిగిన కొన్ని ప్రశ్నల కాతడు నవ్వుచునే ఉత్తరములు చెప్పినాడు; తక్కిన నాప్రశ్నలు నానోటనుండగనే నిద్రాప్రపంచ మందు ప్రవేశించినాడు. ఇగట్‌పురి స్టేషనులో (ఇది పెద్దస్టేషన్) రైలు ఆగినపుడు ఒక ట్రావెలింగు ఇన్‌స్పెక్టరు మాపెట్టెలో ప్రవేశించి "టిక్కట్టు! టిక్కట్టు!!" అని ఆతనిప్రక్క నిలిచి పలుమాఱు అఱచినాడు. కాని మార్వాడి తన గుఱ్ఱుశ్రుతి నించుకైన తగ్గింపలేదు; సరికదా హెచ్చుస్థాయిలోనికి దిగినాడు. గుఱ్ఱుపట్టు రెండవవ్యక్తి ఈతని అన్నగారై యుండును. వాలకమునుబట్టి అతడు పంజాబీయని బోధ పడినది. నేను బొంబాయిలో రైలెక్కునప్పటికే అతడు నిద్రపోవుచుండెను. "ఏమిటీ కుంభకర్ణదృశ్య" మనుకొన్నాను గుఱ్ఱులో నున్న మనిషిని మూటగట్టి నట్లు కట్టి ఆతనివారలు రైలులోనికి వాని నెక్కించి యుందురు! ఈవ్యక్తులనసుమ నెత్తిమొగముతో కొంత సేపు నిలిచి, ఏమనుకొన్నాడో పాపము ట్రావెలింగు ఇన్‌స్పెక్టరు వారిని కదపక (కదపినను లాభములేదని గుర్తించియుండును) మెల్లగ పెట్టెనుండి అవ్వలికి జారి నాడు వీరి గుఱ్ఱుపోటీయందు నాకు కొంత కాలక్షేప మైనది.

పర్వతగుహలందు భయంకరముగ గర్జించుచు పర్విడు సింహమువలె రైలు కొండ సొరంగములందు (Tunnels) భయంకరశబ్దము చేయుచు పర్విడుచుం డెను! నిర్జనపర్వతప్రదేశమునుండి వెడలిన ఘోరప్రతి ధ్వని రక్కసియఱపట్లు కర్ణపుటములందు బడినది! ఏమో "కటక్! కటక్!!" అని తెగనఱచుచు దూసుకొనిపో వునట్లు అంధకారమున ధూమశకటము తోచినది! "భీషణ ముగ అంకెలువేయు అపూర్వమైన ఆబోతేమో యిది" యనిపించినది. "కొండలను, లోయలను, వనములను, చీక

టిని, విపత్తులను లెక్కసేయక సింహనాదము చేయుచు చరచరసాగిపోవు అద్భుతయోధు డిట్లుండును కాబోలు" ననుకొంటిని. "భూమినుండి ఒక్కుమ్మడి అంబరవీథి కెగసి మేఘములను పరపర నములజూచు అపూర్వమృగ మేమోయిది" అని తలపోసితిని. "భేష్! రైలంటే ఇట్లుండవలెను. తింటే గారెలు తినవలెను; వింటే భారతము వినవలెను; ఎక్కితే పంజాబుమెయిలే యెక్కవలె"నని యనుకొంటిని.

గవాక్షముదిక్కుగా దిరిగి, చీకటిని ఛేదించు ఇంజనువెలుగున నట్టె తళ్కొత్తి వెనుకకుతరలు దృశ్యములను పొడగాంచుచుంటిని. అంధకారము, ఆకస్మికాలోకము, అపూర్వదృశ్యము నొసగు భావభిక్ష యేమని యూహించుచు, మానసాంజలి నొగ్గి అట్లే కూర్చుని యుంటిని.

---


# ఫోటోగ్రాఫరులు త్వరపడుడు

మా ఆంధ్ర దినపత్రికయొక్క చివరపేజీయందు పూర్తిసైజులో చారిత్రాత్మకములగు చిత్రములను ప్రకటింపదలచియున్నాము. కావున ఫోటోగ్రాఫరులు $8\frac{1}{2} \times 6\frac{1}{2}$ (Full plate) సైజులో ప్రాచీనములు, ఆధునికములైన, సుందరములగు, మందిరములు, కోటలు, బురుజులు, ఆనకట్టలు, దేవాలయములు మొదలగు చిత్రములను పంపగోరుచున్నాము. పంపదలచినవారు, తమఫోటోలకు, రెండువైపుల దళసరియగు అట్టలను పెట్టి, నలగకుండ, జాగ్రతగా పంపవలెనేగాని, మడిచిగాని, చుట్టగా చుట్టిగాని పంపగూడదు. అంగీకరించబడిన చిత్రములకు మామూలుగానిచ్చు రుసుమే అనగా చిత్రము 1-కి రు 2 లు చొప్పున యివ్వబడును.

ఆంధ్రపత్రికాకార్యాలయము<br>7 తంబుచెట్టివీధి, జి. టి. మద్రాసు.

వ్యవస్థాపకుడు.

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(యువసంవత్సర మాఘఫాల్గునమాసములు)




[ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని పరిశీలింపవలెను. ఇందున్నట్లు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1936 ఫిబ్రవరి | 8 | తేదీని | రాత్రి | 8-48 గంటలకును, | ఫిబ్రవరి | 15 | తేదీని | రాత్రి | 8-20 గంటలకును | నక్షత్రములు కనబడును. ] |
| ,, | 22 | ,, | ,, | 7-52 ,, | ,, | 29 | ,, | ,, | 7-24 ,, | |
| మార్చి | 1 | ,, | ,, | 7-20 ,, | ,, | 8 | ,, | ,, | 6-52 ,, | |

"Here is a story book,
Thy father has written for thee.
Come, wander with me," She said
"Into regions yet untrod;
And read what is still unread
In the manuscripts of God
Day and night, I sing in verse
The rhymes of the Universe"

"నాయనా! దివారాత్రములు ఎలుగెత్తి విశ్వ గీతములు పాడెదను; ఇనవచ్చును! నాతో కూడ రా! మీజనకుడు నీకొఱకు ఒక చక్కని కథలపుస్తకము వ్రాసిపెట్టినాడు. చదువుకోవచ్చును. ఎవరును త్రొక్కి యెరుగని తావులలో నాతో సంచరించుచు, అనన్య పఠితమైన ఆదివ్యగ్రంథమును పఠింప నాతో వెడలి రమ్మ! లెమ్మ! అని అత్యంతాదరముతో నిన్నాహ్వా నించుచున్నది ప్రకృతిమాత; వింటివా? ఆమె యాహ్వా నము నంగీకరింతువా?"

ఈ యువ సంవత్సర మాఘశుద్ధ పూర్ణిమనుండి ఫాల్గునశుద్ధ పూర్ణిమవఱకును (8-2-36 మొ॥ 8-3-36) నగు మాసములో రాత్రి తొలిజామున నగపడు ఖగోళ దృశ్యములను పరిశీలింతము.

## పాలవెల్లి
## (The Milky way)

ఈధవళదృశ్యము ఈనెల తొలిజామున ఆగ్నేయ దిశనుండి వాయవ్యదిశకు ఆకాశరంగమున కడ్డుగా వ్యాపించియున్నది. ఇపుడీపాలవెల్లి ఖగోళమును రెండు భాగములుగా విభజించినట్లున్నది. రెండుభాగములును పరిమితియందు ఇంచుమించుగా సరిసమానముగా నగప డుచున్నవి. ఇపు డగపడుచున్న దానినిబట్టి ఈ ఖండము లలో నొకటి ఈశాన్యఖండము, రెండవది నైరృతిఖండ ము అన నొప్పియున్నవి. ఆగ్నేయదిశను ఈతెలుపు చాల సన్నముగా నుండి, వాయవ్యమునకు పోవుకొలది హెచ్చుచు తగ్గుచు, ధ్రువసమీపక్షితిజముకడ, అప్సరస మండలమున కావల, నాలుగైదు రెట్లు వైశాల్యవృద్ధి గనినట్లున్నది. ఆగ్నేయదిశనుండి వరుసగా నీపాలవెల్లి నౌకా, శ్వాన, పూర్వశ్వాన, మిథున, సారథి, భృగు పరశుమండలములం గడచి, కల్పవృక్షచ్ఛాయల విహ రించు నప్సరోంగనాజనమునకు స్నానలాభము నొసగి ఆవల దృక్పథమునకు తప్పిపోవుచున్నది.

## ముఖ్యనక్షత్రములు

తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రములు చాలవఱకు నీపాలవెల్లి ప్రక్కనే కనబడుచుండుట గమ నింపవలసిన ముఖ్యవిషయము. ఈతొలిజామున నగపడు తొమ్మిది ముఖ్యనక్షత్రములలో ఎనిమిది పాలవెల్లిప్రక్క నే గలవు చిత్తగింపుడు.

౧. సారథిమండలములో బ్రహ్మహృదయము. (Capella in Auriga)

౨. పునర్వసు, మిథునములోని సాంబ (Pollux in Gemini)

౩. వృషభములో రోహిణి (Aldebaran in Taurus)

౪. ఆర్ద్ర (Betelgeaux in Orion)

౫. పూర్వశ్వానము (Procyon)

౬. శ్వానము (Canis Major)

౭. అగస్త్యుడు (Canopus)

౮. రిగెల్ (Rigel in Orion)

ఈ యెనిమిదిచుక్కలును పాలవెల్లి కనతిదూర మున నున్నవి. సింహరాశిలోని మఘనక్షత్రము కొం చెముదూరమున నున్నది.

౯. Regulus in Leo.

## ఉత్తరాకాశమున

సప్తఋషులు — బృహద్వృక్షమునందలి క్రతు, పులహ, పులస్త్య, అత్రి, ఆంగీరస, వసిష్ఠ, మరీచి ఋషులు చక్కగా ఉదయించినారు. వారికి పశ్చిమ భాగమున లంబోదరముతోను, ఏనుగుముఖము తొం డముతోను విఘ్నేశ్వరుడు కానవచ్చుచున్నాడు.

'ప్రాతర్యావాణా ప్రథమా యజధ్వం' అను శ్రుతివాక్యము చొప్పున భాద్రపద శుద్ధచతుర్థినాడు సూర్యోదయాత్పూర్వము విఘ్నరాజును, పంచమినాడు సప్తఋషులను ఉదయించుటచేత వారికి క్రమముగా చవుతి, పంచమితిథులు ముఖ్యముగా పవిత్రములు, పూజార్హములైన దినములు. అట్లే మరియూరు మాసములకు చైత్రశుద్ధచవుతినాటికి సూర్యాస్తమానము కాగానే విఘ్నేశ్వరుడు ఉదయించును. కావున మన పంచాంగ కర్తలు చైత్రశుద్ధ చవుతినాడు 'గణేశపూజ' కలదని ఆనాడు వ్రాయుచుందురు. సప్తఋషులకు ప్రక్క, పశ్చిమముగా తీటా, ఫై, హెచ్ - టే - ఒ-గుర్తులుగల చుక్కలు ఆతని ఉదరమును సూచించును; కప్పా, అయోటాచుక్కలు, ఇంకను ఆదిగువ చుక్కలును చేరి అతని తొండమును సూచించును. ఆ దిగువ ఎలుకరూపము స్పష్టము. సప్తఋషుల దిగువ ఈశాన్యభాగమున దుశ్శసుని చూడనగును. పాశ్చాత్యులు ఈ చుక్కలను Canes Vanatici, అనగా The dog at the heels of the Bear (బుక్కమును పీడించు వేటకుక్క) అని చెప్పెదరు. సాధుజనులకు ఉద్వేగకారణమైన యీశ్వానమే వేదమునందు ఒక పతివ్రతను బాధించు దుశ్శసు అను దుష్టుడుగాను, భారతమున ద్రౌపదిని బాధించిన దుశ్శాసనుడుగాను వర్ణింపబడెను. వేణీమండలముప్రక్కనే ఈదుశ్శాసనుడుండుట గమనింపదగియున్నది.

ధ్రువక్షితిలో ఉదయాస్తమానము లెరుగక పరిభ్రమించు లఘుబుక్కపుచుక్కలలో ధాతవిధాతలు తూర్పుదెసకు వ్రాలియున్నారు. ధాతవిధాతలకును గగనమధ్యరేఖకును మధ్య మిత్ర, అగ్నినక్షత్రము లున్నవి. లఘుబుక్కపుతోకలో గగనమధ్యరేఖకటునిటు మహేంద్ర, కశ్యపనక్షత్రము లున్నవి. తోకచివర ధ్రువుడు మెఱయుచున్నాడు. వాయవ్యాకాశమున పాలవెల్లి నుదయించిన అప్సరసలు ప్రకాశించుచున్నారు. ఆదిగువనే ఇంద్రముద కలదు.

### పశ్చిమదెస

పేన్వఘూశ్వము చాలవఱకు అస్తమించినది. మీనరాశిలో మత్స్యద్వయములో ఒకమీనముకూడ అస్తమించినది. తూర్పున ఉత్తరఫల్గుని ఉదయించుటయు, పశ్చిమమున మీన మస్తమించుచుండుటయు గమనింపదగియున్నది. ఆకాశమున పరిభ్రమించు నీమత్స్యయంత్రమును ఫల్గునుడు పడవేసి, కన్యను చేపట్టినవాడై యున్నాడు. ద్రౌపదీకన్య వివాహనాటక మిపుడు ఆకాశరంగమున చక్కగా ప్రదర్శింపబడుచున్నది. మీనముదిగువ ఘోరవికారరూపముతో శింశుమార మిక అస్తమింపనైయున్నది. యమునకును శింశుమారమునకును మధ్య సముద్రవాలుకాపులినతటమున ఘోరజ్వాలారూపుడై ధుంధు డున్నాడు.

### దక్షిణాకాశమున

వృత్రపాద మనదగు రిగెల్ చుక్క సమీపమున నుదయించిన ట్లగపడుచు యమున ఎన్నోవంకరలు తిరిగి తిరిగి తుదకు నైరృతిదిశను దృష్టిపథమునకు తప్పుచున్నది. యమునకు ఎగువ ఉపరిచరవసువును, ప్రక్కనే బకదాల్భ్యుడును కలరు. ఉపరిచరవసువీర్యము గ్రహించి మానుషప్రసవమొనర్చిన అద్రికగూడ ఆసమీపమున నున్నది ఆగ్నేయమున దైవనౌకకు చుక్కాణి నడుపుచున్నట్లు అగస్త్యుడు అద్భుతతేజముతో మెఱయుచున్నాడు.

### తూర్పున

ఉత్తరఫల్గుని ఇప్పుడే ఉదయించి, మత్స్యయంత్రమును తెగనేయుచున్నట్లు కనబడుటను గూర్చి ఇప్పుడే ముచ్చటించుకొంటిమి. ఉత్తరఫల్గుని కెదురుగ నేత్రద్వయమువలె పూర్వఫల్గునిచుక్కలు రెండునుకలవు. ఫల్గునీనక్షత్రముల కీవల క్రాంతిరేఖపై సరిగా నిలిచియున్నది మఘ. ఇది కొడవలివంటి యాకారముగల చుక్కలకు పిడిస్థానమున నున్నదని పాశ్చాత్యులు వర్ణింతురు. మనవారు పల్లకిదండిపై నున్నదనిరి. మఘకు దిగువ సర్పాకారముగలిగి సర్పదైవత్యమైన ఆశ్లేష చుక్కలు లున్నవి. ఆశ్లేషకును ఫల్గునీ నక్షత్రములకును

గావ్రమధ్య నక్షత్రము లున్నవి. ఇవి sextant (వలయపు షడంశయంత్రమువంటి) చుక్కలని పడమటివారందురు. వేదఋషులు వీటిని గ్రావములనిరి. సోమరసము పిండి తీయుటకు సాధనములైన గ్రావశిలలు ఇవియని ఋషుల భావము.

పునర్వసు

పాలవెల్లిదాని పునర్వసు మహామీనము చక్కగా మాపడుచున్నది. ఇందలి పూర్వభాగాన, Procyon, Pollux చుక్కల మధ్య చంద్రుడున్నపుడు దృశ్యమెంతో మనోహరముగా నుండును. వల్మీకి పలుతావులలో నీయుపమానము చెప్పనువచ్చెను. నౌకా మండలమున నావ, పునర్వసుడనువ పాలవెల్లిలో, మందరగిరికి దానికి కవ్వపుత్రాడై యున్నాడు. క్షీరసాగరమథనము మనకు నేత్రగోచరమగుచున్నది.

అటు ఇంద్రునియగ్నిపుత్రుడైన చ్యవనుడు ఆదిమునే సుకన్యతో అశ్వినులపై నున్నాడు. చ్యవనుని కోపపుమాపులతో నీసైన పులోమకను రాక్షసుడు గ్రుడ్లు మిటకరించుకొనును ఆ ప్రక్కనే ఉన్నాడు. అశ్వినికి తూర్పుగా భరణియు, భరణికి తూర్పుగా కృత్తికలును మెరయుచున్నవి. కృత్తికలకు మనవారు పెట్టినపేరు పిల్లలకోడి. ఈ తెలుగుపలుకునకు తర్జుమ Pleiades అని భాషావేత్తలు చెప్పుచున్నారు. రోహిణి, మృగశిరనక్షత్రములు పాలవెల్లికి పడమటగా వ్రాలియున్నవి. కృత్తికలకు ఉత్తరముగా వరుసను భార్గవులుగల భృగుపరమమండల మున్నది.

ఇప్పుడే గగన మధ్యరేఖను గడచి పడమటకు వ్రాలిన నక్షత్రసమూహములలో ముఖ్యమైనవి సారథిమండలము, వృత్రమండలము. ఇందు సారథి మండలమునుగూర్చి ప్రాచీనగ్రీకుసిద్ధాంతులు ఇట్లు వర్ణించిరి:

If thou wouldst gaze on starry Charioteer
And hast hear legends of the wondrous
Goat;
The Goat and the kids, that on the purp_
ling deep
Oft look to rescue foundering mariners
Vast looming shalt than find him on the
Twin's left
His form bowed forward; Helice's high
head
Points at him from afar: on his left
shoulder
Lies the sacred she-Goat, Storied to have
suckled zens
And near to their bright mother with faint
rays
Glisten the two kids over the giant's wrist.

పరిశోధకుడా! నక్షత్రస్వరూపముతో తేజరిల్లుచున్న సారథిమండలమును తిలకించితివా? విచిత్రచరిత్రగల అజశాబకముల గాథలు వింటివా? సముద్రముపై నల్లలనాడు నావికులకీ నక్షత్రదర్శనలాభము మిగుల శుభావహమని

ఎంచుకొందురు. నీ వెఱుంగుదువా? మిథునరాశి కెడమ ప్రక్కనుండు నీసారథిరూపము ముందునకు వంగి యగపడుచున్నది, గమనింపుము! దూరమునుండి సప్తఋషులీ సారథిని తలయెత్తి చూచుచున్నారు. [అత్రి - క్రతు నక్షత్రముల మీదుగా పోవురేఖ సారథి మండలమును సూచించును.] ఈసారథి ఎడమభుజముపై నేమున్నదో చూచితివా? అది యొక మేక-పవిత్రమైన ఆడుమేక. ఆ మేకయే ఒకప్పుడు దేవదేవునకు పాలిచ్చి ధన్యమైనదను పురాణగాథలువింటివా? తల్లిప్రక్కనే మేకపిల్లలు రెండు-చిన్నవి-మిణుకుమిణుకు మనుచున్నవి, గమనించితివా?

ఈ సారథిమండలములో ప్రథమగణ్యము Capella అనబడు బ్రహ్మహృదయము. వెన్నముద్దవలె తెల్లనికాంతితో వెలుగు నీనక్షత్రము నెంతచూచినను చూడవలెననియేయుండును. ఈనక్షత్రమునుండి వెడలు తేజమును నేటి భౌతికశాస్త్రజ్ఞులు కొన్ని సాధనములచేశబ్దముక్రింద మార్చి వినుచున్నారు. రూపాయలను నవరసులలోనికి, అణాలు పైసలలోనికిని మార్చునట్లే ఎనర్జిని వివిధరూపములుగా మార్చుట నేటి అనుదినవ్యవహారము. జలపాతముయొక్క శక్తిచే విద్యుత్తు పుట్టించినట్లే, స్టీముశక్తిని గమనమునకు మార్చునట్లే తేజస్సును శబ్దములోనికి మార్చుట సాధ్యమగుచున్నది. నేటిసినీమాలలో మాట్లాడుఫిల్ములు (టాకీలు) ఈకారణముచేతనే మాటలాడకల్గుచున్నవి. బ్రహ్మహృదయముయొక్క వెలుగును శబ్దశక్తిక్రింద మార్చి టెలిఫోను రిసీవరులలో విని భౌతికశాస్త్రవేత్తలు ఆనందించుచున్నారు. ఇది వింతలలో వింతయని చెప్పుచున్నారు. [Incidentally the transformation of the light of Capella Auriga into sound audible in Telephone Receivers is one of the latest marvels in science achievement, not only to see but hear messages - there is the Beauty of the Golden Radiance.]

ఇక మనము ప్రస్తావించవలసిన నక్షత్రసమూహము ఆకాశమధ్యమున నద్భుతముగా తేజరిల్లుచున్న ఒరయన్ (Orion) వ్యాధునిసంపు. మృగశిరనక్షత్రముతో పున్నమసంధించు మాసము మార్గశిరము. అది హేమంతఋతువులోనిది. మార్గశిరమాసమున సూర్యాస్తమయమునుండి ఇంచుమించు రాత్రియంతయు ఈసంపు గనపడుచుండుట చూచియున్నాము. ఇపుడు సూర్యాస్తమనమైనతరువాత ఈసంపు చాలఎత్తుగా కనబడుచున్నది. ఈసంపును ప్రాచీనగ్రీకుకవిసత్తముడు ఆరేటస్ (Aratus) ఇట్లు వర్ణించినాడు:

"When chilling winter spreads his azure
skies
Behold! Orion's giant form arise
His arms extended strech over half the
skies.
His stride as large, and with a steady pace
He marches on and measures a vast space
On each broad shoulder a bright star
displayed
And three obliquely grace his hanging
blade
In his vast head immersed in boundless
spheres.
Three stars less bright, but yet as great
he bears
But farther off removed, their splendour
lost
Thus graced and armed his leads the
starry host."

"వినీలాకాశముదిసవ లోకము హిమబాధకు 'ఉహుహు' అని వణుకుచున్నపుడు, అదుగో! ఒరయన్యోధుడు తూర్పుదెస మహారాక్షసునివలె మీదికి లేచుచున్నాడు. నభోభాగము సగమాక్రమించినట్లు వాని బాహువులు వ్యాపించియున్నవి. మెల్లగ నిడుచున్నట్లగపడు వాని యడుగులుకూడ వాని మహాకాయమునకు తగియున్నవి. ఇట్లు వా డెంతదూరము

గడిచిపోగలుగుచున్నాడు? వాని బాహువులు రెంటి మీదను చుక్కనిచుక్కలు రెండు మెఱసిపోవుచున్నవి. నడుమున కడ్డుగా పటకావలె మూడుచుక్కలున్నవి. అందునుండి వాని ఖడ్గము వ్రేలాడుచున్నది. పటకా చుక్క లంత తేజములేకున్నను ఈనక్షత్రములునుగొప్పవే. దూరమగుటచేత కాంతి తక్కువ; అంతే. ఇట్టి సుందరరూపముతో ఈయోధుడు నక్షత్రమాలికలకు మార్గదర్శకు డగుచున్నాడు. నిజముగా నక్షత్రరూపములన్నింటిలో ఈ ఒరయన్‌రూపము అన్నివిధములచేతను అగ్రగణ్యము.

## కా మ ద హ న ము

ఈఫాల్గున శుద్ధ త్రయోదశి ౬-3-3౬ తేదీని మన పంచాంగకర్తలు "కామదహనము" అని వ్రాయుచుందురు. కాముడనగా మన్మథుడు. ఇతడు డిసెంబరు నెలలోనే అస్తమించును. మార్చినెలలో కామదహనమేమి అనిపించును. దీని కొక ప్రాచీన గ్రీకుగాథ కనబడుచున్నది. మనగాథలును గలవు.

గ్రీకుగాథ—వీనస్ (Venus) అను దేవత: ఆమె కుమారుడు మన్మథుడు (Cupid). వారు టైఫన్ (Typhon)అను రాక్షసునిబారిబడి పీడింపబడిరి. అపుడు వారుభయులును చేపలైరి. అందుచేత "మత్స్యద్వయం" మన్మథుడు, నామెతల్లి (Cupid and his mother) అని గ్రీకుపురాణములు తెలుపుచున్నవి.

మనగాథలు—మన్మథుడు మీనకేతనుడని ప్రసిద్ధి శ్రీ కృష్ణావతారమున మన్మథుడు ప్రద్యుమ్నుడై రుక్మిణీదేవి గర్భమున జన్మించెను. ప్రద్యుమ్నునివలన మరణము సంభవించునని తెలిసికొని శంబరుడను రాక్షసుడు రుక్మిణీదేవి ప్రసూతిగృహమునన్న అర్భకుని ఎత్తుకొనిపోయి సముద్రములో వైచెను. ఆ శిశువు నొక చేప మ్రింగెను. జాలరు లాచేపను పట్టి శంబరుని కిచ్చిరి. అందున్న శిశువు తన భర్తయని యెరిగి, మన్మథుని భార్యయగు రతీదేవి, ఈశ్వరఫాలనేత్రజ్వాలలో మడిసి బూదియైన మన్మథు డిట్లు మరల దేహధారియైనందుకు సంతసించి, మంచిమాటలచే శంబరు నొడబఱచి, ఆశిశువును పెంచెను. బాలకు డామె తన తల్లి యనుకొనుచు పెరిగెను. వానికి వయస్సువచ్చినప్పటికి ఆమె వానివలన మిథునధర్మము కాంక్షించెను. బాలుడు రోతపడెను. (మూ. భాగవతము. దశమస్కంధము. ఉత్తరభాగము.)

"మత్తకోకిల: "నాతనూభవు డీతడంచును నాన యించుక లేకయో, మాత! నీ విది యేమి నే డిటు మాతృభావముమాని సం, ప్రీతిగామిని భంగిజేసెదు పెక్కువిభ్రమముల్ మహా, ఖ్యాతవృత్తికి నీకు ధర్మముగాదు మోహముసేయగాన్".

పిమ్మట ప్రద్యుమ్నకుమారుడు రతివలన నీకార్యగతుల తెఱంగెఱింగి శంబరుని వధించి ద్వారకానగరమున నున్న తలిదండ్రులం జేరెను.

ఫాల్గునమాసములో సాయంకాలము అస్తమించినది మీనము. అది మన్మథుని కేతనము గావచ్చును. కాని మీనరాశి అస్తమించుట కామదహనోత్సవముగా ఏల పరిగణింపబడవలెనో విచారించవలసియున్నది.

# కీ. శే. అనిశెట్టి వెంకటసుబ్బారావుగారు

ఇరువదేడు సంవత్సరముల చిరుతప్రాయముననే మంచి పేరు పెంపులు సంపాదించుకొన్న యీ యాంధ్ర చిత్రకారుడు మొన్న ౧-వ తేదినాడు రాత్రి రక్తవిరేచనముల వ్యాధితో స్వర్గస్థుడైనాడు. చాలకాలముగ భారతికి వివిధ చిత్రాలంకారములను కైసేయుచుండిన వారిలో నితరుడొకడు. అభివృద్ధికి వచ్చుచున్న దశలో నితని యాయువిట్లు అకస్మాత్తుగ భంగిపోయినది. మరణశయ్యయందుండినప్పుడే, యితనికి మదరాసురాజధాని పెయింటింగు పరీక్షలో ప్రథమముగ నుత్తీర్ణుడైనందున గ్రిగ్ మెమోరియల్ సువర్ణపతకము వచ్చినవార్త చెవినిబడినది. పాప మాబహుమతి కండ్లార చూచు భాగ్యము మాత్రమాతనికి లేకపోయినది. ఇదివరకే యితనికి అనేకచిత్రకళా ప్రదర్శనములలో బహుమతులు లభించి యుండినవి.

ఇతని చిత్రములు భారతియందు ప్రకటితములగుచుండెడివి. వీరిరేఖలందు జీవకళ కనుపించుచుండును.

చిత్రకార ప్రపంచమునకును, భారతికిని, ఈతని బంధువర్గమునకును ఇతని మృతి తీరని వంతను కల్పించినది, శాంతిరస్తు.

# భగ్న హృదయులు

డాక్టరు పిశిపాటి వెంకటరమణయ్య

"మనమిప్పుడు చేయదగినది రెండో దేదీ లేదు. వీరిని వెంటనే సముద్రపుగాలి తగిలేచోటవుంచి ఏ ఔషధమిచ్చినా సరిపోతుందికాని, ఇక్కడనుంచి మనము అమృతమిచ్చినా లాభంలేదు. గాలిమార్పడం చాలా అవసరం. వీలుంటే చూడండి" అన్నాడు డాక్టరు. శక్తిసామర్థ్యాలొక లెక్కలోనూ నని వెలుపు నీరుసు పాపిరాజు మొలకలెత్తిన మీసాల నొకింత మెలపుమా మెడ కొంచమోరగా త్రిప్పి క్రిందికి చూస్తూ ఆలోచించి, ఒకనిమిషమైనతరువాత, ఒక్కవిసురున తల పైకెత్తి డాక్టరుగారివంక చూచి "మంచిది అలాగైతే రేపే బయలుదేరమంటారా" అని కుర్చీలోనుండి గబుక్కునలేచి, అప్పటినుండే సన్నాహం చేసేటట్టు తయారైనాడు. డాక్టరుగారుకూడా, "ఆహా! రేపనేమా టేమిటి? వీలుగావుంటే యీవేళే బయలుదేరినా మంచిదే." అని ప్రయాణంలో చేయవలసిన యేర్పాట్లన్నీ చెప్పి, తన ఫీజు తీసికొని చక్కావెళ్లాడు.

పద్మకు భర్తయొక్క ప్రగల్భాలీవరకెంతో అనుభవంలోవున్నా ఈవిషయంగూడ యింత చులాగ్గా తీసికోడానికి ఆశ్చర్యపడింది. పుట్టింటికి పంపుతాడేమో అనుకోడానికి అది సముద్రపుగాలి తగిలేచోటుగాదు. పైగా యిప్పుడక్కడా సరకూడా యేమీలేదు. ఉన్న రోజుల్లోకూడా యెప్పుడూ యేవో కొట్లాటలు అల్లరతోనే యింతకాలం గడిచింది. అలాంటప్పుడక్కడికి పోవడం తటస్థించదు. అనుకొని ఆలోచిస్తూవుండగానే పాపిరాజుగారువచ్చి "పద్మా, నీబట్టలేవైతేవున్నాయో అన్నీ సర్దుకోనుంచు. రేపురాత్రి మెయిలుకు మద్రాసు పోదామన్నాడు. మద్రాసుకనగానే మరీ ఆశ్చర్యపడింది. పద్మకు భర్తంటే భయభక్తులసంగతెలావున్నా ప్రతిమాత్రం మాట్లాడేదికాదు. సరసుడుకాడని ఆమెకు తెలుసు. మాట్లాడకుండా అదేప్రయత్నంలో అన్నీ సర్దుకొంటూ కాస్త అలసినట్లయితే పడుకో నాలోచిస్తూ వుంది. ఈపూట డాక్టరుగారి ఫీజివ్వడానికే అల్లుడికామకల క్రిందిచ్చిన ఆఖరు వెండిగిన్నెకూడా అమ్మవలసివచ్చింది కదా, మద్రాసు ప్రయాణమంటున్నారు, అక్కడి ఖర్చులసంగతలావుంచి ముందు ఇల్లు కదలి వెళ్లడానికి రైలుఖర్చులుకూడా లేవు. మద్రాసులో చేతిలోడబ్బులేందే పూటగడవదు. ఎక్కడికి పోవడము? ఎవరు చూచువారు అని పరిపరివిధముల ఆలోచనలోపడింది. మద్రాసులో "చౌదరీ అన్నయ్య" అడ్వకేటుగావున్నాడని తెలుసు. అయితే వాండ్లింటికి తీసుకపోతాడేమో అనుకోడానికి, అసలు తన పుట్టింటి వాండ్లతో వచ్చినతగాదా అంతా యిందుమూలాన్నే కదా? అలాంటప్పుడు వాండ్లింటికి తీసుకోపోడు. అని యేమీపాలుపోకుండా ఆలోచిస్తుంది. ఆఖరుకు మన మడగడ మెందుకు, కాస్తవోపికపడితే అదే తెలుస్తుందని రాత్రి గడిపేసింది. తెల్లవారింది. పాపిరాజుగారు ప్రయాణపు సన్నాహములన్నీ చేసికొని, 'అయితే యీవేళ ప్రయాణం నిజమన్నమాటే?' అని అడిగే వాళ్లకుమాత్రం 'శతవిధాల నిజమేకావచ్చు, టెలిగ్రామిచ్చా జవాబురావాలె' అని మాత్రం జవాబిచ్చేవాడు. ఇలావుండగానే టెలిగ్రాఫ్ మనియార్డరుతో బంట్రోతు వచ్చాడు. పద్మకు క్రమేణ భర్త చౌదరీ అన్నయ్యకే టెలిగ్రామిచ్చినాడని, వారు వెంటనే బయలుదేరిరావలసినదని, స్టేషన్‌వద్ద కారుతో కనిపెట్టుకొని యుండునట్లును, ప్రస్తుతం పంపుచున్న నూరురూపాయలను ప్రయాణపు ఖర్చులకొరకే పంపడమైనట్లు జవాబిచ్చినారని గ్రహించింది; ఆశ్చర్యపడింది.

వెంకటపతిరాజుగారి కుటుంబము పూర్వము నుండి మంచి పేరుప్రఖ్యాతులు గాంచినది. మంచి భూస్వాములు. రాజుగారు ఉదారస్వభావుడు. మాంచి

వొడ్డూ పొడవూగల చామనచాయ విగ్రహము. సహజముగ వొత్తుగ పెరిగి పెద్దవైన మీసాలు. పూర్వం తమ వెలమదొరలు మీసంమీద నిమ్మకాయ నిల్పేవారని అందరూ చెబుకొంటుంటే విన్నారేమో అసలే వొత్తయిన పెద్ద మీసాల కంఠగా, మీసంక్రింద అందు బాట్లో వున్నంతవరకు గడ్డాన్నిగూడ పెంచి కలిపి మెలేసివుంచేవారు. ఆయెత్తయిననుదురు, ఆపెద్ద యెర్రని కండ్లు అలవాటులేని పిల్లలు బెదురుకొనేలాగుండేవారు. కాని మనసు బహుమెత్తన. ఎవరి కేకష్టం తమగ్రామంలో సంప్రాప్తించినా చేతనైన సహాయం చేస్తూవుండేవారు. వెలమప్రభువులు తమబోటివారు కాపాడకపోతే మావంటి బ్రాహ్మణకుటుంబా లెట్లా జీవింపగలిగాయి అని యేబ్రాహ్మడో కూతురిపెండ్లనో, కొడుకుపెండ్లనో వచ్చి ఆశ్రయించారంటే అధమం అర్ధనూట పదార్లు పారేశారన్నమాటే. ఈఉదారత్వానికి తోడు తన కిద్దరాడపిల్లలు, ఒకకొమారుడే సంతతైనా అటువైపువారని, యిటువైపువారని కొంపనిండా ఎప్పుడూ త్రొక్కితే వెళ్లొచ్చేటట్టు జనం. ఆఖర్చు కంతుండేదేకాదు.

వ్యవసాయపు వ్యవహారాలు 'తలమనిషి' సుబ్బయ్యాచౌదరీగారే చూచుకొనేవారు తరతరాలనుండి సుబ్బయ్యాచౌదరీగారి వంశ మీ వృత్తిపైననే ఆధారపడి వెంకటపతిరాజుగారి కుటుంబము నాశ్రయించుకొని యుండేవారు. వీరి కొక్కరే కుమారుడు. ఇతనే 'చౌదరీ అన్నయ్య'. చిన్నతనంలోనే తల్లి చనిపోవడంచేత వెంకటపతిరాజుగా రింట్లోనే పెరుగుతుండేవాడు. చదువులో చూపుమండే భక్తిశ్రద్ధలకు తెలివితేటలకు మెచ్చుకొని వెంకటపతిరాజుగారు ఇతనికి బి.ఏ. వరకు చదువుచెప్పించారు. ఇంతలోకే వెంకటపతిరాజుగారి కుమార్తెకు వివాహపుయీడు వచ్చింది కనుక "చౌదరీ అన్నయ్య"కే యిచ్చి వివాహం చేయదలచినాడు. పద్మ తను చిన్నప్పటినుండీ యెరిగియున్న సుగుణసంపన్నుడు, విద్యాసంపన్నుడు, సుందరరూపుడు అయిన చౌదరీని వివాహమాడగలందులకు భగవంతుడనుగ్రహించినందులకు మహానంద మొందినది. చౌదరీ తనఉనికే రాజుగారి కుటుంబమువారియొక్క ప్రసాదమైయుండ, కావలయునన్నవారి యోగక్షేమములకై తన జీవితమునే అర్పించుటకు వెనుదీయనివాడై యున్నప్పుడు విద్యావతి, సుగుణరాశి, రూపవతియైన పద్మతో తన జీవితయాత్ర గడుపుకోగలదానికన్న తన జన్మసాఫల్యము వేరేమున్నదని మురిసినాడు. హృదయముల గలిపినారు.

ఇంతలోకే యీవార్త బంధుమిత్రుల కందరికీ తెలిసినది. దొరలపిల్లలను రైతులకిచ్చి వివాహము చేయుట కులమునకంతకు అపయశము నాపాదించుట యని, ఇట్టి సంబంధము జరుగకూడదని రాజుగారికి నిర్బంధము లెక్కువైనవి. మానుకొనుటకన్న గత్యంతరము కనిపించలేదు.

పాపిరాజు కిచ్చి పద్మకు వివాహము జరిపించినారు. పరాయిసంబంధముకుటచేతవరకేబుణబాధ లెక్కువై పోయిన రాజుగారి ఆస్తి యీవివాహపు కట్నములని, కానుకలని చేసిన వ్యయముతో పూర్తిగ శిథిలమైపోయినది. చౌదరీ బి. యల్. కూడ ప్యాసయి, మద్రాసులో అడ్వకేట్ అయి మంచి పేరుకీర్తులు గడించినాడు. శిథిలమైపోయిన రాజుగారి కుటుంబమున కాధారమిప్పుడు 'చౌదరీఅన్నయ్య' అయినాడు. తండ్రి సుబ్బయ్యాచౌదరీగారు గతించినారు. నెల తిరుగక మునుపే రాజుగారుకూడ కండ్లు మూసినాడు. పద్మ నత్తవారింటికి పంపదలచిన, కట్నాలప్పుడిచ్చే మామూలున్న రెండువేలిస్తేగాని పిలుచుకొని వెళ్లుటకు వీలులేదని పాపిరాజుగారు కూర్చున్నారు. సంవత్సరమైనది. రెండు సంవత్సరములయినవి. మూడుకూడ ముగియవచ్చుచుండెను. పాపిరాజాప్రక్కకు తిరిగిచూడడము మానేశాడు. చివరకు 'చౌదరీ అన్నయ్యే' యీవిషయమున గూడ జోక్యము కలిగించుకొని, అల్లుడి మామూలు రెండువేల కట్నాల కానుక చెల్లించి పద్మ నత్తవారింటికి పంపివేయించినాడు. కాని పాపిరాజుగారికి 'చౌదరీ అన్నయ్య' మీద అనుమానం. పద్మకు అక్కడికి వచ్చినప్పటినుండి యేదో జబ్బుగానే వుంటుంటే, పోనీ తనపుట్టింటికివెళ్లి కొన్నాళ్లుంటే గాలి మార్పుడంవల్ల బాగుంటుందేమోనని సూచిస్తే "చౌదరీ అన్నయ్య"ను చూడ

వలెనైనా అని యెత్తిపొడిచేవాడు! అందుకనే తనేమీ మాట్లాడకుండా, తనను సముద్రపు గాలికొరకు మద్రాసు కక్కడికి తీసికొనిపోయువుంచుతారో చూద్దామని వూరుకుంది. చివరకు తేలిన దిది.

నాటి పాపిరాజు ఉత్సాహం యింతా అంతా అని చెప్పడానికి వీలులేదు. నూరురూపాయలను చిల్లర నోట్లక్రింద మార్చేసినాడు. షర్టుజేబులో కనబడీ కన బడనట్లు పెట్టేవాడు. తను పరుపుమీద పడుకొని ఎవరైనా చూడడానికి వచ్చారని తెలియగానే మంచము మీద లేచి కూర్చొని జేబులో నోట్లను పరుపుమీద యెట్టికి పారేసినట్లు పడేసి ఓ కాగితపుముక్క విలువన్నట్లే 'ఒరేయి, అబ్బిగా, ఓ సిజర్సుపెట్టె కొనుక్కురా' అని ఓ నోటు విసరి పారేసేవాడు! పద్మాయమ్మగారి భయ మింకేమీ లేదు. తీరా రైలుకు బయలుదేరేటప్పటికి, టిక్కెట్టుకు లోటు పడుతుందేమోననే.

భోజనాలన్నీ అయినమీదట రెండు గంటలకు పద్మతో ముచ్చటలు మొదలుపెట్టినాడు. ఈ మాటా ఆమాటా మాట్లాడి క్రమేణా చౌదరీ అన్నయ్య మద్రాసురమ్మనమని టెలిగ్రాఫ్ మనియార్డరుకూడ పంపినాడని చెప్పినాడు. ఏమి మాట్లాడడానికీ తోచక ఓ అయిదునిమిషా లల్లాగే నిలబడింది పద్మ. ఉత్సాహంగా సిగిరెట్టొకదమ్ము కొడుతూ కాళ్లాడిస్తూ కూచున్నాడు పాపిరాజు. నెమ్మదిగా 'మళ్లీ అక్కడికే తీసుకపోతున్నారా' అంది పద్మ. "అవును మరి. డాక్టర్లెట్లాగో సముద్రపుగాలి మంచిదన్నాడాయె. నేను మద్రాసుకు వెళ్లినప్పుడంతా చౌదరీ మనల నిద్దరినీ వచ్చి కొన్నాళ్లుండిపొమ్మని యెన్నోసార్లడిగేవాడు. చాలసార్లు రైలుఖర్చులకని, యింక దేనికోనని బలవంతపెట్టి బోలెడంత డబ్బుకూడ యిస్తూ వుండేవాడు. ఇప్పుడు మన మక్కడికి పోయి, వేరేచోట బస చేస్తే బాగుంటుందా? అత నేమన్నా అనుకోడూ?" అన్నాడు తను మద్రాసులో వేరేవుంచి భరించగలిగిన సంగతీ, లేనిసంగతీ పద్మగూడ గ్రహించుకోలేనట్లు! పద్మ కీమాటలు ఆశ్చర్యంగొలిపినవి. ఈవూరుపోతానని, ఆవూరుపోతానని చెప్పి వచ్చేటప్పుడు పుష్కళంగా సంసార నిర్వాహణానికి డబ్బుతెస్తుంటే ఎవరో తనకయిన వారు కష్టదశలో ఆదుకొంటున్నారేమో భర్తనని అనుకొంటుండేది. చౌదరీ అన్నయ్యే డబ్బుపంపుతున్నాడంటే తనపరువుకు నష్టంవస్తుందని తలచి తనకుకూడ చెప్పలేదని గ్రహించింది. ఇప్పుడెల్లాగో అక్కడికిపోతే తెలియకపోదని తనకు చెప్పడం తటస్థించిందనికూడ గ్రహించింది. చౌదరీకిగల భక్తివిశ్వాసముల తలచుకొని ఒకకన్నీటిబొట్టుకూడ రాల్చింది. అది దుఃఖమో, ఆనందమో యెవరు చెప్పగలరు? ఇంతయికూడ చౌదరీ అన్నయ్యకు తనకు పేళ్లపెట్టడంలో వెనుకాడని భర్తతత్వ మేమైయుండునా అనిచింతించినది. పోనీ, నిష్కారణమైన ప్రేమయేకానిండు, విశ్వాసమే కానిండు, తనిట్టిసహాయము చేయుటకు హేతువని నమ్మజాలక పోయినప్పుడు తనక్కడికి కెందుకువెళ్లవలె? ఆడబ్బు కెందుకు తీసికొనవలె? పైగా యిప్పుడు తీసికొనివెళ్లి అన్నయ్యగారింట్లోనే పెట్టవలెనని తలంచడ మెందుకు? అని చాల దీర్ఘముగ ఆలోచించి ఇంకను ముందుముందేమి అనర్థాలు పుడతాయోనని, తనక్కడికిరానని గట్టిగా చెప్పివేసిందిభర్తకు. భర్త కోపవ్వనక్కాడు. 'ఇంకా నీవు చెప్పేటట్టే జరిగేటట్టుంటే యెంత చేసేదానివో' అని తిరస్కరించాడు. మాట్లాడకుండా ప్రయాణం కమ్మన్నాడు. తిరుగుజబాబు చెప్పేస్వభావం కాదు గనుక దైవంమీద భారంవేసి సంసిద్ధమయింది పద్మ.

ఉదయం ఆరుగొట్టేటప్పటికి పొదనక, పుట్టనక విజృంభించి తిరిగే పాము, పాములవాడి బుట్టలో దూరినట్లు సెంట్రల్‌స్టేషన్‌లో దూరింది రైలు. అసలే స్ఫురద్రూపి. దానిపైని తెల్లని కద్దరు లాల్చీ, ధోవతి, నల్లని నిండుక్రాపు. తగ్గట్టు పెద్ద నల్లఫ్రేముగల కండ్లద్దాలు, చేతికర్ర, ఆకుచెప్పులు, కాస్తమంచుగా కూడ వుండడంచేత స్నోఫ్లేక్ కాశ్మీరసాలువ పైన కప్పినట్లు వేసికొని తన నిరాడంబర పవిత్ర జీవితమును వెల్లడించెడి దుస్తులతో నిలిచివున్నాడు చౌదరీ అన్నయ్య ప్లాట్‌ఫారంమీద. లేడీస్ సెకండుక్లాస్ కంపార్టుమెంటు వంక చూచి ముందుకునడిచాడు. ఆనందం ముఖమున తాండవిస్తూ. పద్మ కనిపించింది. అసలే ఆనందంతో




అసలే విశాలమైన నేత్రములను రెప్పలిపైకెత్తి




వోరగా చూచింది

తాండవిస్తూవున్న ముఖం గంభీరమైనది. "పద్మా! పాపిరాజెక్కడ?" అని ఆనందంగా అడిగాడు. పద్మలేచి నిలుచుంది. చౌదరీ అన్నయ్య ముఖం చూచింది. అతను పుట్టినప్పటినుండీ యెరిగియున్న చౌదరీ అన్నయ్యే అయినప్పటికిని, అప్పుడు, అక్కడ ఆరూపాన్ని చూచి, ఆ నిండుహృదయంతో పిలిచిన పిలుపు వినేటప్పటికి గుండె దడుక్కు మన్నది యెందుచేతనో? తలవంచింది. ఊపిరాడకుండా బంధింపబడిన వ్యక్తి పరిశుభ్రమైన గాలిలో బడ్డట్టు పెద్ద నిట్టూర్పు విడిచింది. చెక్కిళ్లు యెర్ర బారినవి. అసలే విశాలమైన నేత్రములను రెప్పల పైకెత్తి వోరగా చూచింది, చౌదరీ అన్నయ్య అడిగిన ప్రశ్నకు జవాబుగా. చూచీచూడటంతోటే ఒక్కపెట్టున యెన్నో ప్రశ్నలువేసి తన్ను ముంచివేస్తుం దనుకొంటూ వచ్చిన చౌదరీకి పద్మయొక్క ఈప్రవర్తన కొంత ఆశ్చర్యము గలిగించింది. ఇంతలోకే పాపిరాజు కూలీనెత్తిపై సామాను పెట్టించుక పద్మవున్న పెట్టెవద్దకు వచ్చాడు. చౌదరీని చూచి "వచ్చారూ? సామానంతా యెత్తించుకొనివచ్చేటప్పటికి కొంచే మాలస్యమయిం"దని నవ్వుతూ 'ఇంకా దిగలే' అన్నాడు. పద్మా యమ్మ నెమ్మదిగా దిగింది. అందరూ మోటారులో కూర్చొని బయలుదేరారు.

పద్మాయమ్మ వీరమెట్ట గ్రామంలో పుట్టిపెరిగి, అత్తవారింటికి వెళ్లేటప్పుడుదారిలో రైలులో కూర్చొని ఏ ఒకటిరెండు చిన్న పట్టణ గ్రామములను చూచిందో కాని, మద్రాసువంటి మహాపట్నాల నెప్పుడూ చూచియెరుగదు. వాండ్ల అమ్మమ్మ అప్పుడప్పుడూ వచ్చిన

తరువాత స్వర్గమ నొకటుంటుందనీ, పుణ్యం చేసికొని చచ్చిన మనుష్యులంతా అక్కడ చేరుకుంటారనీ, ఆ స్వర్గం మహా అందంగా వుంటుందనీ, వెండి, మేడలు బంగారు ద్వారాలు, పూలతోటలు, ఉద్యానవనాలూ, సెలయేళ్లు ఇలాంటివన్నీ వుంటాయనీ, అక్కడ స్త్రీ పురుషభేదం లేకుండా ఇష్టంవచ్చినట్టు బంగారపు తూగుటుయ్యాలలో, ఇష్టమున్న పైకెగిరిపొయ్యే శక్తికూడ వుంటుంది గనుక, కొండశిఖరాల కెగరవచ్చునని యేమేమో చెప్పేది! మోటారులో పోతుంటే పద్మకు అవన్నీ జ్ఞాపకంవచ్చాయి. మోటారు శీఘ్రవేగంతో ఇటుతిరిగి అటుతిరిగి, ఒకగేటులో దూరి ఇటూ అటూ చక్కని పూలచెట్లున్న రోడ్డుమీదుగా పోయి ఒక బంగళాముందు నిలిచింది. ఆ సుందరమైన తోట మధ్యవున్న ఆ బంగళా చుట్టూతా మెట్లమీద అనుర్చబడ్డ ఆ పూలతొట్లు, పందిరికట్టి అల్లించిన ఆతీగ పొదరిండ్లూ స్వర్గతుల్యంగానే కనిపించింది పద్మకు మ్మకు. తన పుట్టింటివారు మంచి ఔన్నత్య స్థితిలో వున్నప్పుడైనా, పాడిపంటా, ధాన్యరాసులు, ఆవుల మందలు, పాలేరుజనం, ఆశ్రితజనం, వీట్లతో యిల్లంతా శోభాయమానంగా వుండేదేగాని, ప్రకృతినంతా స్వాధీనపరుచుకొని, ఒకబటను నొక్కితే వెలుతురు, ఒకబటను నొక్కితే గాలి, ఇలాంటి చెప్పడమూ చూడ లేదుసరేకదా, వీటినిగురించి వినికూడ ఎరుగదు. ఆ బంగళాలోని సోఫాలకు, కుర్చీలకు, ఆమంచాలకు, ఆ పరుపులకు, ఆదోమతెర్లకు, అడుగుపెడితే చెడిపోతాయేమోనని భయపడవలసినట్లుండే ఆక్రిందపరచియున్న కార్పెట్లకు అలవాటుపడేందుకు కొన్నిరోజులు పట్టిందామెకు. పాపిరాజుగారిలాంటి వనొన్ని చూచివున్నట్టు, అలవాటుపడివున్నట్లు నిరాఘాటంగా తిరుగుచూ, పద్మాయమ్మగారి బెరుకుతనాన్ని చూచి పరిహాసిస్తువుండేవాడు. తన కాయింట యెంతో స్వాతంత్ర్యమున్నట్లు మెలిగేవాడు. భార్యకొంకెక్కు తనెంతకష్టపడి వొళ్లు బాగుచేయించడానికేర్పాట్లు చేస్తున్నాడో అని సర్వంగా మెలిగేవాడు! సిగరెట్టు వెలిగించి సోఫామీద కాళ్లుబెట్టి పడుకొని, న్యూస్‌పేపరు పట్టుకొని బొమ్మలు చూచుకొంటూ విలాసంగా కాళ్లుకులికిస్తుంటే పద్మా చూస్తూ పూరకొనేది. కూర్చోడానికేర్పాటయిన సోఫాల నామాదిరిగా త్రొక్కిపారేస్తుంటే పైనున్న అందమైన బట్ట పాడైపోతుందేమోననిమాత్రమనుకొంటుండేది మనసులో.

చౌదరిగారు తిరిగి వివాహపు తలంపే పెట్టుకోలేదు. కారణమేమో యెవరికిగాని తెలియదు. అసలాయన కావిషయమై యోచించుటకే అవకాశము లేదేమో అన్నట్లుండేవారు. ఉదయము నిద్రలేచినదిమొదలు రాత్రి పడుకొనేదాకా ఏవో తీరని పని. వచ్చేపొయ్యేవాళ్లయింట్లకు సమాధానాలు చెప్పడంతోటే, ధర్మమని, దానమని వచ్చే యాచకులతోటే, సభలని, లెక్చర్లని వచ్చే పెద్దలతోటే సరిపోతుండేది వారి జీవితమంతా! ఎప్పుడింత భోజనము చేస్తారో, ఏరాత్రి వచ్చి పడుకొంటారో యెవరికీ తెలిసేదేకాదు. ఇప్పుడు బంగళామీది భాగమంతా పూర్తిగా పద్మకు, పాపిరాజుకు వదిలేశారు. డాక్టర్లకు చూపి విశేషభయమేమీలేదని ఇచ్చినఔషధములు పుచ్చుకుంటూ, నిత్యం సాయంకాల మోరెండు మూడు గంటలు బీచికి తీసుకవెళ్లి కూర్చోపెడుతుంటే చాలునని తెలిసికొన్నారు. ఒక మోటారు పూర్తిగా వారి అధీనంలో వదలిపెట్టి పాపిరాజుగారిని నిత్యము సాయంకాలము పద్మను వెంటబెట్టుకొని పోతూవుండవలసినదిగ చెప్పివేసినారు. ఇంట్లో భోజనభాజనాలకు కావలసిన యేర్పాట్లన్నీ పనివారిద్వారా చేయించుకోమని, కావలసిన డబ్బు వాడుకోమని యేర్పాట్లన్నీ చేశారు. ఎప్పుడో తనకు తీరికయున్నప్పుడు మాత్రము పైకిపోయి క్షేమములు విచారించుకొంటుండేవారు.

ఇలా కొంతకాలం గడచిపోయింది. పద్మాయమ్మగారి కారోజుకారోజు ఆరోగ్యం కుదుటబడుతూ వచ్చింది. క్రమేణ పద్మకు ఇంటి వ్యవహారాలన్నీ బోధపడుతూవచ్చాయి. అంతా నౌకర్లమీదే వదిలేసి, వాండ్లెంతంటే అంతడబ్బు పారేస్తూవుండడము,ఇంతెందుకయింది, అంతెందుకయిందని అడిగేనాథుడే లేకపోవడంచేత వారిష్టంవచ్చినట్టు సంసారాన్ని నాశనం

చేస్తున్నారని గ్రహించింది. తమకొరకై యింత సహాయపడుతున్నప్పుడు, తనకు రెండోపని లేకుండా తిని కూర్చునేబదులు కాస్త యింటివ్యవహారాలు కనిపెట్టి వుందామని ఆలోచించింది. చౌదరీగారే పద్మావారి మీద చూపుచుండే భక్తిగౌరవములనుబట్టి నౌకరులంతా పద్మను చూస్తే యెంతో భయభక్తులతో ప్రవర్తిస్తుండేవారు. పద్మకూడ వారిపై అనవసరాధికారముల చెలాయించకుండ, దయాదాక్షిణ్యములతోనే వారినంతా లోబరుచుకొంది. పాపిరాజుగారికి, తిండి, చేతినిండా కావలసినంత డబ్బు, తిరగడానికి తన స్వాధీనంలో పూర్తిగా వో మోటారేవుండడము, ఇంక వారికి కావలసినదే కాని, కలుగజేసికోవలసినదే కాని యేమీ లేదు. ఆ ఆనందంలో తన వూరు బంధువులు ఆ మాటే మరచిపోయినారు. అడక్కుండానే దేనికైనా కావలసి వస్తుందని చౌదరీగారిచ్చే డబ్బునంతా వృథాగా తగలేస్తున్నాడని పద్మకుమాత్రము వుండేది. పైకేమీ అనలేకపొయ్యేది. ఎప్పుడైనా తనకొరకు నిత్యము యేదో చీరని, రవికని కొనుక్కు తెస్తుంటే మాత్రము 'ఎందుకండీ అంతంత డబ్బు తగలేసి యిప్పుడవి కొనకపోతే జరగదా' అని మాత్రము మెల్లగా మందలించేది. కట్టినచీర కట్టించకుండా, బీచికితీసికొని పోతూ, తనదర్జా, లోకులకంతా చూపించవలెననే అతని ఉద్దేశం! క్రమేణా పాపిరాజునుకూడ దుబారాఖర్చు చెయ్యకుండా చేసింది. చౌదరీగారితోకూడా పాపిరాజు లేనిసమయంగా చూచి 'అన్నయ్యా, మీ రూరికే ఆయనచేతికి డబ్బిస్తూవుండబోకండి, తగలేస్తారు' అని కూడ చెప్పింది. ఆమాటకు చౌదరీగారో నవ్వునవ్వి జబాబు చెప్పకుండా వెళ్లిపొయ్యేవారు

సుందరేశం అరవో, ఆంధ్రుడో యెవరికీ తెలియదు. అరవవారొస్తే అరవంస్పష్టంగామాట్లాడువాడు, తెలుగువారితో తెలుగు స్పష్టంగా మాట్లాడ్తాడు. ఇంట్లో గూడకట్టు కడ్తాడు. బయట పింజబోసి ధోవతి కడ్తాడు. అరవవిందులకు ఆక్షేపణలేదు. ఆంధ్రగోంగూర ఆవకాయకు ప్రాణాలర్పిస్తాడు. ఆంధ్రులముందర వలను, అరవలముందాంధ్రులను ఆక్షేపణ చేస్తుంటాడు.

(ఇతని పుట్టుపూర్వోత్తరాలను తెలుసుకోవాలెనని సరిగ్గచేసే స్కాటులెవరైనా వుంటే యితను మద్రాసు కివల నెల్లూరు కావల మధ్యయెక్కడో పుట్టుంటాడని తేల్తుందనుకుంటా! ఎక్కడపుడితేనునకు కావలసినదేమున్నదిలెండి) మనిషిమాత్రం అసాధ్యప్పిండం. చౌదరీగారిచ్చే అరవైరూపాయలజీతంతో అరడజన్ పిల్లలను బెట్టుకొని, మద్రాసువంటి మహాపట్నంలో బేబీఆస్టిన్ కారు బెట్టుకొని సంసారం నిర్వహించుకొంటున్నాడంటే శక్తిసామర్థ్యాలు వేరేచెప్పడమెందుకు? చౌదరీగారికి కుడిచెయ్యివలె వుండేవాడు. కేసుకుకావలసిన సగం అంగం సుందరేశమే వెతికిపెట్టేవాడు. వచ్చిన క్లయింట్లను సమ్మోహనాస్త్రంవేసి లోబరచుకుంటాడనే చెప్పవచ్చును. చౌదరీగారి! ప్రాక్టీసు అభివృద్ధంతా సుందరేశంమూలాన్నే యేమో అనికూడ అనిపించేది ఒకకోర్టు వ్యవహారమ కేమిటి? ఇంటివ్యవహారమంతాకూడ సుందరేశమే చూచుకునేవాడు.

ఇప్పుడింటివ్యవహారమంతా పద్మే చూస్తూవుంది. సంసారాన్నంతా ఒక పొదుపుకు తేనుమొదలు పెట్టింది. సంసారస్త్రీకిపూరికేతిని కూర్చోడమంటే మహాకష్టము. పైగా చౌదరిగారి సంసారము ఆడదక్షతలేని. ఎంత వుతుందో, యెంతపోతుందో యెవరికీ తెలియదు. ఇది చూచి పద్మ వూరుకోలేకపోయింది. ఇంటివిషయాలన్నిటిలోనూ పద్మే జోక్యం కలిగించుకోడం. చౌదరీగారు పద్మంటే ఓ దేవతలా గౌరవిస్తూవుండడంచూచి సుందరేశాని కోవిధమైన యీర్ష్యపుట్టింది. ఏదో తెంపకంపెడితేకాని లాభంలేదని యోచించాడు. నెమ్మదిగా పాపిరాజుతో స్నేహం చెయ్యడం మొదలుపెట్టాడు.

క్రమేణా పాపిరాజుగారు చౌదరీగారి అవ్యాజకరమైన ప్రేమను అనుమానించడం మొదలు పెట్టాడు. దీనికకారణం-రెండోమనిషి లోపల పోవడాని కవకాశం లేని చౌదరీగారి పడకగదిలోకి సుందరేశం యెలాగో పాపిరాజును తీసికొనివెళ్లి పెద్దసైజున తయారుచేయించి యున్న పద్మయొక్క ఫోటో ఆయిల్ పెయింటింగును చూపించాడు. ఏదో అదిపనిగా చెప్పినట్లుగాకుండా, ఆమాట యీమాట పెట్టి చౌదరీగారికి పద్మనిచ్చి వివా

హంచేయడానికి సర్వసిద్ధంచేయడం, బంధువులందరూ అడ్డుతగలడంచేత విధిలేక, భగ్నహృదయయైన పద్మను తనకుముడిపెట్టడం, పద్మకు మనసిచ్చి తిరిగి రెండో నారికి తనహృదయాన్నర్పించి వివాహంచేసుకోడానికి యిష్టంలేక చౌదరీగారు బ్రహ్మచర్య మవలంబించడం, యిత్యాది విషయాలన్నీ చిల్వలు పల్వలుపెట్టి చెప్పడం చేతనూ, ఏకారణమూ లేనిదే వేలువేలు చిల్లిగవ్వలక్రింద పద్మకొరకు, తనకొరకు ఖర్చుపెట్టడంఅసంభవమనిఅను మానించడం మొదలుపెట్టాడు. ఏదో బాధ. ఎవరితోనూ యేమీ చెబుకోలేనిబాధ ననుభవిస్తున్నాడు పాపిరాజు. చౌదరీగారి నిష్కళంకమగు పవిత్రజీవితమును సందేహింపనూ లేదు. శత్రుసేనలు ముట్టడింప తమపాతివ్రత్యమునకేమైన భంగముకలుగునేమోయని అగ్నిగుండములకాహుతియైన ధీరక్షత్రియ వంశమునపుట్టిన పద్మయొక్క పాతివ్రత్యమునుకూడ శంకించుటకు మనసుచాలకున్నది. మనసిచ్చి మామూలుగ పద్మతో మాట్లాడడము మానినాడు. పూర్వరీతిని పద్మను వెంటబెట్టుకొని బీచికి వెళ్లుటకు ఉత్సాహం చూపుటలేదు. ఏదో వెర్రివానివలె తనిష్టము వచ్చినట్టు తాను తిరగడం మొదలుపెట్టాడు. పద్మ "కొన్నాళ్లు వెన్నెలకొన్నాళ్లు చీకటి" పాపిరాజుతో అనుభవించడం క్రొత్తగాకపోయినా, పరిస్థితులను బట్టి జంకవలసివచ్చింది. ఇంట ఆడదిక్కుతలేదు. మగనూ పెండ్లాలకూరంపుగట్టేయిూరోజుల్లో తనున్న పరిస్థితులలో తనను బదనామీ చేయడమంటే. లోకానికావంత శ్రమ కూడా లేదని తెలుసు. ఏనిండైనను తనుభరించగలదుకాని శుకమహర్షినిబోలు 'చౌదరీ అన్నయ్య'కు తనమూలాన అపయశమురావడానికి సహింపజాలదు. అన్నయ్య చేయుచున్న సహాయానికి యీ అపయశము తెచ్చిపెట్టను. దాయని పరితపించుచుండేది. చౌదరీగారి కేగోడవా తెలేదు. ఆయనపనేమో, ఆయనేమో. బీచికిమాత్రము డాక్టరుసలహాప్రకారం నిత్యం పోతూవున్నట్టులేదని మాత్రం తెలుసుకొని, కారణమేమని పద్మనడిగారు. పద్మ "యేమీలేదు"యిప్పుడు వొంట్లోబాగానే వుంటున్నదిగదా అనేశ్రద్ధే అన్నది." అలాకాదు. డాక్టరుగారెన్నాళ్లు చెబుతారో అన్నాళ్లు చెప్పినట్లు వినాలి" అని మాత్రం చౌదరీ అన్నయ్య అని వెళ్లిపొయ్యేవారు.

ఇలావుంటూవుండగానే, పద్మ అత్తగారికిజబ్బుగావున్నదని వెంటనే బయలుదేరి రావలసినదని పాపిరాజుకు టెలిగ్రామ్‌వచ్చింది. తనిల్లువదలివచ్చి నాలుగు మాసములుపైగా అయింది. పద్మనింకా ఒకటి రెండు మాసము లుంచితే మంచిదని సలహాయిచ్చారు డాక్టర్లు. పైగా యిప్పుడు పద్మను వెంటతీసికొనే వెళ్లేటట్లయితే అక్కడ మందుమాకులు పథ్యపానాల సంగతలావుంచి యింత భోజనసౌకర్యానికన్నా దిక్కులేని పరిస్థితుల లోవున్నాయి యింటివ్యవహారాలు. ఇక్కడ సర్వవిధముల స్వంతయింటికన్నా యెక్కువ స్వతంత్రంగాజరిగిపోతున్నది. చౌదరీగారు దేవుడంటివాడు. ఉన్నామని భారంగా తలవడంలేదు సరికదా వెళ్లిపోదామంటే మనసునొచ్చుకుంటారేమోననికూడ సందేహం. అయినా సంగతిచెప్పి యేమంటారో చూద్దామని టెలిగ్రామ్ చేతబట్టుకొని చౌదరీగారికి చూపినాడు. ఇద్దరం బయలుదేరి వెళ్ళుదామని చెప్పినాడు. చౌదరీగారు వెంటనే "యిప్పుడు తొందరపడి యిద్దరూ వెళ్ళడమెందుకు? ముందు మీరు పోయిచూచి అంతజబ్బుగావుంటే వెంటనేమళ్ళీ టెలిగ్రామివ్వండి. పద్మ నెవరిసైనా తోడిచ్చి పంపుతాను. లేకుంటే డాక్టర్లింకా ఒకటి రెండు మాసములుంచితే మంచిదన్నారు గనుక కొంచెము నెమ్మది చూచుకొని మీరువచ్చారంటే, యిద్దరూకలసి వెళ్ళవచ్చును. ఇదీ నాఅభిప్రాయం. ఆపైన పద్మనుకూడ కనుక్కోండి ఏమంటుందో" నని సంకోచం లేకుండా చెప్పివేశారు. పాపిరాజుగారు మంచిదన్నారు. "ముందు నేనేవెళ్లి అంతవసరమైతే టెలిగ్రామిస్తాను, లేకుంటే నెమ్మది చూచుకొని వారంపదిరోజులలో తిరిగివస్తాను. పద్మను కనుక్కోవలసిన అవసరముకూడ లేద" న్నారు. చౌదరీగారే స్వయముగావెళ్ళి పద్మ అభిప్రాయాన్నడిగారు. ఏమో తనొంటరిగావుంటుందో లేదో తీరా పాపిరాజు వెళ్లిపోతే తరువాత కష్టమవుతుందని అభిప్రాయపడ్డారు. పద్మ వొంటరిగానుండుట కేమాత్రము జంకలేదు. పైగా "ఆమెకెప్పుడూ యిలాంటి రోగాలొస్తూనేవుంటాయి. ఎక్కడైనా యింత తిని సుఖంగా మేమిద్దరము బ్రతుకుతున్నామంటే చాలు. వోర్వలేని రోగం

వస్తూనేవుంటుంది. ఈవేళ క్రొత్తగా దీమెకీరోగం-టెలి గ్రాములివ్వడం! కావాలంటే అయన్నే పొమ్మనండి. నేమాత్రం వెళ్లను. మిమ్ముల నడిగితే డాక్టరు గారింకా నెలరోజులుంటే మంచిదన్నారు గనుక, అదేమాట చెప్పి వారిని వెళ్ళి చూచి త్వరగా రమ్మనమనండి" అంది. చౌదరీ గారికి సంతోషము, ఆశ్చర్యము రెండూవేశాయి. ఇంతకాలం వారు సంకోచిస్తూ వచ్చింది, తను పద్మకొరకెంత ఖర్చుపెట్టినా, ఎన్ని సదుపాయాలుచేసినా పరస్థల మని, పరాయిమనిషి నని మనసులో బాధిస్తూ వుంటుందేమో నని. ఇప్పుడా సంకోచము తీరిపోయింది. ఏది తన జీవితపరమావధిగా తలుస్తూవచ్చారో అది సఫలీకృత మైనదని వుప్పొంగిపొయ్యారు. పద్మ సెంత యెరిగియున్నా, ఎంతటి బాల్యస్నేహమైనా, తమచేయి మీదనిపించుకొనే బ్రతికిన సంసారులు గనుక ఈ లేమికి, పరాశ్రయానికి కుందుతుందేమో నని అనుకొంటూ వచ్చారు. ఇప్పుడు తనైనా, తమైనా వొకటే నను భావము నిశ్చయమైనదని తెలిసికొనుటకు మహదానంద భరితుడైనారు చౌదరీగారు.

పాపిరాజుగారెంత సమాధాన పరుచుకొనుచున్నప్పటికిని మనశ్శాంతిమటుకు కలగడంలేదు. తల్లి యిప్పించిన తంతివార్తకొరకంతభయముండదని తెలియును. అయినా యెప్పుడూ కాలా లొకమాదిరిగానే యుండకపోవచ్చును. నిజంగా అంత ప్రమాదకరంగానే వుందేమో? భార్యను వెంటబెట్టుకొనిపోతే, జబ్బు మనిషి. పైగా అనుకూలాలు లేవు. ఏదో వచ్చినాము. సర్వవిధముల స్వగృహమునకన్న ఎక్కువగ జరిగిపోతున్నాది. దగ్గిరున్నప్పటి ఆదరణ దూరమగు కొద్దీ తగ్గిపోవుట సహజము. ఆదరించువారుంటే ఆశ్రితులు తక్కువా? తమ కాయింటియందున్న స్వాతంత్ర్యమును చేతులారా పోగొట్టుకొంటే తమస్థానమున చౌదరీగారి ఆప్తులింకెవరైనా చేరవచ్చును. అప్పుడు కసరపడి వచ్చిన, ఆ వచ్చియున్నవారితో పోటీపడవలసి వచ్చును. పద్మను వదలిపెట్టి వెళ్లిన చాలును. తమస్థానమున కాయింటలో టురాదు. కాని యెంత మంచి గోవునైనా కాపరిలేకుండా గనిమమీద వదలిపెడితే చేనుమేయకుండా వుంటుందా? వాస్తవానికొస్తే చౌదరీ పద్మల ప్రేమ పవిత్రమైనది. చిన్నప్పటినుండి వొకరినొకరు ప్రేమించుకొన్నట్టిది. పైగా మంచి రూపరేఖావిలాసములు, విద్యాసుగుణసంపత్తి, సిరిసంపదలు కలవాడు. ఎంతటి నిగాఢమైనదో కావున్న చౌదరీగారి ఆ హృదయమున మరొకవ్యక్తికి స్థానము లేదన్నట్టు బ్రహ్మచర్య మవలంబించినాడు. నిజముగ యోగియైనాడు! ఇట్టి ఆదర్శనీయులగు మహాపురుషులు లోకమున అరుదు. పద్మ అబల. తల్లిదండ్రుల ఆజ్ఞల నతిక్రమించుటకు అస్వతంత్రురాలు. సంఘ మలాంటి కట్టుబాట్లు చేసినది. మనసులోని నిశ్చయము బయట చెప్పకొనలేదు. చెప్పకొనినను వినువారు లేరు. పురుషుడు వివాహము చేసికొనవలచనప్పుడు ఎవరి నిర్బంధమూ వుండదు. స్త్రీ నట్లు సంఘము వదలదు. ఏ దారినపోవువానికైనను తెచ్చి ముడివేయించి తీరవలసినదే. స్త్రీ యొక్క మనోభీష్టత తెలిసికోవలెనని యెవరికీ పట్టదు. ఏ హిందూస్త్రీ అయినా సాహసించి పైకి చెప్పినదో, కులభ్రష్టింద లెక్కగట్టారే! పద్మకూడ యీ కులకట్టుబాట్లకే బలియైనది. తనువును సంఘముచేతులలో బెట్టినది! ఏ ముహూర్త మొగ మెరుగని నన్ను బట్టుకవచ్చి బ్రాహ్మలామంత్రించి ముడిగట్టినట్టి ప్రేమ మాట. పాపము పద్మ తన కింకలోకము నేనేనని జీవితము నర్పించినది. కాని హృదయము భగ్నమయినది. ఇదియే యీ శరీర అస్వస్థతకు కారణము. పద్మఆరోగ్య మిప్పుడు కొంత బాగున్నదనిన, ఏసముద్రపుగాలియు కాదు. చౌదరీగారివిలోకనాదరములే కారణము. ఇట్టి సందర్భములలో నేను వారి ప్రవర్తనల సందేహించుటకే అవకాశము లేదొకటి, లేక అట్టి దోసగులేమైన ముందు నాపరోక్షమున జరుగునేమోనని శంకించవలసి వచ్చిన అట్టి సంకోచపడుటకు నాకు హక్కుగూడలేదు. అని అనేకవిధముల తనలో తాను తర్కించుకొని, పద్మను చౌదరీగారింటనే వదలి ప్రయాణమై వెళ్లినాడు. కాని హృదయమున శాంతిలేదు.



పోగానే పాపిరాజుగారు తల్లికి కొంచెము నెమ్మదిగానే వుందని, సాధ్యమైనంత త్వరలో బయలుదేరి రాగలమనునట్లు చౌదరీగారి పేరనే ఉత్తరం వ్రాశారు. ఆ తరువాత నెలనంబడి నెల ఆరు మాసములు గడచినవి. కబురు లేదు! పాపిరాజుగారు స్వయముగ వ్రాయనూ లేదు. పద్మ వ్రాయు ఉత్తరాలకు జవాబూ లేదు. ఇంతకాలము చౌదరీగారు దనొక గొప్ప విషయంగా ఆలోచించనే లేదు. పాపిరాజుగారి కేవో యింటి వ్యవహారములు, తొందరలుండి రాలేదేమోనని, పద్మకు ఆరోగ్యము పూర్తిగా కుదురువరకు తొందరేమని అనుకొని రాలేదేమోనని మనసుకే పట్టించుకోలేదు. పద్మకూడ స్వగృహంలానే గృహకృత్యాలన్నీ చూచుకొంటూ దిక్కు దివాణం లేని కాపరాన్ని పద్ధతికి తెచ్చి కేవలం వంటవానిమీద ఆధారపడవలసియుండిన రుచులను మార్చి స్వహస్తంతో చౌదరీగారికి రుచులు చేసి పెడుతుండేది. శ్రమ పడవద్దని యెంతనివారించినా వూరుకొనేదికాదు. పక్క ప్రక్కన నిలుచుండి భోజనము పెట్టించేది. బట్టలనన్నిటిని పదిలపరచేది. కాలానుగతికముగ స్వపరవిచక్షణే విస్మరించారు.

పద్మ చౌదరీగారింట ప్రవేశించి యేణ్ణర్ధమయింది. అనిష్కళంకమగు ప్రేమను లోకము భరింపజాలక పోయినదేమో, అనుమానింప మొదలుపెట్టింది. 'మాచావురా! చౌదరీ యింతమంచివాడనుకొన్నాము. కబుర్లెన్నైనా చెప్పవచ్చు. జితేంద్రియులు కావడమంటే మాటలా? పోనీ దొంగయేడ్పు లేడవకపోతే పెండ్లి చేసికో కూడదూ? పండువంటి కాపరాన్ని పాడు చేసి, పైగా భర్తను దగ్గర రానీకుండా తరిమివేసి, యెంత పనిచేస్తున్నాడో!" అని యిలాంటి ప్రసంగాలు చెలరేగినవి. ఆనోటా ఆనోటా పడి చౌదరీ నోటిసు దాకావచ్చినవి. చౌదరీకండ్లు తెరచినాడు. మనశ్శాంతి గోల్పోయినాడు. తన నిష్కళంకమగు ప్రేమయే పద్మ యొక్క పవిత్రజీవితమునకు కళంకము తెచ్చి పెట్టుచున్నదని



ప్రకృతి ఆలింగనమున లీనమైనది

పశ్చాత్తాపపడినాడు. పాపిరాజుగారికి స్వయముగా యెన్నిమార్లో కబురు పంపాడు. లాభము లేకపోయింది. చివరకు నిజపరిస్థితులన్నీ పద్మతో చెప్పివేసినాడు. పద్మహృదయము నిప్పులలో పొర్లించినటు వేదనపడజొచ్చినది. తనకొరకు సర్వస్వము ధారబోయ నుంకించిన చౌదరీ అన్నయ్య పవిత్రజీవితమునకు భంగమాపాదించుటకు తనయౌనికు కారణమగుటకే యెక్కువ చింతించినది.

చౌదరీగారు పద్మను తగినతోడిచ్చి పూరికి పంపివేయు చున్నట్లు పాపిరాజుగారికి తంతివార్త పంపినాడు. పద్మశీవముల 'చౌదరీ అన్నయ్య' విశాలమగు బంగళాయందు స్వేచ్ఛావిహారముల సలుపవదలినట్లు తనుమాత్రయై బయలుదేరినది. చౌదరీగారు స్టేషనుకు తీసికొనివెళ్లి రైలెక్కించి తిరిగివచ్చినారు. పద్మయేదో దీర్ఘాలోచనలో మునిగినది. తోడివారితో మాటముచ్చట మానినది. కాగితము కలముమాత్రము తీసికొని యేదో వ్రాయను మొదలుపెట్టింది. రాత్రి పదకొండు దాటింది, తోడివారు కునికిపాట్లు పడిపడి నిద్రించారు. నెల్లూరి స్టేషనునుండి రైలు మెల్లగా కదలసాగింది. నిండు వెన్నెలలో శ్రీరంగని గాలిగోపురపు బంగారుకళిశములు నిశ్చలకాంతుల ప్రసరించుచుండ చూచినది.

ధ్యాననిమగ్నయై తను చిన్నప్పుడు నేర్చిన

ఘను లాత్మీయతమోనిశ్చ త్తిగొఅకై
గారీశుమర్యాదనే
వ్వని పాదాంబుజతోయమందు మునుగన్
వాంఛింతు రేనట్టినీ
యనుకంపన్ విలసింపనేని వ్రత
చర్యన్ నూఱు జన్మంబులన్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్
నిక్కంబు ప్రాణేశ్వరా !"

అని పఠించినది. తృప్తిచాఁక తిరిగి తిరిగి అపద్యమునే పఠింప మొదలిడినది. చల్లగ తలుపుతెరచినది. భగవంతుని చల్లని కరస్పర్శయో అన్నట్లు నిండుగ ప్రవహించుచున్న పెన్నానది ప్రవాహపుగాలి తన చిబుకముల నొత్త మొదలిడినది. ప్రకృతి ఆలింగనమున లీనమైనది.

చౌదరీగారికి వ్రాసియుంచిన లేఖ చేరినది. అందలి ముఖ్యాంశము "నే, నైహికసుఖముల కాసింపనైతిని 'నీయనుకంపన్ విలసింప' దలచితిని. లోకము దీనికిని సహింపదాయెను. ఇక నాజీవితము వ్యర్థము. మ. ఘనులా............ప్రాణేశ్వరా !" అని పూర్తి జేసియుండెను.

చౌదరీగారు తన యావదాస్తియు పద్మపేరు మీద 'సేవాసదను'కు వ్రాసి యిచ్చినారు. మతిభ్రమచే దేశదిమ్మరియైరని కొందఱును, పద్మసన్నిధికే చేరిరని మరికొందరును అనుకొందురు.

---

# కలగూరగంప

## 'కారకోల్' శిథిలములు

ప్రాచీన 'మయ' శిల్పము లన్నింటిలో 'కారకోల్' శిల్పము మిగుల నద్భుతమయినది. మెక్సికో దేశమునందలి 'యుకాటన్' మండలమున 'చిచెన్ ఇజా' లో నిదియున్నది. వర్తులాకారముననుండు శిలానిర్మాణ మిది. ఇట్టిది మయశిల్పమున నరుదుగా నుండును. ఖగోళ పరిశోధనముకొరకు ఇది నిర్మింపబడియుండవచ్చును అని పురాతత్వశాస్త్ర కోవిదు లనుచున్నారు. లోకశత్రువుల రాకపోకల కనుగొని చుట్టుపట్టుల మండలములవారికి తెలుపుటకని కూడ నీగోపురము కట్టబడియుండవచ్చునను నది ఒకమతము. వీనిని పదునైదవ శతాబ్ది చివర కట్టియుందురని తలపబడుచున్నది.

## శ్రీ పాపినేని రాఘవరావుగారు, బి. ఏ.,

వీరు ప్రొఫెసరు లక్ష్మీనరసునాయుడు గారి మనుమలు, నటకులు, నాటకకళాపరిచయము గలవారు. పాత్రధారణమున ఆహార్య మాకర్షకముగ నుండును. వీరు సామాన్యముగ స్త్రీపాత్రములనె ధరించుచుందురు. 'డాన్సింగ్ గరల్', 'ఎడ్యుకేటెడ్ గరల్' అను నాటకములలో నాయికా పాత్రములను, 'ధరణికోట' లో వీరమాతపాత్రములను, 'రాణాప్రతాప్' లో జోషీబాయిపాత్రమును, 'చిత్రనళీయము' న విపుల పాత్రమును ధరింతురు. 'హేంలెటు' న హేంలెటుపాత్రమును ధరింతురు. ఇందు వీరి స్త్రీపాత్రములచిత్రములు మూడును, హేంలెటుపాత్రముచిత్రమును గలవు.

# ఆంధ్రాభ్యుదయము

వీరు ఆంధ్ర విశ్వకళా పరిషత్సంబంధి విక్రమదేవ కళాశాలలో బి. యస్ సి. (ఆనర్సు) పరీక్షకు రసాయన శాస్త్రమున శిక్షణమంది అందు మొదటి తరగతి నుత్తీర్ణులై శ్రీపతి సీతాపతిరావుగారి స్వర్ణపతకమును మొన్నటి పట్టప్రదానోత్సవమున బడసిరి. ఉన్నత విద్య బడయుటకై వీరు కడచిన నవంబరు నెలలో ఇంగ్లండునకు వెళ్ళిరి. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆనర్సు కళాశాలనుండి ఇంగ్లండునకు పోవుటకు వీరే ప్రథములు.

ANDHRA PATRIKA

శ్రీ బలజపల్లి కృష్ణశాస్త్రిగారు




### కవిగారి మనుగడ

"మహనీయుల మనుగడలు మానవులను మంచి దారిని నడిపించును." కవిగారు (దూపల్లి రామచంద్ర శాస్త్రిగారు) కవిగాను, గ్రంథకర్తగాను, పండితులుగాను, దేశసేవకులుగాను ఆంధ్రదేశమంతట స్థిరకీర్తి గడించినవారు. వారి జీవితమంతయు నాదర్శప్రాయమై సామరస్యమున నడచినది. నిరాడంబరులైన, ఆదర్శప్రాయులైన వీరి మనుగడ యెరుక ఆంధ్రుల యున్నతి కొరకడి కాగలదు. ఇందుకు సహాయము కల్పించిన జయంతి సుబ్బారావుగారు అభినందనార్హులు.

ఇప్పుడిప్పుడే యిట్టి మహనీయ జీవితచరిత్రలు, ఆత్మకథలు ఆంధ్రమున పాటకరించుచున్నవి. జాత్యభ్యుదయమున కిట్టివి యత్యావశ్యకములని యిప్పటికైన మనవారికి తెలియవచ్చుచుండుట మిక్కిలి సంతోషింప దగియున్నది.

బాల్యమాది సప్తిపూర్తివరకు కవిగారిమనుగడ సమగ్రముగ నిందు బొందుపరుపబడినది. ఆద్యంతము వారి జీవితమున దేశ, భాషాసేవానిరతి తొలుకాడిపోయినది. ఒక్కమారీగ్రంథమును చదివినయెడల నిట్టిగ్రంథములవలని యుపయోగ మేమో పాఠకులకు తనంతనే బోధపడగలదు. తనదేశము, తనభాష కవిగారికి పరమార్థము లయినవి. కవిగారి జీవితము ధన్యము. ఆయనఅడుగుజాడల చరించుట యాంధ్రులకు శ్రేయోదాయకము. ఆయననుగురించి విశేషము వ్రాయుటకన్న నీ పుస్తకమును పాఠకలోకమున కెరుకపరచుటయ చాలును.

### సునిశిత వైద్యము

ప్రకృతి వైద్యములో నొకభాగమైన సునిశిత వైద్యమునుగురించిన ఇ. డి. బ్యాబిట్ గారి రచనకు పుచ్చా వెంకట్రామయ్యగారి యనువాద మిది. సునిశిత వైద్యమనగా మనలో నిగూఢమైయున్న, ప్రాకృతికములైన తత్త్వములను సునిశితశక్తుల (Fine forces) వల్లనే చికిత్సచేయుట యన్నమాట. మనయందు దడగి మడగియున్న ధాతు, మానస, ఆత్మశక్తులను గదలించి, యుజ్జీవింపజేయగల సూర్యకిరణ ప్రసారాది సూక్ష్మతమ శక్తులవల్ల నిజమైన, శాశ్వతమైన వ్యాధి నివారణ గలుగునని యీగ్రంథము విరివిగ నిరూపించుచున్నది. సునిశితవైద్యవిధానము, అందుకువలసినసామగ్రి, నివారింపదగు వివిధరోగములు సచిత్రముగా, వివరముగా, చక్కగా నిరూపింపబడినవి. ఈ పుస్తకము బెజవాడ ప్రకృతి కార్యాలయమునందు దొరకును.

### యోగమకరంద

(కన్నడము)

యోగవ్యాయామము, యోగాసనములు మొదలయిన యోగాభ్యాసవిధానములు సులభమైన శైలిలో చక్కగా వివరింపబడినవి. అభ్యాసకులకు గూడ ఇది మిక్కిలి యుపయోగింపగలదు. సులభముగ నీవిధానములు బోధపడుటకై చిత్రములుగూడ విశేషముగ జేర్చబడియున్నవి. తెలుగువారు గూడ విశేషశ్రమలేకుండ అవగాహనపరచుకోగలిగిన సరళమైన కన్నడము. గ్రంథకర్త చిరకాలముగ నీవిద్యను బోధపరచుచున్న అనుభవశాలురు; పండితులు. నేర్పుతో అభ్యాసకుల కనుకూలించునట్లు వివరముగా దీనిని రచించినారు. మైసూరు జగన్మోహన ప్యాలెస్‌నందలి టి. కృష్ణమాచార్యులకు (గ్రంథకర్త) వ్రాసి యీపుస్తకమును తెప్పించుకొనవచ్చును.

### శ్రీ మద్వాల్మీకి రామాయణమ్

ఆంధ్రీకృత సుబోధినీవ్యాఖ్యాన-టీకాతాత్పర్య, విశేషార్థసహితము; వ్యాఖ్యాత; శ్రీఘండికోట సుబ్ర

హ్మణ్యశాస్త్రి. ప్రకాశకుడు; గోటేటి కృష్ణమూర్తి శర్మ, మామునూరు, కృష్ణాజిల్లా.

క్రౌను ౧/౮ సైజు. అట్టబైండు. నాల్గు సంపుటములు. ఒక్కొక్కదానివెల ౧-౮-౦. మొత్తము పుటలు ౬౫౯.

శ్రీ వాల్మీకి రామాయణమును సులభముగ అర్థము చేసికొని, విశేషములను తెలిసికొనుటకు తగిన వ్యాఖ్యానములు తెలుగున అరుదు. అట్టి సులభ వ్యాఖ్యానములలో ఈ 'సుబోధిని' యొకటి. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సంస్కృతభాష నున్న పయి వ్యాఖ్యానము నాంధ్రీకరించి ఆంధ్రప్రపంచమున కొసంగుచున్నారు. ఇందు ప్రతిశ్లోకమునకు ప్రతిపదార్థ తాత్పర్యములు, ఆవశ్యకమగు చోట విశేషార్థములు వివరింపబడినవి. అనువాదము యథామూల మగుటచే అచ్చటచ్చట ఆంధ్రత్వమునకు కొంచెము కొఱత కలుగుచున్నది. మచ్చున కొక్క యుదాహృతి.

"పురే కోశే జనపదే
బాంధవేషు సుహృత్సు చ,
కుశలం కౌశికో రాజ్ఞః
పర్యపృచ్ఛత్సుధార్మికః.

టీ. సుధార్మికః=చక్కగా ధర్మము నాచరించునట్టి, కౌశికః=విశ్వామిత్రుఁడు, రాజ్ఞః=దశరథమహారాజుయొక్క, పురే పురమునందును, కోశే=ధనమునందును, జనపదే=దేశమందును, బాంధవేషు=బంధువులయందును, సుహృత్సుచ=స్నేహితులయందును కుశలం=క్షేమమును, పర్యపృచ్ఛత్=అడిగెను."

[సంపుటము ౧. పుట ౨౧౦.]

చాలవఱకు తెనిగింపు మూలము నతిక్రమింపకయున్నది. మూలగ్రంథము నర్థము తెలుగుగదలచువారికీ వ్యాఖ్య మిక్కిలి ఉపయోగకరము.

౬౫౯ పుటల పరిమితిగల నాలుగు సంపుటములలోను బాలకాండములోని ముప్పదియొక్క సర్గములకే వ్యాఖ్య చేయబడినవి. అవశిష్టభాగము అనేకముగ కలదు. వెల ఎక్కువ. కాన ఒక్కొక్క కాండమును రెండు, మూడుసంపుటములలో ముగించి, వెల తగ్గించినచో గ్రంథమునకు ప్రచారము కలుగవచ్చును.

శ్రీ శాస్త్రిగారు తగినరీతిని తక్కినభాగములను వెలువరించి భాషాసేవ యొనరుతురుగాక!

బు. వేంకటరమణయ్య.

---

## నిర్వచనమహాభక్తవిజయము శ్రీ

(ప్రథమసంపుటము)

గ్రంథకర్త; కవిశరభ శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణకవిగారు. క్రౌను ౧/౮ సైజు. ౨౩[illegible]+౧౮౨ పుటలు. వలయువారు నైజాంరాజ్యము, మహబూబునగరుజిల్లా, వనపర్తిసంస్థానంపోస్టు, పెద్దమందడిగ్రామమున నున్న గ్రంథకర్తగారికి వ్రాసికొనవలెను.

'భాగవతోత్తములగు ప్రియదాసులవారు సంస్కృతమున శ్లోకరూపముగా మొదట నీభక్తులచరిత్రమును వివరించియున్నారు. దానినిబట్టియే యనేకులనేకభాషలలో గద్యరూపముగనో, పద్యరూపముగనో ఇప్పటికి మార్చుకొనుచు కృతార్థు లగుచున్నారు. అట్లే శ్రీ కోయిలధనాల దేవరాజుగారు అనుభక్తవతంసము మన యాంధ్రభాషయందు గడువిపులముగా వ్రాసియున్నారు. అది యాధారముగా గొని యిపు డీమహాకృతి పెద్దమందడి పూదత్తు వేంకటకృష్ణకవిగారిచే కేవల పద్యరూపముగా రచియింపఁబడినది.'

గ్రంథకర్త 'ఈగ్రంథము దాదాపు ఇరు[illegible] వత్సరములకితమే రచనాసమాప్తి గావించె' నెను. 'ఇట్టి గొప్పగ్రంథము నొకేపర్యాయము సంపూర్ణముగా ముద్రించుట సాధ్యముకాదు.' 'ఈహేతువుచేత నీగ్రంథమును ప్రతిసంవత్సరము నాల్గుమాసములకు ౧౦౦౦ పద్యములుగల సంపుటము చొప్పున నాల్గుసంవత్సరములలో ౧౨ సంపుటములతో బూర్తిముద్రణము గావింపబడునట. ఇదియే తొలిసంపుటము.

ప్రస్తుతకాలమున ఆంధ్రవాఙ్మయాభివృద్ధికై గద్యకావ్యములవలె పద్యకావ్యములు తోడుపడజాలవని పరి

శోధకులయాశయము. అట్టివో నిర్వచనపద్యకావ్యముల ప్రాముఖ్యము వేఱుగ జెప్పబనిలేదు. 'నిర్వచన' నియమ గ్రహణమున లెక్కకుమిక్కిలి వ్యర్థపదములు నిర్బంధముగ పద్యముల కెక్కుట యిట్టి గ్రంథములందు సాధారణము. భక్తులచరిత్రలు వచనముగ నున్నపుడే సర్వజనసులభగ్రాహ్యములయి యుండును. కాని గ్రంథకర్త దీని నిరువదిసంవత్సరములక్రిందటనే వ్రాయుటచే తత్ప్రకటనమున వారికి మెండగు కుతూహలముండుట సహజము.

ఈ ప్రథమఖండమున జయదేవ - తులసిదాస - సూరదాసు లను మువ్వురు భక్తుల చరిత్రములు కలవు. ఇందు మొదటి యిరువురిచరిత్రము సంగ్రహముగను, కడపటివారిచరిత్రము కడువిపులముగను వర్ణింపబడినది. ఆయా భక్తుల విజయము లిందు సుప్రతిపాదితములు.

గ్రంథకర్తనుగూర్చి పీఠికారచయితలు '...... ఆంధ్రవ్యాకరణము లెన్ని గలవో యన్నియు నెప్పుడు వీరికి సాక్షాత్కరించియుండును. వీరికి నాంధ్రసాహిత్యమున గల విజ్ఞత మేలు......వీరికి సంస్కృతభాషా శైలి వింతవస్తువు కాదు......ఈకవిగారు గతసంవత్సరమున గద్వాలసంస్థానమున తదాస్థానకవివర్యు లగు బ్రహ్మశ్రీ గాడేపల్లి వీరరాఘవశాస్త్రి శతావధాని శేఖరులచే 'కవిశ్రేష్ఠ' బిరుదము బడసిరి—' అని యింకను గ్రంథకర్తకుగల గణిత, జ్యోతిషశాస్త్ర పాండిత్యమును ప్రశంసించిరి. ఈ గ్రంథమునుబట్టి తత్త్వము నిశ్చయింపవలసియున్నది.

'నిర్వచన మహాభక్తవిజయము' నందలి కవిత సరళమైనది. కాని పద్యము సాగుటకు లెక్కలేని వ్యర్థపదములతో నుకావలసివచ్చినది. అట్టిపదములు పెక్కులు. ఈ గ్రంథమహోదధియందు 'అల' ల హోరు హెచ్చు. అన్నిలేని పద్యము లల్పసంఖ్యాకములు. అట్లే 'అనన్' అనుటకు 'అందవన్' (అందు + అనన్) అని ధారాళముగ నుపయోగింపబడినది. శ్రేష్ఠవాచకములగు 'ఇంద్ర, రాజ' శబ్దముల యుపయోగ మిందెచ్చికము.

గ్రంథకర్తగారి సంస్కృతాంధ్రకవితా సంప్రదాయజ్ఞతకు కొన్ని ఉదాహరణములు—

పుట ౧౫. అనవద్యకవినుత కలితకీర్తి, కవినుత కవిత' అన అర్థము?

౩. నిస్తుల సముజ్వల మంజులవంశ.

౧౨. శ్రీ రమణీయమై సుజనసేవనమై సేవితము కాని సేవనముకాదు.

౨౬. తాంత్రికశాస్త్రవి వ్యగగణ్యకోవిదు. ను. ఇచట కోవిదులనుట పునరుక్తి.

౩౩. పాదునూతినిడి

('నూతిలో త్రోసి' అనుటకు)

౪౩. నిజపురీమణి కేగి.

౪౪. నాకు నపకృతినిడిన

('నా కపకార మొనర్చిన' అనుటకు.)

ఇందు 'జయదేవు' డనుటకు బదులు 'జయూర్య' డని చాలచోట్ల చెప్పబడినది.

౫౩. 'తద్ఘనగృహేంద్రము లోపల'

('ఆ గొప్పయింటిలో' అనుటకు)

౫౩. 'నిద్రావివశాత్మ సర్పమణి రాజితవాలము.

(నిద్రించియున్న పాముతోక)

౫౯. "పాలు చేదుకాదొ"

౬౨. 'చరిత్రరాజము'

౭౯. 'కారాగారంబునందుఁ గలిపితివి'

(కారాగారమున నుంచితి వనుటకు)

౯౦. 'కనియెన్ లావణ్యుఁడౌ పుత్రునిన్.'

౯౩. 'సుకీమధురాంచిత వాణి'

లావణ్యము గుణము కాని గుణిగాదు.

మధురము గుణి కాని గుణముకాదు.

౯౫. 'విద్వస్తుతాంచద్యశా!'

(విద్వత్ స్తుతయశా అనుటకు)

౧౦౩. 'చెవిటికి స్వరమాలఁ జేర్చినటుల'

'చెప్పినటుల' కాని 'చేర్చినటుల' కాదు.

౧౨౬. 'బహుళ దేవాలయ వ్రాతంబు.

'బహుళ' గాని 'వ్రాతము' గాని

ఒక్కటి చాలును.

౧౩౪. 'ప్రాణపదంబైయైన'

ఇచటి సముచ్చయ మనర్థకము.

౧౪౫. 'నగరసత్తము చెంగట' (గొప్పపట్టణము చేరువ అనుటకు)

౭౩. పుటలో సంస్కృత శ్లోకములలో 'గోవిందా! నరసింహా!' అని ఆకారాంత సంబోధనలు కలవు. అవి హ్రస్వాంతములై యుండవలెను.

ఇట్టివింకను లెక్కకు మిక్కిలిగ కలవు. ఛందో విషయమున కొంత—

౧౬ వ పుటలో 'గ్రంథముద్రణోద్ధారకుల వంశ క్రమవర్ణనమున తొలిపద్యమున 'విబుధవర్ణిత సత్కళావనుఁడు ఘనుడు,'

౭౪. 'అనుపమభక్తిమీఱ హరిపూజ లొనర్చి'

౧౦౫. 'శోఁడ్కానిచనియింటిలోపలికి 'గాతు కమొప్ప.'

౧౬౬. 'మనుఁగుటఁ బంచగవ్యముల పాపము ప్రాచితమయ్యె'

పైసలములలో యతిభంగము.

వ్యాకరణ విషయమున కొంత

౧౦! ధరణీ, యంచిత యశోవిశాలయై'

(ధరణి నంచిత—అని యుండవలెను. ఇట ద్రుతప్రకృతికము కళ్లైనది.)

౧౪. 'నేన్నావనులార! యంచు'

ఇచటి ద్రుతసంశ్లేషము తప్పు.

౨౨. 'ఎవండు జదివిన—'

ప్రథమమీద సరళాదేశ మసాధువు.

౨౬. 'పోవుము నపార దయామతి.'

'పోవుము' ద్రుతప్రకృతికము కాదు.

ఇంక నిట్లే 'జోతలానర్ప యొజ్జకున్' (౩౧), సుధీమంతుడు జెన్నారుడున్ (౪౧) మరుదాత్మజుడు, (౬౩), నేరనైతివి నెవ్వండో (౬౩), నాపతి నీట్లె గాన (పతి యీగ్లె ననుటకు, ౬౩) నేయుచున్నాఁడు నిత డేవంకు (౧౪౯) మొదలుగునవి సంఖ్యాతీతములు.

సముచ్చయముల కిందుగల ప్రయోగము స్వతంత్రము వలసినపుడెల్ల అవి సందర్భము లేకున్నను చొరబడుచుండును. మచ్చునకుఁ గొన్ని -

౯. సంస్తుతులాచరించియున్. ౭౯. నొంద నెంచియున్, ౬౪. తిరోహితుఁడునయ్యె. ౫౨ అత్తయాన తియును మొదలగునవి.

ఇట్టిదోషముల కీగ్రంథము పుట్టినిల్లు. గ్రంథకర్త యొకచో 'కవిశేఖరుం డెల్లకార్యంబులందుండి, గ్రామ్యములను నూటిఁ గనినయటులు' అని తన గ్రాంథికవాదిత్వము స్థిరపఱచుకొనుచున్నాఁడు. అతని మతమున పయి ప్రయోగముల నేమనవలెనో?

ఇఁక వర్ణనౌచిత్యమును పరిశీలించిన పెంపుచేయ వలసినచోట కుదించుటయు, కుదింపవలసినచోట పెంపుసేయుటయు అంతట కానవసును. తులసీదాసునకు భార్య నదుపదేశమునేయుట మొదలగుపట్టుల వర్ణన ఔచితిని కోలుపోయినది.

ఈగ్రంథమునకు పీఠిక వ్రాసియిచ్చిన విక్రాల నరసింహాచార్యులుగారు ఇట్లనుచున్నారు— 'ఈ కవిగారు ఈ నిర్వచన మహాభక్తవిజయమును బరిశీలింపనాకొసగినందున నేను మిగులశ్రద్ధతో నామూలాగ్రముగఁ బరిశీలించితిని. అందు నిగూఢముగానుక్ల ప్రతిపచ్చంద్రుని వలె నుండిన మిగుల కొలది సంశయాంశములను సవరించితిని............ఇట్టి మహాకృతి సర్వవిధముల నిర్దుష్టముగను, సరసముగ నున్నదను నంశమతిశయోక్తి యు, సాహసము కాదనుట నిక్కమని నానమ్మిక.' వారి సదభిప్రాయమునందలి విశ్వాసముననే కాబోలు గ్రంథకర్త తన సత్కృతిని ద్రోవవలెనని మొక్కరానివేల్పులకు మొక్కులు ఒప్పగించినాఁడు. 'పండితకవులు నీ సంపుటము తమ కందినతోడనే పరమానుగ్రహముతో గ్రంథ ప్రాశస్త్యాభిప్రాయముల బంపవలెన'ని అతని

'విజ్ఞప్తి' లేశము. ప్రార్థనముకంటె పరిశోధనపూర్వకముగ గ్రంథమును ప్రచురించుటయే ప్రాశస్త్యసంపాదనమున కనుకూలమగు మార్గము.

గ్రంథకర్త తక్కిన సంపుటములయినను తగిన పరిశోధకులచే సంస్కరింపజేసి ప్రకటించుట తఃకు, వాఙ్మయమునకు కూడ మహోపకారకము.

బు. వేంకటరమణయ్య

---

# స్వీ కా ర ము

---

## సౌభద్రుని ప్రణయయాత్ర

(పద్యకావ్యము)

క్రౌను ౧/౮ సైజు పు. ౧౩౫.

గ్రంథకర్త: నాయని సుబ్బారావు.

ప్రకాశకులు: రసతరంగిణి గ్రంథమాలవారు, బందరు.

---

## హిందూదేశచరిత్ర

(రెండుభాగములు)

క్రౌను ౧/౮ సైజు పు. ౧౫౩+౧౮౮, వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త: నాయని సుబ్బారావు, బి. ఏ., బి. ఇ౭. నర్సారావుపేట.

ప్రకాశకులు: ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెని, తెనాలి.

---

## పుట్టుమచ్చలశాస్త్రము

(ఫలదీపిక)

డెమ్మీ ౧/౮ సైజు, పు. ౮౩

గ్రంథకర్త: నేదునూరి గంగాధరం.

ప్రకాశకులు: కొంపపల్లి వీరవెంకయ్య, శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

---

## బ్రహ్మానంద మేలుకొలుపులు

డెమ్మీ ౧/౮ సైజు, పు. ౩౨

గ్రంథకర్త: నేదునూరి గంగాధరం.

ప్రకాశకులు: గుండు జగన్నాథం సన్, బుక్కుసెల్లరు, రాజమండ్రి.

---

## భక్తత్యాగరాజు

డెమ్మీ ౧/౮ సైజు పు. ౮౪. వెల రు. ౧

గ్రంథకర్త: విన్నకోట వేంకటరత్నశర్మ.

---

## లియోటాల్‌స్టాయి

(వచనము)

క్రౌను ౧/౮ సైజు, పు. ౧౦౭, వెల ౦-౩-౦

గ్రంథకర్త: యం. రామమోహనరావు, విశ్వసాహిత్యమాల, ముంగండ, తూ. గో.

---

## హిందూమతము

క్రౌను ౧/౧౬ సైజు, పు. ౮౨, వెల రు. ౦-౨-౦

గ్రంథకర్త: బులుసు వేంకటేశ్వర్లు, ఎం. ఏ., పి. ఆర్. కాలేజి, కాకినాడ.

---

## కాంగ్రెసుచరిత్ర

(తెలుగు)

డెమ్మీ ౧/౮ సైజు. పు. ౮౭౦ × ౮౫ × ౬,

వెల రు ౨-౮-౦

గ్రంథకర్త: భోగరాజు పట్టాభిసీతారామయ్య,

అనువాదకులు: కొడాలి ఆంజనేయులు.

గ్రంథములు దొరకుచోటు: ఆంధ్రపత్రికా కార్యాలయము, ౬, ౭, తంబుశెట్టివీథి, జి.టి. మద్రాసు.

---

## కైౖస్తవప్రభుత్వ నిర్మాణతత్త్వము

క్రౌను ౧/౮ సైజు, పు. ౨౦౦, వెల రు. ౧-౮-౦.

మూల గ్రంథకర్త: కీ. శే. మేజరు బి. డి. బసు ఐ. యమ్. యస్.

అనువాదకుడు: మహీధర జగన్మోహనరావు, విశ్వసాహిత్యమాల, ముంగండ, (Via) అంబాజీపేట, తూ.గో.

---

The History of the Indian National Congress (1885-1935)

(ఇంగ్లీషు)

డెమి ౧/౮ సైజు పు. ౧౧౮౨. వెల రు. ౨-౮-౦

గ్రంథకర్త: భోగరాజు పట్టాభిసీతారామయ్య.

ప్రకాశకులు: దక్షిణభారత హిందీ ప్రచారసభ, హిందూస్థాన్ బిల్డింగ్సు, ౧౦౪ అర్మీనియను వీథి, జి. టి. మద్రాసు.

---

శ్రీమదాంధ్రమహాభారతము

(పద్యము)

(సం. ౧. ఆదిసభారణ్య విరాటోద్యోగపర్వములు)

డెమ్మి ౧/౮ సైజు పు. ౯౪౬. వెల రు. ౨-౮-౦.

ప్రకాశకులు: శ్రీకృష్ణసేవాలయము, ౫౫ స్ట్రాటన్ ముత్యా మొదలి వీధి, మదరాసు.

---

మాలపల్లి (సంగవిజయం)

డెమి ౧/౮ సైజు పు, ౬౦౦ వెల రు. 3.

గ్రంథకర్త: ఉన్నవ లక్ష్మీనారాయణ.

ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల, తపాలుపెట్టె నెం. 212 చెన్నపురి.

---

"గుప్తమంత్రము"

రు 100 ల బహుమతి

లక్షలకొలది ధనము ఖర్చుచేసినను నెరవేరనిపనులు ఈ మంత్రమును 7 సార్లు జపించినయెడల కార్యసిద్ధియగును. దీనికై విశేషముగా కష్టపడనవసరములేదు. ఇది వశీకరణమంత్రము. దీనితో ఎటువంటివారినైనను వశీకరణ మొనర్చుకొనవచ్చును. దీనిచే మీకు అదృష్టము కలుగును. ఉద్యోగము దొరకును. వ్యాజ్యములలో గెలువవచ్చును. వ్యాపారములో లాభముకలుగును. సరిగా మంత్రము పారలేదని రుజువుచేసినచో రు 100 లు బహుమతి యివ్వబడును.

పోస్టేజితో ఖరీదు రు. 2-7-0 లు.

జాబులు యింగ్లీషులో వ్రాయుడు.

**Siddh Mantra Ashram,**

No 15/2 P. O. Katrisarai, (Gaya).

152

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచవ్యవహారము లంధకారబంధురములుగ నున్నవి. అంధకారబంధురమైన వ్యవహారములం దాశాతటిల్లతలు క్షణకాలము సంభ్రమమును గలుగజేసినను సకల వ్యవహారములందును మామూలు నాటకములు ప్రదర్శింపబడుచు విషాదయోగము సంభవించుచున్నది. పండిత పామరులు, నాయకానుచరులు, వృద్ధయువకులు, పరహితస్వార్థపరాయణులు ధర్మసంకీర్తనమును, ప్రజ్ఞావాదమును సమానముగ నారాధించుచు ధర్మజిజ్ఞాసారాధనములను దుర్లభము చేయుచున్నారు. ప్రజాస్వామికము, నిరంకుశత్వము, పరహితప్రలాపము, స్వార్థారాధనము నియతకర్మ లైనను కర్మయోగము దురారాధ్యముగ నున్నది. సకల వ్యవహారములందును ప్రజ్ఞావాదము పరమార్థమై ధర్మమంతరించుచున్నది. అసురబలారాధనము ప్రధానమై, దైవబలారాధనము పరిహాసపాత్రముగ నున్నది. అసురబల సంపన్నతయందు వ్యక్తులు, సంఘములు, జాతులు చూపుచున్న యహమహమిక ప్రళయబీభత్సరౌద్రపరిణామమును పొందుచున్నది. స్వస్తిమంత్రములు ప్రళయయజ్ఞములు పరమార్థసాధనము లయినవి. నానాజాతిసమితి శాంతిస్వస్తి వాచకములను ప్రతిపాదించుటయును, నాయకుల పటాటోపములు సంభ్రమమును సకలజాతులును మారణహోమద్రవ్యములను సమకూర్చుటయును ప్రపంచము నావరించిన విషాదయోగమునకు గంభీరదర్శనము. చక్రవర్తులు, మంత్రులు, యోగులు, కవులు, మహాత్ములు, మతగురువులు, నియంతలు, నాయకులు మొదలగు మహానుభావులు చేయుచున్న ఘోరయజ్ఞములు సకల జనులకును స్వధర్మారాధనమును దుర్లభము చేయుచున్నవి. పురాణయుగములందువలెను నవీనయుగమునందును రాక్షసనాయకులు పూనిన దురభిమాన దురహంకారములు కాలాంతరమునందు ధర్మసంస్థాపనమునకు వినియోగపడినను, వర్తమానకాలమునందును మహాదుఃఖానుభవమునకు మూలములుగ నున్నవి. మానవ స్వాతంత్ర్య ధర్మావతరణమునకు ప్రపంచ మనుభవించుచున్న దుఃఖవేదన వర్ణనాతీతము. మానవ స్వాతంత్ర్య ధర్మసమరమునందు మతాచారములు, సాంఘిక వ్యవస్థలు, రాజకీయప్రయోజనములు, ఆర్థిక సాధనములు మొదలగునవి గలుగజేసిన భయంకర సంఘటనములు ప్రకృతిసిద్ధములైనను దుర్భరములుగ నున్నవి. ప్రజానాయకులు దేశాభిమాన వ్యాజమునను గలుగజేయుచున్న హింసా దౌర్జన్యములు మూలప్రయోజనమునే నిర్మూలము చేయుచున్నను నాయకుల పటాటోపములు సంభ్రమమును

గలుగజేయుచు ప్రజలను నిస్సహాయులను జేయుచున్నవి. ముస్సోలిని, హిట్లరు, స్టాలిను, రూజువెల్టు, బాల్డువినుగారులు మొదలగు నాయకులు ప్రజాహృదయమునందు గలుగజేసిన సమ్మోహము వర్ణనాతీతము. ముస్సోలినిగారు మానవ ధర్మాభ్యుదయవ్యాజమున నను గలుగజేయుచున్న సంహారము నానా జాతిసమితి ధిక్కారమును బడసినను నిరభ్యంతరముగ నడుచుచున్నది.

*　*　*

అబిసీనియా దండయాత్ర

ముప్పదేండ్లకుపూర్వము జరిగిన రుష్యా జపానుయుద్ధ మాసియాఖండ ప్రబోధమునకు వినియోగపడినటులు ఇటలీ అబిసీనియాల యుద్ధమునుఆఫ్రికాప్రబోధమునకు వినియోగపడుట మానవధర్మాభ్యుదయమునకు సాధనము గాగలదు. ఆఫ్రికా ప్రజలయందు యూరపుజాతులు మానవ ధర్మోద్ధరణమును జేసిన విధమును వారి దుస్సహ దురంతముల రూపమునను చిత్రగుప్తుడు శాశ్వతముగను వ్రాసినాడు. యూరపియనులు కామ లోభ మోహ మదపీడితులై రబ్బరు, దంతములు, ఖనిజములు మొదలగు పదార్థములను సంగ్రహించుటకు చేసిన ఘోరకార్యములు యూరపుజాతులకు కళంకమును గలుగజేసినవి. ఇపుడు ఇటలీసైనికులు ఎతియోపియనుల పట్లను చేయుచున్న దురంతములును వారు నాగరకత్వమును వ్యాపింపజేయగల విధమునకు నిదర్శనములు. గ్రామములను, చర్చిలను, రెడుక్రాసు శాలలను, వైద్యశాలలను బాంబులవర్షమును కురిపించి నాశనము చేయుట సాహస పరాక్రమములకు నిదర్శనములు కావు. ఈ విషయములందు ముస్సోలినిగారి సమర్థన మంతయును నిరర్థకము. సంగ్రామ మారంభమయి అయిదుమాసములు గతించినను, వాయువిమానములు, టాంకులు, మరఫిరంగులు, బాంబులు, విషవాయువులు ప్రయోగింపబడినను ఇటలీసైన్యముల విజయము సంశయాస్పదముగ నున్నది. ఆడిగ్రాటుయుద్ధమునందు అబిసీనియనులకు గలిగిన విజయము అబిసీనియనుల కుత్సాహమును, వారిశత్రువులకు నిరుత్సాహమును గలుగజేయుట నిశ్చయము. సనాతనమై చిరకాల మవిచ్ఛిన్నముగను నిలిచియున్న అబిసీనియాపట్ల నిష్పాడైనను గౌరవ వినయ భావములను జూపుట ఇటలీప్రజలకు కర్తవ్యము. హిట్లరుగారి పరిహాసములును, ఇచ్చకపుమాటలును భారతీయులను స్వరాజ్యదీక్షయందు విముఖులను చేయజాలవు. వెనుకను కైజరుగారి ముష్టిప్రహారములు జర్మనీకి ప్రపంచమునకు సమకూర్చిన ఫలమునె హిట్లరుగారి పటాటోపమును గలుగజేయగలవు. పరాక్రమణ సాధ్యమైన బ్రిటీషుసామ్రాజ్యమునకును నీ ప్రతిబంధకము సహజసిద్ధము.

*　*　*

బ్రిటీషుసామ్రాజ్యము

యూరపు రాజ్యముల నావరించిన రాజ్యనీతికి సకల సందర్భములందును బ్రిటీషు

సమావేశము గానున్న మొదటిసభ. కాంగ్రెసు మహాసభయందు బహిష్కార సహకారములు, మంత్రి స్వీకరణము, సామ్యవాదము, కాంగ్రెసు అంగనిర్మాణమునందు మార్పులు, రానున్న రాజ్యాంగములు, వివిధ పక్షముల సంయోగము మొదలగు క్లిష్టసమస్యలు నిర్ణయము గావలసియున్నవి. కాంగ్రెసు వ్యవహార నిర్వహణము పెద్దలనుండి యువజనుల కధీనమగుట సహజము. గాంధి మహాత్ము డస్వస్థతవలనను, నితరకారణముల వలనను కాంగ్రెసునకు రాకపోవచ్చును. లక్నో కాంగ్రెసునకు అయిదారువందల ప్రతినిధులు మాత్రమే హాజరుకావచ్చును. కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు నిర్ణయము లెటులు పరిణమించునో గ్రహించవలసియున్నది. అనుభవజ్ఞులును, నుత్సాహవంతులును నైన పండిత జవహార్లాలుగారీ క్లిష్టసమస్యలను సమస్వయము చేసి కాంగ్రెసు నేకముఖమునను నడుపగలరని విశ్వసింపదగియున్నది. భిన్నరాష్ట్రములందలి ప్రజానాయకులు కాంగ్రెసు సంస్థ పూర్ణ స్వరాజ్యమును బడయుటకు వినియోగపడగల విధమునను కాంగ్రెసు గౌరవప్రతిష్ఠలను, జవాహరిలాలుగారి నాయకత్వముక్రిందను సంరక్షించుట పరమార్థము. కాకినాడయందు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి యధ్యక్షత క్రిందను జరుగనున్న ఆంధ్రరాష్ట్రీయమహాసభయును నీ సందిగ్ధస్థితియందు కాంగ్రెసు ప్రతిష్ఠను గాపాడుటకు మార్గదర్శకమయి నెహ్రూగారి నాయకత్వమును సార్థకము చేయుట శ్రేయస్కరము.



Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.

# అమృతాంజనము

వనమూలికలచే తయారైనవాము, ఎట్టి బాధల నైనను తొలగజేయగలదు కంటి కందమగు డబ్బీలో నుండగలదు, వెలుపలికి వచ్చిన వెంటనే ఉపచరింపగలదు, అన్ని చోట్లను దొరకగలదు. చక్కని డబ్బీతో సహా సీసా 1-కి అ. 8.

# తామరతైలము

త్రివర్ణము గల "సూర్యోదయము" గుర్తు గల తామరతైలము, పూతినాశకములగు చాల మంచి మందులతో తయారుచేయబడి ప్రఖ్యాతిగాంచినది.

డబ్బీ 1-కి అణాలు 6.

# మోహినితైలము

స్త్రీ, పురుషులు వాడుటకు యోగ్యమైనది.

మెదడునకు, కంటికి చలువయిచ్చి సౌందర్యమును పెంపొందించి కురులను పెంచును. సువాసన గలిగించి మనోహరముగా నుండును. సుఖనిద్ర, విశ్రాంతుల నిచ్చును. సీసా 1-కి అణాలు 12.

# దంతచూర్ణము

పంటిపోటును బాపి,- నోటి దుర్గంధమును బోగొట్టి పండ్లు తోముటకు బాగుండును. చిగుళ్లనుండి రక్తము కారకుండ జేయును. డబ్బి 1-కి అణాలు 2

# గజ్జికి తైలము

గజ్జి, చీడ శరీరమంతట వ్యాపించి ముఖ్యముగ చిన్న పిల్లలకు విశేష బాధను గలిగించుచున్నవి. ఈ తైలమును నాలుగుపూటలు రాచిన గజ్జి, చీడ, చిలుము, జిల మొదలగునవి నశించును. తప్పక పనిచేయును. డబ్బీ 1-కి వెల. అ. 4.

# తేలుమందు

కుట్టినచోట కొంచెము మందు పోసిన, బాధ మాయమగును. మందును గలిగియున్న, తాము బాధపడక ఇతరులకిచ్చి పుణ్యము గట్టు కొనవచ్చును. ప్రతి యింట నుండదగినది. సీసా 1-కి వెల అ. 8.

# అమృతాంజనం డిపో.,

బొంబాయి, మదరాసు, కలకత్తా, రంగూను.

